శ్రీరస్తు.

ఆంధ్రతాత్పర్యసహితమగు

# అహోబలపండితీయము.

కవిశిరోభూషణము.

శ్లో. శ్రీమద్భూమితలోదరీతనుభవా వక్షోజసత్పంజర ప్రాంచత్కీరమణిర్గిరీంద్రతనయా చిత్తాబ్జభృంగాగ్రణీః । భక్తవ్రాతభవావ్యథాదవశిఖాప్రోద్భూతవర్షాంబుదో రామస్సర్వజగంతిపాతు సతతం కారుణ్యపాథోనిధిః.

తా. సీతాదేవియొక్క స్తనములను పంజరమందు చిలుకైనట్టియు, పార్వతీమనఃపద్మమునకుఁ దుమ్మెదయైనట్టియు, భక్తుల బాధలనెడు దవాగ్నిజ్వాలకు వర్షకాలమేఘమైనట్టియు, దయకు సముద్రుఁడైన రాముఁడెల్లజగంబులను నెల్లపుడు రక్షించుఁగాక.

శ్లో. దృగ్భృంగీబాహుశాఖా కుచఫలసహితాహారపుష్పాళియుక్తా।
హాస్తాంచత్పల్లవాంకాస్ఫురితపరిమళాసత్క్రృనాపుష్పవారిః।
సర్వాభీష్టప్రదాత్రీనిఖిలభువనగాసర్వహేతుర్నవీనా।
శ్రీసీతాకల్పవల్లీవసతుమనసిమేసర్వదాసుప్రసాదా.

తా. చూపులనుతుమ్మెదలును, కేలులనుకొమ్మలును, కుచములను ఫలములును, ముత్యాలపేటలనుపుష్పములును, హాసములనుచిగుళ్ళను, జొయ్యను పువ్వుదేనెయు కలిగి ప్రకాశించుచున్నదై, అన్నికోరి

కల నిచ్చునదియై, సమస్తలోకములను బొందునదియై, క్రొత్తదియగు సీతయను కల్పవృక్షపుతీగ యెల్లప్పుడు మిక్కిలి యనుగ్రహముకలదై నామనంబున నుండుఁగాక.

శ్లో. ఏషాంసుధీకృతిఘటాంతర సత్పదార్థాజీవాతవోపిసతినేతరి మూకతైవ । సుస్నేహసౌఖ్యమపినైవముదావహాంస్యాత్తేషాంహి దుష్కవిశునామిహనప్రసంగః.

తా. ఎవనికి బుద్ధిమంతుల కృతులనెడు కుండలయందలి పదార్థములు జీవనౌషధములో, ఎవనికి అధికారియుండఁగా మూఁగితనమో, ఎవనికిఁ జెలిమియను నేతివలననైన సుఖము సంతోషమునీయదో, అట్టి దుష్కవిశునకములకు నిందుఁ బ్రసక్తిలేదు.

శ్లో. దోషోపిగుణతాంయాతి పండితానామనుగ్రహాత్।
అయస్సువర్ణతామేతిసంస్పర్శాత్స్పర్శవేదినః.

తా. పండితుల యనుగ్రహమువలనఁ దప్పులు నొప్పగు. అది యెట్లనిన, పరశువేది తగులుటచే నినుము బంగారమగుచున్నది.

శ్లో. గ్రంథేస్మిన్వర్తతేనైవదుష్టశంకాపిశాచికా।
పండితానుగ్రహాద్గదివ్యరక్షాభిరక్షితే.

తా. పండితుల యనుగ్రహముచే రక్షింపఁబడు నీగ్రంథమందు దుశ్శంకయను పిశాచము సోకదు.

శ్లో. యజ్జ్ఞానధుర్యధియఏవ సుధీవతంసా నిర్దూషణాంధ్రకవితాభరణంభరంతి । సోఽయంసుధీజన శిరోమణిరంధ్రశబ్దచింతామణిర్విజయతేఽధిక గూఢభావః.

తా. దేనినిఁ దెలిసిన బుద్ధిమంతులేదోషములేని యాంధ్రకవితయను నలంకారమును ధరించుచున్నారో యట్టి గూఢాభిప్రాయము గలదియుఁ, బండితులకుఁ దలమానికమైనదియు నగు నాంధ్రశబ్దచింతామణి సర్వోత్కృష్టమై యొప్పుచున్నది.

విశేషణలక్షణాచ్చ, ఆర్యాద్యర్ధసమాగీతిరితి పైంగళసూత్రాచ్చగురు లఘుప్రమాణ నిశ్చయాదిత తత్ప్రపంచనంతువృత్తరత్నాకరే,తద్వ్యాఖ్యానేలలితేచ ద్రష్టవ్యం.

తా. ఈగ్రంధమందన్నియు నార్యాగీతిపద్యములు. ఆర్యాగీతి లక్షణంబెట్లనిన:—నాలుగుమాత్రలొక గణముచొప్పున నేడుగణము లును, రెండుమాత్రలునుగలిగి బేసియందుజగణములేకుండునది యార్యయని సామాన్యలక్షణమువలనను, మొదటి రెండుభాగములయందును మూఁడేసిగణములపైఁ బాదాంతముకలదిపద్యయని ఛందశ్శాస్త్రి మెత్తిఁగినవారు చెప్పెదరనివిశేషలక్షణమువలనను, ఆర్యయొక్క మొదటిసగముతో గీతియగునని పింగళసూత్రమువలనను, దెలియవలెను. గురులఘుగణాది వివరణము వృత్తరత్నాకరమందును దాని వ్యాఖ్యయగులలితమందును జూడవలయును.

## ౧ సూ. విశ్వశ్రేయఃకావ్యం.

వ్యా. కీర్త్యాదిసమస్తశ్రేయస్సాధనం కావ్యమిత్యర్థః—శుద్ధసారోపలక్షణయా, అవ్యభిచారేణ, కార్యనిష్పాదకత్వంధ్వన్యతే.

తా. కావ్యము కీర్త్యాదిసమస్తశ్రేయస్సునగును అనఁగాసమస్తశ్రేయస్సులకును సాధనమైనదని లక్షణముచేవచ్చిన యర్థము. ఈలక్షణముచేత సందేహములేక శ్రేయోరూపకార్యము కలుగుననితోచుచున్నది.

వ్యా. కవయతే, వర్ణయతీతి, కవిః, సచ, శ్లో. సత్కులీనశ్శుచిర్దక్ష చ్ఛందోవ్యాకరణాదివిత్, ప్రశాంతసుభగాకారో దైవజ్ఞశ్చ కవిర్భవేదిత్యాది వచనోక్తగుణసంపన్నః.

తా. సూత్రమునందలి కావ్యశబ్దమును నిర్వచించువాఁడై యాశబ్దమందలి కవిశబ్దమునకు వ్యుత్పత్తిజేయుచున్నాఁడు. వర్ణించువాడు

గాన, కవి. అతఁడుమంచివంశమునందుఁ బుట్టినవాఁడును, పరిశుద్ధుడును, సమర్థుఁడును, ఛందశ్శాస్త్రము, వ్యాకరణశాస్త్రము మొదలగునవి యెఱిఁగినవాఁడును. శాంతిఁగలిగి సుందరమగు రూపముగలవాఁడును, జ్యోతిశ్శాస్త్రముఁ దెలిసినవాఁడును, గవియగునని లక్షణమందుఁ జెప్పిన గుణములుగలవాఁడై, యుండవలెను.

వ్యా. సచ, వివేకి, వాచక. రౌచకా౽౽ర్థిక, శిల్పిక, భూషణా౽ర్థి, మార్దవా౽నుగతాఖ్యాభిస్సప్తవిధః॥ శ్లో. గుణదోషవిభాగజ్ఞో వివేకీపరికీర్తితః। అనుప్రాససమాబద్ధపదబంధస్తువాచకః। ప్రసాదమధురాయుక్త వచనోరోచికోభవేత్। అర్థసంగ్రహచాతుర్యయుక్తస్స్యాదార్థికఃకవిః। శిల్పికస్తుభవేద్దక్షః కవనేయమకాన్వితే। సాలంకృత్యర్థ్యాభూషణార్థీ మార్దవీరసతత్పరః॥ ఇతితేషాంలక్షణానిసంప్రదాయసంజీవన్యాం, విద్యాచక్రవర్తినాప్రణీపాదితాని.

తా. ఆకవియును "వివేకి, వాచకుఁడు, రోచికుఁడు, ఆర్థికుఁడు, శిల్పికుఁడు, భూషణార్థి, మార్దవి," యనని యేడువిధములు గలవాఁడు. అందుగుణదోషములెఱిఁగినవాఁడు, వివేకి- అనుప్రాసగలపదగుంభనఁ జేయువాఁడు, వాచికుఁడు. అర్థములనుబొందుపరచువాఁడార్థికుఁడు యమకకవిత్వమునందుసమర్థుఁడు, శిల్పికుఁడు అలంకారయుక్తముగఁ గవనముఁ జేయువాఁడు, భూషణార్థి- రసతాత్పర్యముగలవాఁడు మార్దవి- యని వారిలక్షణములు సంప్రదాయసంజీవనియందు విద్యాచక్రవర్తి చెప్పె.

వ్యా. తస్యకర్మకావ్యం-బ్రాహ్మణాటతాత్పర్యశ్చేతచ్చ, పంకజాదివద్యోగరూఢత్వాద్రసోల్లసితశబ్దార్థ ఘటనార్థకమేవ, నతు,గమనాదికర్మమాత్రమిత్యాలంకారికాః.

తా. ఆకవియొక్క-పని కావ్యము ఆపనియుఁబంకజశబ్దమునకు బురదయందుఁ బుట్టినగుల్లలుమొదలగునవి యర్థముగాక పద్మమర్థమైనట్లుయోగరూఢిచే రసము చేనొప్పుశబ్దార్థములను సంఘటనఁ జేయుట

యేగాని నడచుటమొదలగు పనిమాత్రముకాదని యాలంకారికులు చెప్పిరి.

వ్యా. కావ్యస్యాఽనేక శ్రేయస్కరత్వముక్తం, కావ్యప్రకాశకారాదిభిః॥ శ్లో. కావ్యంయశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే॥ ఇతి- అత్రకృత్, విత్, యుఙ్, శబ్దాః, సంపదాదిత్వా త్క్వబంతా బోద్ధవ్యాః.

తా. కావ్యముకీర్తినిఁజేయునది, ధనమునుఁజేయునది, వ్యవహారముఁదెలియఁజేయునది. అశుభములను బోఁగొట్టునది. వెంటనే మిక్కిలిసుఖమునుగలుగఁజేయునది, స్త్రీతోసమానముగ నిష్టానిష్టములను జెప్పునదియునని కావ్యప్రకాశకారాదులు కావ్యమునేక శ్రేయస్సులకుఁ గారణములుగాఁజెప్పియున్నారు.

వ్యా. అత్ర కీర్త్యాదిబహుప్రయోజనవ్యుత్పత్తావపి రసాస్వాదజన్యా సద్యఃపరనిర్వృతిరేవ ముఖ్యం ఫలమితిరహస్యం. తదుక్తం లోచనకారేణ, చతుర్వర్గవ్యుత్పత్తిరస్యప్రభవతి. తథాపిచానందయేవాఽత్యంతికం ముఖ్యం ఫలంభవతీతి.

తా. ఇందు, కీర్తి మొదలగు ననేకప్రయోజనములు కావ్యమువలనఁ గలిగినను, రసానుభవమువలనఁగల తత్కాలమహానందమే ముఖ్యఫలమని రహస్యము. అట్లుగానియెడల స్త్రీతో సమానమైనదను విశేషణము వ్యర్థమగును-లోచనకారుఁడు—ఈకావ్యమునకు ధర్మార్థకామమోక్షములను ప్రయోజనముకలదుగాని యైనను సానందమే మిక్కిలి ముఖ్యమగుఫలమని చెప్పియున్నాఁడు

వ్యా. పౌరుషేయ మపౌరుషేయంవా వాక్యంశాసనాచ్ఛాస్త్రమిత్యుచ్యతే. తదుక్తమాచార్యైః। శ్లో ప్రవృత్తిర్వా

నిత్యేనకృతకేనవా । పుంసాంయేనోపదిశ్యేత తచ్ఛాస్త్రమభిధీయ త ఇతి.

తా. పౌరుషేయ (పురాణాది) వాక్యముగాని, అపౌరుషేయ (వేద) వాక్యముగాని శిక్షించుటవలనశాస్త్రమని చెప్పఁబడును. ఎట్లన,—ఒకసత్కార్యమునందు నడపుటగాని యొక దుష్కార్యమువలన మరలించుటగాని నిత్యమైనది (వేదము) గాని చేయఁబడినది (పురాణాదికము) గానియగునే వాక్యముచేఁజెప్పఁబడునోయది శాస్త్రమనియాచార్యులుచెప్పిరి

వ్యా. తచ్ఛాస్త్రం త్రివిధం— ప్రభుసమ్మితం, మిత్రసమ్మితం, కాంతాసమ్మితంచేతి. తత్ర ప్రభుసమ్మితం శాస్త్రం, వేదః—శబ్దప్రధానత్వాత్. శబ్దశ్చాత్ర విధిప్రత్యయోపలక్షితంవాక్యం. తస్య ప్రాధాన్యం ప్రవర్తకత్వాదేవభవతి- తత్రార్థస్యప్రాధాన్యమాత్ర పరిత్యాగేన స్వరూపతః- తదభావేతూన్మత్తప్రలపితవద ప్రవర్తకత్వైవ వేదస్యస్యాత్—నచ పురుషప్రవృత్తిరూపభావనాభిధాయి ప్రత్యయమాత్రస్యైవ ప్రవర్తకత్వం, నవాక్యస్యేతి వాచ్యం, కేవలస్యాఽప్రవర్తకత్వాత్, నహిభావయేదిత్యుక్తే కశ్చిత్ప్రవర్తతే కింత్వంశత్రయవిశిష్టభావనాభిధాయిప్రత్యయేశ్రుతిః ప్రవర్తతే—అతః ప్రత్యయ విశిష్టవాక్యస్యైవ ప్రవర్తకత్వం తదుక్తమాచార్యైః॥

శ్లో. కిమాద్యపేక్షితైః పూర్ణస్సమర్థప్రత్యయోవిధౌ। తేనప్రవర్తకం వాక్యం శాస్త్రేస్మిం శ్చోదనోచ్యత ఇతి—అర్థవాదగతానామాఖ్యాతానామర్థభావనార్థకత్వావిశేషేపి "యవాగ్వాజుహుయా" దిత్యాదౌ లిజాదీనాం సంభావనాద్యర్థకతయానవిధిస్థలీయ రూపేణతస్యాప్రతీతిరితి తంత్రసమయః ప్రత్యక్షావిషయమిష్ట ప్రాప్త్యుపాయం జ్యోతిష్టోమాదికమనిష్ట పరిహారోపాయం కలంజభక్షణ ఽరిత్యాగాదికంచ యేనవిదంతిపుంసస్స వేదః వాజ్ఞాత్రేణ ప్రభురివ

వేదోపి పుంసాం ప్రవర్తకో నివర్తకశ్చ ప్రభుర్విపక్షేదండయతి వేదస్తు ప్రత్యవాయంజనయతీతి శబ్దప్రధానత్వం ప్రత్యవాయజనకత్వం స్వరవర్ణయోరన్యథోచ్చారణేపి దురితశ్రవణాదన్యథానుష్ఠానే అననుష్ఠానేవా కైముతికన్యాయసిద్ధం, అధ్యయనవిధేః ఫలవదర్థావబోధ పర్యంతత్వాదితివేద్యం.

మిత్రసమ్మితంశాస్త్రం, పురాణాదికం- తథాహి- పురాణాదికం నవేదవదేవం కుర్యాన్నైవం కుర్యాదితి విధినిషేధ బలేనప్రవర్తకం నివర్తకంవా- కింతు శబ్దవ్యాకా-రేణ పూర్వపురుష నిందాస్తుతిముఖేన రాగద్వేషా ముత్పాద్య మిత్రవత్ప్రవృత్తి నివృత్తి హేతుభూతమతోఽర్థప్రధానత్వం-తదుక్తం వృద్ధైః—శ్లో. బాహుళ్యాదర్థవాదానాం, పురాణేఽర్థప్రధానతా। ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ తస్మాదర్థవశంగతా॥ వాక్యార్థాదేవతత్రాపి వాక్యసిద్ధిరితిస్థితిః। ప్రాధాన్యేవైపరీత్యంస్యాదుభయోరుభయోరపీతి.

కావ్యంతుకాంతాసమ్మితంశాస్త్రం—యథాకామినీకటాక్షవీక్షణాదివిలాసైరేవకామినమావర్జయంతీమమేద మభిలషితంకురు-అనభిలషితం మాకుర్వితి అనుక్త్వైవసర్వం సంపాదయతి—తథాకావ్యశ్రీరపి వ్యంజనా వ్యాపారమాత్రపరత్వేనోపసర్జనీ భూతశబ్దార్థతయాశబ్దార్థప్రధానాభ్యాం ప్రభుసుహృత్సమ్మితాభ్యాం విలక్షణా సతీసహృదయ హృదయాహ్లాదకారిణీ వ్యంజనవ్యాపారేణైవరామాదివద్వర్తితవ్యం-నరావణాదివదితికర్తవ్యే గుర్వాజ్ఞాకరణాదౌ ప్రవర్తయతి, నివర్తయతి చాకర్తవ్యాత్పరదారహరణాదికాదిత్యాస్యాః—కాంతాసమ్మితత్వమవగంతవ్యం అనేనాశ్యాస్వాదనా పాదనేనప్రవర్తకత్వాద్భయానునయ పురస్సరం ప్రవర్తకాభ్యాం వేదపురాణాభ్యాం విశేషోవివక్షిత ఇతిరహస్యం.

తా. ఆశాస్త్రము ప్రభుతుల్యమని, మిత్రతుల్యమనియుఁ గాంతాతుల్యమనియు మూఁడువిధములుగలది. అందు వేదము శబ్దప్రధానమైనదౌటవలనఁ బ్రభుసమ్మితశాస్త్రము. ఇచ్చటశబ్దమనఁగా విధిప్రత్యయముతోఁ గూడినవాక్యము. దానికిఁ బ్రవర్తింపఁ జేయుటవలననే ప్రాధాన్యము గలుగుచున్నది. మఱియునర్థమునకు అప్రాధాన్యము చేవిడుముఁగాని స్వరూపముచే విడుచుటగాదు. ఏమనిన— అర్థములేనిచో వెఱ్ఱివానిప్రేలుటవలె వేదమునకుఁ బ్రవర్తకత్వమే (అనఁగానడిపించుట) లేకపోవును—ఒకవేళ పురుషునిఁ బ్రవర్తింపఁ జేయుటఁగూడ నాజ్ఞనుజెప్పుప్రత్యయమునకే ప్రవర్తకత్వముకలదుగాని వాక్యమునకు లేదనియందురేమో, అదికాదు. కేవలప్రత్యయమునకు ప్రవర్తకత్వములేదుగదా ఎట్లనిన—(భావయేత్)=భావించవలెను. అని చెప్పుచో నొకఁడును నేకార్యమందును బ్రవర్తింపఁడు. మఱియెట్లయినఁ బ్రవర్తించునందురో, దీనిని దీనిచేనిట్లుగా భావించవలెనని మూఁడంశములతోఁ గూడిన భావనను జెప్పు ప్రత్యయమందు వేదము ప్రవర్తించును. కావునఁ బ్రత్యయముతోఁ గూడిన వాక్యమునకే ప్రవర్తకత్వము. ఇందుకాచార్యులప్రమాణము—ఎట్లన—"హేమాదిశబ్దముల యాకాంక్షలతో నిండి విధియందు సమర్థమైనదే ప్రత్యయము. కావుననీశాస్త్రమందు వాక్యము ప్రవర్తకమునుయుఁ జోదనయనియుఁ జెప్పఁబడు" నని అర్థవాదములనుబొందినక్రియలకు, అర్థముయొక్క— భావనయే, అర్థమైనను, "యవాగ్వా జుహుయాత్" జావచేత హోమముచేయవలెను. ఇత్యాదులయందు లిఙాదులకు (సంభావన) ఊహ మొదలగునవి యర్థమగుటచే నాయర్థమునకువిధిస్థలమందుఁ దోచుటలేదు. అనితాంత్రికవ్యవహారము. ప్రత్యక్షముకానట్టియు, ఇష్టముసంపాదించుటకు నుపాయమైనట్టియు జ్యోతిష్టోమాదికమును అనిష్టమునుబోఁగొట్టు గంజాయితినుటనువదలుట మొదలైనదియు దేనిచేతఁ బురుషులు దెలియుచున్నారో అది వేదము.

కేవలముమాటచేతనే ప్రభువువలె వేదమును విధిబలముచేత నిష్టమందుఁబ్రవర్తింపఁజేయునదియు నిషేధబలముచేత ననిష్టమువలనమళ్ళించునదియునైయున్నది. ప్రభువ్యతిరేకించువానికి శిక్ష వేయును, వేదమైతే ఆపదలుపుట్టించును. కావున వేదము శబ్దప్రధానము. అక్షరములుగాని స్వరములుగాని మఱియొకరీతి నుచ్చరించుటవలనఁ బాపముగలదని వినఁబడుచుండఁగా వేదమునకువ్యతిరేకముగాఁ జేయుటగాని చేయమానుటగాని జరిగించినయెడల నాపదలుగలుగునని వేఱే చెప్ప నేల? వేదాధ్యయనవిధి, ఫలముఁగల (యజ్ఞాదులుచేయుటగల) యర్థజ్ఞానముయొక్క తెలియుటసమాప్తికలది--అనఁగా నర్థము తెలిసి యజ్ఞములు చేయుట వేదాధ్యయమునకుఁ బూర్తియైనపనియనితాత్పర్యము.

మిత్రసమ్మితనగుశాస్త్రము పురాణాదికము-ఏమనిన—పురాణాదికము వేదమువలె నీలాగు చేయవలెననియు నీలాగు చేయఁగూడదనియువిధినిషేధముల బలముచేతఁ బ్రవర్తింపఁజేయునదిగాని, నివర్తింపఁజేయునదిగానికాదు. మఱియేమనిన—శబ్దమును అప్రధానముగాఁజేసిపూర్వపురుషులనిందచే వారిచేష్టలయందు ద్వేషమును, స్తోత్రముచేనట్టివారిచేష్టలయం దనురాగమును బుట్టించి మిత్రునివలెఁ బ్రవృత్తికిని నివృత్తికినిఁ గారణమైయుండును. కావునఁబురాణాదికమర్థప్రధానము. ఇందు వృద్ధవచనము— "అర్థవాదములు పురాణమందుఁ బెక్కులు గలిగియుండుటచేత నది యర్థప్రధానము. కావునఁ బ్రవృత్తినివృత్తు లర్థవశములై వాక్యార్థమువలననే వచ్చుచున్నవి. వేదమందును బురాణమందును శబ్దప్రాధాన్యార్థప్రాధాన్యములు వ్యతిరిక్తములైయున్నవి." అని.

కావ్యమైతే కాంతాసమ్మితశాస్త్రం - స్త్రీ, కటాక్షవీక్షణాది విలాసములచేతనే ప్రియుని స్వాధీనపరచుకొని నాకిది యిష్టము

దీనిని చేయుము. నాకిది యిష్టము కాదు, దీనిని చేయవలదని యుఁ జెప్పకయే యెట్లు సంపాదించునో యట్లు కావ్యశోభయు, వ్యంజనా వ్యాపారము (ధ్వని) ప్రధానము కలదగుటచే శబ్దార్థముల ప్రధానములు కలదగుటచేతను, శబ్దప్రధానమై ప్రభు సమ్మితమగు వేదముకంటెను, అర్థప్రధానమై మిత్రసమ్మితమగు పురాణముకంటెను, విలక్షణమైనదై విద్వాంసులహృదయమునకు నానందమునుజేయుచు వ్యంజనావ్యాపారముచేతనే రామాదులవలెఁ బ్రవర్తింపవలెననియు రావణాదులవలెఁ బ్రవర్తింపఁగూడదనియుఁ జేయఁదగిన గుర్వాజ్ఞ మొదలగువానియందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. చేయఁదగని పరదారగమనాదికమువలన మరలించుచున్నది. కావుననిది కాంతాసమ్మితమని తెలియవలెను. ఇందువలన ఏదిరుచికలుగునట్లుగాఁ బ్రవర్తింపఁజేయుటవలన భయముపుట్టించి ప్రవర్తింపఁజేయు వేదమునకంటెను బ్రతిమాలుకొని ప్రవర్తింపఁజేయుపురాణములకంటెను విశేషముగలదనిరహస్యము.

వ్యా. నచ, శ్లో. కావ్యాలాపాంశ్చవర్జయేదిత్యాదినిషేధశాస్త్రస్యాఽత్రమహిమా—తస్య ముద్రారాక్షసాద్యసత్కావ్య విషయత్వాత్—అన్యథారామాయణాదేరప్యపరిగ్రాహ్యత్వంస్యాత్ అధికవిచారస్త్వలంకృతిగ్రంథేభ్య ఏవాఽవగంతవ్య ఇత్యుపరమ్యతే.

తా. కావ్యవాక్యములను వదలవలయునను నిషేధశాస్త్రమునకు ముద్రారాక్షసము మొదలగు దుష్కావ్యములు విషయములుగావున నిచ్చట దానికిఁబ్రవృత్తి లేదు. కానిచో రామాయణాది మహాకావ్యములను బరిగ్రహించఁ దగనివగును. ఇంతకు మించిన విచారములంకారగ్రంథములవలననే తెలుసుకొనవలయును. మేము చాలించుచున్నాము.

వ్యా. మగణస్యాత్యంత శుభకరత్వా ద్గ్రంథాదావాచార్యేణ ప్రయోగఃకృతః - తదుక్తమాచార్యైః. శ్లో. శుభవర్ణాశ్శుభగణా

శ్శుభశబ్దాశ్శుభప్రదా ఇతి - ఆచార్యేణాప్యుక్తం - శుభవర్ణా శ్శుభశబ్దా ఏతి శుభగణా ఇతి.

తా. మగణము మిసుల శుభకరమైనదగుటవలన నాచార్యుఁడు దానిని గ్రంథాదియందుఁ బ్రయోగించినాఁడు. ఇందుకుశుభాక్షరములు, శుభగణములు, శుభశబ్దములును, శుభమునిచ్చునని పూర్వాచార్యులుచెప్పిరి. మఱియు నన్నయభట్టును శుభవర్ణములు, శుభశబ్దములు, శుభగణము, ఇత్యాదివాక్యమును వచించియున్నాఁడు.

వ్యా. మగణస్య శుభకరత్వంతు. శ్లో. మగణస్సర్వదోషఘ్న స్సర్వసౌఖ్యప్రదాయకః। ప్రయుక్తశ్చేత్ప్రబంధాదౌ నగణోపిచ తాదృశః. ఇత్యాదివచనైః ప్రతిపాదితం. అత ఏవ, నిష్ప్రత్యూహముపాస్మహే, విద్యాకైరవకౌముదీమిత్యాదిషు, కృత్యాదిపద్యేషు మురారి మిశ్రాదిభిర్వాక్య శ్రీమద్భిస్త్రిత్వయోగ ఆదావురరీకృతః ఆచార్యేణాపి శ్లో. శ్రీవాణీగిరిజాశ్చిరాయదధత. ఇత్యాదిసర్వాదిశ్లోకాదౌ తదభిషేకః కృతః. అన్యైప్యాంధ్రకవయోపి, ,, శా. శ్రీ చన్గొండలరెండునండఁగొని." ఇత్యాదిషు, తమేవాదౌ బహుమన్వతే.

తా, మగణము శుభకరమౌటనుగుఱించి— మగణము సమస్తదోషములను గొట్టివేయునదియు, సర్వసౌఖ్యముల నిచ్చునదియు, నది ప్రబంధమునకు మొదలఁ బ్రయోగించిన మంచిదనియు, నగణముఁగూడనట్టిదేయనియు, నీమొదలగువచనములచేఁ బ్రకటింపఁబడియున్నది. కావుననే పూజ్యుఁడగు. మురారి మొదలగు మహాకవులు, ,,నిష్ప్రత్యూహం, విద్యాకైరవకౌముదీం" అను మొదలగు కృత్యాది పద్యములయందు మగణము నంగీకరించిరి. నన్నయభట్టును ,,శ్రీవాణీగిరిజా" ఇత్యాది గ్రంథాదిశ్లోకమందు మగణమునకే పట్టాభిషేకముఁ జేసెను—ఇతరులగు నాంధ్రకవులును, శ్రీచన్గొండల ఇత్యా దిత్యాదిపద్యమందు మగణమునేగౌరవించిరి.

వ్యా. వకారస్యజలబీజత్వాదాదౌ ప్రయోగశ్శుభదః। శ్లో. జలార్ణాశ్శుభదాయకా ఇత్యుక్తేః-కించవకారస్యవరుణో దేవతా-సచ శుభప్రదః। వరుణస్తుశుభప్రద ఇత్యుక్తేః। సాచక్ష-స్యవకారస్య స్త్రీలింగత్వేనతత్ప్రయోగ ఆదౌశుభః॥ శ్లో. సాచక్షహాల స్త్రియః ప్రోక్తాస్త్రీలింగాశుభదాయకా ఇత్యుక్తే-అల్పప్రాణోవకార ఆదౌ శుభదః। అల్పప్రాణాశుభ ప్రదా ఇత్యుక్తేః-వకారేతు శుభంభవేదితివర్ణఫలం.

తా. వకారముజలబీజమగుటవలన నాదియందుఁ బ్రయోగించుట శుభము. ఇదివరుణబీజమాటవలనను శుభప్రదము. అమ్చుతోఁగూడినవకారము స్త్రీలింగమాటచేత దానినాదియందుఁ బ్రయోగించుట శుభప్రదము. అల్పప్రాణప్రయత్నముగల వకారము నాదియందుఁ బ్రయోగించుటశుభము-వకారముశుభప్రదము.

వ్యా. ఇకారసహితస్యవకారస్యాఽమృతబీజత్వేన శుభదత్వం. హ్రస్వమాత్రస్యాఽమృతబీజత్వేనశుభదత్వం—హ్రస్వమాత్రస్యాఽమృతబీజత్వేన అభిధానాత్—వకారస్యక్షీరవర్ణత్వా దాచార్యస్యాపిసితవర్ణత్వమున్నీయతే। సితచ్ఛాయోవవర్ణక ఇత్యుక్తేః.

తా. ఇకారముతోఁగూడిన వకారము అమృతబీజమగుటచేతశుభదము-హ్రస్వమాత్ర మమృతబీజమగుటచేత శుభ్రపదము—వకారముపాలరంగుగలది గావుననాచార్యుఁడును తెల్లని రంగుకలవాఁడని యూహింపఁబడుచున్నది.

వ్యా. వకారస్య క్షత్త్రియజాతిరాచార్యస్యవిప్రజాతిరితియద్యపిజాత్యైక్యం—తథాపి, పర్యాయయోగోపి, నదోషాయేత్యాచార్యస్య ఆశయః- పర్యాయయోగేనాతీవదోష ఇత్యుక్తేః-.

తా. విచారించఁగా, వకారము క్షత్త్రియజాతి. అచార్యుఁడువిప్రజాతి, యగుటచే జాతిభేదముకలిగినది- అయినను బర్యాయసంబంధము దోషముకాదని యాచార్యునియభిప్రాయము.

వ్యా. ఆచార్యరాశేర్వృశ్చికస్యాక్షరసంబంధ వృషభరాశ్యపేక్షయా సప్తమస్థానేస్థితత్వాద్రాశికూటోపి విచారితః । మేషవృశ్చికయోరేవ విరోధస్యోక్తత్వాద్విరోధోపినవిద్యతే॥

తా. ఆచార్యుని రాశియగు వృశ్చికము. అక్షర రాశియగు వృషభముద్వారా సప్తమమందుండుటవలన రాశికూటమును విచారించఁబడెను. మేష వృశ్చికములకు మాత్రమే విరోధము చెప్పఁబడుటవలన విరోధమును లేదు.

వ్యా. వకారస్యచంద్రోగ్రహః । నకారస్యగురుర్గ్రహః । ఉభయోస్సితవర్ణయోర్మైత్రీత్యక్షర గ్రహకూటోపి విచారితః । ఆచార్యరాశ్యధిపతిరంగారకః।అక్షరరాశ్యధిపతిః శుక్రః।ఉభయోర్విరోధోనవిద్యతే। అంగారకస్యశత్రుశ్శశిజః శుక్రస్యసూర్యచంద్రౌ శత్రుభావంగతావుభావితివోక్తేః॥

తా. వకారమునకుఁ జంద్రుండును, నకారమునకు గురుఁడును గ్రహము తెల్లనైన ఇద్దతికిని మిత్రత్వముగలదు. కాన నక్షరగ్రహకూటమును విచారింపఁబడినది ఆచార్యుని రాశికధిపతియగు నంగారకునికిని, అక్షరరాశ్యధిపతియగు శుక్రునికిని విరోధములేదు. అంగారకునికి బుధుడు శత్రువు. శుక్రునికి సూర్యచంద్రులు శత్రువులు. అని చెప్పియున్నది.

వ్యా. జలాకాశబీజయోర్యోగోపినదుష్యతి । వహ్నివాయుబీజయోగస్యైవదుష్టత్వకథనాత్.

తా. అగ్ని వాయుబీజములసంబంధము మాత్రము దోషమనిచెప్పుటవలన జలబీజమునకు నాకాశబీజమునకును సంబంధము దోషముగాదు.

వ్యా. శకారస్యగురుర్గ్రహః।వకారస్యగ్రహశ్చంద్రః।ఉభయోస్సౌమ్యయోర్గిపీత ధవళగాత్రయోర్మైత్రీత్యాదిమానంత రాక్షరయో

గ్రహశోధనమపికృతం॥ శ్లో॥ బృహస్పతేశ్చంద్రసూర్యౌ మిత్రాణిధరణీసుతః। మిత్రేభవేతాంశశినోబుధశ్చరవినందనః। శత్రాపిన విరోధస్స్యాద్ధ్రువంపంకజవైరిణః॥శశీతుధవళచ్ఛాయస్సుపీతగాత్రోగురుస్స్మృతః। శుభాస్సర్వేస్సుపాండుపీతాంగాః॥ శుక్రార్యసౌమ్యేందవస్సౌమ్యా ఇత్యుక్తయోజ్యోతిర్విదాం॥

తా. శకారమునకుగ్రహము గురుఁడు, వకారమునకుఁ జంద్రుఁడు. ఇద్దఱును సౌమ్యులు. పచ్చని తెల్లనిశరీరములుగలవారు. వారికి మైత్రిగలదు. ఈరీతిగాఁ బ్రథమద్వితీయాక్షరముల గ్రహశోధనమును జేయఁబడినది. గురునికిఁ జంద్రసూర్యకుజులు మిత్రులు. చంద్రునికి బుధ శనులు మిత్రులు. చంద్రునికి నెక్కడను విరోధము లేదు. చంద్రుఁడు తెల్లరంగుకలవాఁడు. గురుఁడు పచ్చనిశరీరముగలవాఁడు. తెల్లని పచ్చని రంగుగలవారు శుభులు. శుక్ర గురు బుధ చంద్రులు సౌమ్యులు. అని జ్యోతిశ్శాస్త్రవేత్తలవాక్యములు.

వ్యా. లింగత్రయసాధారణశ్శబ్దోప్యాదౌ శుభదః॥ శ్లో. నాదౌక్లీబస్యసాధుతేతికేవలక్లీబస్యైవనిషిద్ధత్వాత్॥ శ్లో. బ్రాహ్మణేషుహిషట్కాది విచారస్య ప్రశస్తతా।తత్రాపిగ్రహమైత్రీతుసుప్రశస్తా ప్రకీర్తితా॥ ఇతి లాక్షణికోద్ఘోషః॥

తా. ఆదియందు నపుంసకలింగశబ్దము మంచిదిగాదని నపుంసకముమాత్రము నిషేధింపఁబడుటవలన మూఁడులింగములయందు సామాన్యముగుశబ్దమాదియందు శుభప్రదము. బ్రాహ్మణులయందు షట్కాదివిచారము మంచిది. అందులోను గ్రహమిత్రత్వము మిక్కిలిమంచిదియని లాక్షణికులు ఘోషించుచున్నారు.

వ్యా. మగణద్వయయోగోపి శుభప్రదఏవ॥ తదాహి॥ ఉభయోర్హారిణయోనిత్వేనైకయోనిత్వంశుభప్రదం॥

తా. రెండు మగణముల సంబంధమును శుభప్రదము. ఏమంటే, రెండును వేర్వేరోటచే నేకయోనులౌట శుభప్రదము.

వ్యా. జ్యేష్ఠానక్షత్రస్య పుంలింగత్వే నపుంలింగయోరుభయో ర్యోగేయద్యపిఫలంకలహః।తథాపివధూస్యాస్త్రత్వథమోగణః।పురా స్త్రీ శుభావహేత్యుక్తేః వధూగణం ప్రతిపుంలింగతారాయాశ్శుభ త్వేనైషదోషః॥

తా విచారించఁగా జ్యేష్ఠానక్షత్రము పుంలింగమౌటచేతఁ బుం లింగములు రెంటియొక్క సంబంధము గలుగుట కలహము. అయి నను మగణము స్త్రీగణమనియు మొదట స్త్రీగణము శుభావహమ నియుఁ జెప్పియుండుటవలన స్త్రీగణమునుగూర్చి పురుషనక్షత్రము శుభమౌటచేత దోషముగాదు.

వ్యా. గణద్వయస్యాపిదైత్యగణత్వేనతస్మేళనమపిశుభదం.

తా. రెండు గణములును రాక్షసగణములౌటచేత వానికలయిక గూడ శుభప్రదము.

వ్యా. రాశికూటవిచారె ప్రథమగణరాశేరారభ్య ద్వితీయగణ రాశి గణనాకార్యా।తత్రోభయోర్వృశ్చికత్వేనసంఖ్యాయాఃప్రథ మత్వాదతివైభవంఫలం।ఉభయోఃకుజగ్రహత్వేనసుఖంఫలం॥

తా. రాశికూటవిచారమునందు మొదటిగణముయొక్క రాశి మొ దలుకొని రెండవగణముయొక్క రాశిపర్యంతము లెక్కింపఁగా రెం డును వృశ్చికరాసులే కావున మొదటిసంఖ్య యౌటవలన నతివైభ వము రెంటికిని కుజగ్రహమౌటచేత సుఖముఫలము.

వ్యా. ఖేటకాంతికూటవిచారె అంగారకస్యరక్తత్వేనపాపత్వం సిద్ధం। ఉభయోర్గపాపఖేటకత్వేనయద్యప్యశుభం। తథాప్యేకత్వే శుభకథనాచ్ఛుభం॥ ఉభయోర్గణత్వేనైసర్గికకూటోపిసామ్రా జ్యప్రదః।ఉభయోరాప్రరసత్వేనసంతోషఫలం॥

తా. గ్రహకాంతికూటవిచారమందు నంగారకుఁ డెరుపౌటచేతఁ బాపము. రెండును పాపగ్రహములుఁగలుగుటచేత నశుభమౌనుగాని యైనను ఒక్కగ్రహమౌట మంచిదియని చెప్పియున్నందున శుభము. రెండును మగణములౌటచేత నైసర్గిక గణకూటము సామ్రాజ్యమిచ్చును. రెండును రౌద్రరసముగలవౌటచేత సంతోషము ఫలము.

వ్యా. యద్యప్యుడుకూటవిచారె ప్రథమగణతారాయా ఆరభ్య ద్వితీయగణతారాపర్యంతం గణనాకర్తవ్యా। తతో ద్వయోర్జ్యేష్ఠానక్షత్రకత్వేనసంఖ్యాయాగ్రప్రథమత్వేనత్రయోదశసంఖ్యాప్రాగ్వర్తిత్వేనఫలమల్పజీవితత్వం తథాపి॥ శ్లో॥ దోషమాత్రం నిరాకర్తుం బ్రహ్మణోపి నశక్యతే। బలవత్త్వం దుర్బలత్వం విచార్యం గుణదోషయోః॥ ఏకోహి దోషో గుణసన్నిపాతె నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥ ఇతిన్యాయేనబలవదష్టవిధకూటగణైరేకకూటదోషఃస్వల్పగ్రపరిహృత ఏవేత్యాదిగత మగణస్యోపరి మగణస్య స్థితత్వేపి స్వకీయం శుభఫలమతీవదదాత్యేవ. ఏవమన్యేపి గుణాస్స్వోత్కృష్టత్వవిమర్శనీయాః। తిర్యగ్గతివర్ణప్రయోగాది స్వల్పదోషాస్త్వకించిత్కరా ఏవేతి సర్వమపిమంగళం.

తా. విచారించఁగా నక్షత్రకూట విచారమందుఁ బ్రథమగణనక్షత్రము మొదలుకొని రెండవగణముయొక్క నక్షత్రముపర్యంతము లెక్కవేయవలెను. అందు రెండును జ్యేష్ఠానక్షత్రములుగలవౌటచేత మొదటిసంఖ్యగనుక పదుమూఁటికి లోఁబడి యుండుటచేత నల్పాయువు ఫలము. అయినను, ఒకదోషమైనను లేకుండఁజేయుట బ్రహ్మకైన శక్యముగాదుగావున గుణదోషముల బలాబలములు విచారింపవలయును. ఒక్కదోషము గుణసమూహమందుఁ జంద్రకిరణముల యందుఁ గళంకమువలె మునిఁగిపోవును అను న్యాయముచేత బలముగల యెనిమిది కూటగణములచేత స్వల్పమగు నొక్క కూటదోషము పరిహరింపఁబడును. మొదటి మగణముపైని మగణమున్నను

నన శుభ ఫలమును మిక్కిలి యిచ్చుచున్నది. ఈరీతి మఱియుం గొన్ని గుణముల సూక్ష్మదృష్టిచే విమర్శించఁదగినవి. తిర్యగ్గతివర్ణప్రయోగము మొదలగు స్వల్పదోషము లేమియుఁ జేయవుగాన నంతయు శుభ మయినది.

వ్యా. విశ్వశ్రేయః కావ్యమితివస్తునిర్దేశోపి అత ఏవ దండినోక్తం. శ్లో॥ ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమితి. నచమంగళం కావ్యమాత్రసాధారణం। న్యాయశాస్త్రాదిషు శిష్టాచారోన్నీత శ్రుతిప్రమాణకత్వా న్నిర్విఘ్న పరిసమాప్త్యర్థం మంగళమాచరేదితి బహుధా ప్రతిపాదితత్వాత్.

తా. ఆశీర్వచనముగాని నమస్కారముగాని వస్తువును నిర్దేశించుటగాని కావ్యారంభమందుండవలెనని దండిచేఁ జెప్పఁబడుటచేత, విశ్వశ్రేయః కావ్యం॥ అని కావ్యమనే వస్తువును నిరూపించుట. ఈమంగళమును జేయుట కావ్యమునకుమాత్రమే కాదు. న్యాయశాస్త్రాదులయందుఁ బెద్దలయాచారముచేత నూహించఁబడిన వేదము ప్రమాణమగుటవలన విఘ్నములు లేక గ్రంథము సమాప్తిఁబొందుటకు మంగళముఁ జేయవలయునని యనేకరీతులఁ జెప్పఁబడియున్నదిగదా.

వ్యా. అత ఏవోపనిషత్స్వపిశంనో మిత్రశ్శంవరుణ ఇత్యాది మంత్రైర్మంగళమీరితం। భగవతాపతంజలినామంగళాదీనిమంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంత ఇత్యాద్యుక్త్వా వృద్ధిరాదైజితిసూత్రే వృద్ధిశబ్ద ఆదౌమంగళార్థత్వేన ప్రయుక్త ఇతి ప్రతిపాదితం. అత ఏవాచార్యేణాపి మధ్యే మంగళార్థత్వేన తత్రతత్రాద శబ్ద[illegible] ప్రయుక్తః ; అంతే మంగళార్థత్వేన విశేష శబ్దశ్చ ప్రయుక్త ఇతిజ్ఞేయం॥

తా. కనుకనే యుపనిషత్తుల యందును సూర్యుఁడు మాకు సుఖమునిచ్చుఁగాక వరుణుఁడు సుఖమునిచ్చుఁగాక యని యీమొదలగు మంత్రములచే మంగళము జెప్పఁబడినది. భగవంతుఁడగు పతంజలియు, మంగళమాదియందుఁ గలిగినట్టియు, మధ్యమందుఁ గలిగినట్టియు, నంతమందుఁ గలిగినట్టియు శాస్త్రములు ప్రపిద్ధంబులగుచున్నవి యనిచెప్పి "వృద్ధిరాదైచ్" అను సూత్రమందు మొదట వృద్ధిశబ్దము మంగళార్థముగాఁ బ్రయోగింపఁబడినది యని చెప్పినాఁడు. కావుననే నన్నయభట్టును మధ్యమం దక్కడక్కడ మంగళార్థముగా నథశబ్దము ప్రయోగించెను మఱియు నంతమందు మంగళార్థముగా విశేషశబ్దముం బ్రియోగించెనని తెలియవలెను.

౨ సూ. తదదోషౌపరిష్కృతౌచవాగర్థౌ.

వ్యా. అదోషౌ వాక్యార్థదోషరహితౌ పరిష్కృతౌ గుణాలంకారసహితౌచవాక్యార్థౌ తత్కావ్యం।పదస్య వాక్యావయవత్వాత్తద్దోషరాహిత్యమప్యత్రవివక్షితం।అల్పోపి దోషః ప్రమాదేనాప్యనుపేక్ష్య ఇతిద్యోతయితుమాదావదోషావితి విశేషణం।ఏకోహిదోషః ఇతిన్యాయస్తుకావ్యవ్యతిరిక్త విషయక ఇతి ద్రష్టవ్యం॥

తా. వాక్యార్థదోషములేనట్టియు, గుణాలంకారములతోఁ గూడినట్టియు, వాక్యార్థములు కావ్యము. పదము వాక్యమునకవయవము గనుక పదదోషములేకుండుటయు నిక్కడ వివక్షింపఁబడినది. కొద్దిదోషమును ప్రమాదముచేతనైన నుపేక్షింప వలదని తెలియఁజేయుటకు నాదియందదోషౌ అను విశేషణముంచఁబడినది. "ఏకోహిదోషః" అను న్యాయమైతే కావ్యముగాక తక్కినదాని విషయమని తెలియవలెను.

వ్యా. పదదోషాశ్శ్రుతికట్వాదయః వాక్యదోషాః ప్రతికూలవర్ణాదయః। అర్థదోషా అశ్లీలాదయః। తత్స్వరూపంచ క్వచిత్తేషాంగుణత్వము భయాభావత్వంచ తద్వివేచక గ్రంథాదవగంతవ్యం గుణస్వరూప ముత్తరత్రవక్ష్యతె

తా. పదదోషములు శ్రుతికట్వాదులు వాక్యదోషములు ప్రతికూలవర్ణాదులు అర్థదోషములశ్లీలాదులు. వానిస్వరూపమును ఒకానొకచోట నవి గుణములౌటయు మొదలగునవి వానిని వివరించు గ్రంథము వలన నెఱుంగవలయును. గుణముల రూపము ముందుఁ జెప్పఁబడును

వ్యా. అలంకారా శ్శబ్దార్థగతత్వేన ద్వివిధాః । తత్ర శబ్దాలంకారా అనుప్రాస యమకాదయః । అర్థాలంకారాస్తూపమాదయః। తేచహీనోపమాదయ ఉపమా దోషాశ్చక్వచి త్తద్గుణభావశ్చాలంకృతి గ్రంథాదేవజ్ఞాతవ్యః.

తా. అలంకారములు శబ్దాలంకారములనియు, నర్థాలంకారములనిఁగను రెండువిధములు అందనుప్రాసయమకాదులు శబ్దాలంకారములు ఉపమాదు లర్థాలంకారములు. అవియును హీనోపమాదులగు నుపమాదోషములును ఒకానొకచో వానికి గుణత్వమును అలంకార గ్రంథమువలననే తెలియఁదగినది

వ్యా. పదంచ విభక్త్యంతం. తత్త్రివిధం. వాచకం, లాక్షణికం, వ్యంజకంచేతి తదర్థా వాచ్యలక్ష్యవ్యంగ్యాస్తు వ్యాపారాః క్రమేణాభిధా లక్షణా వ్యంజనాని ఇంద్రియాణామివశబ్దానాం పదార్థప్రతత్యనుగుణన్గ పరిస్పంద పరిణామ విలక్షణవ్యాపారోంగీకరణీయః. సచ విచార్యమాణస్సంగతి ప్రతిసంధానాత్మక బుద్ధివిశేషఏవ సచాత్మనిష్ఠోపి శబ్దధర్మత్వేనవ్యవహ్రియత ఇతి సంప్రదాయ విదః

తా. విభక్తి యంతమందుఁగలది పదము అది వాచకమని, లాక్షణికమని, వ్యంజకమనియు మూఁడు విధములు గలది. వాని యర్థములు వాచ్యలక్ష్యవ్యంగ్యములు. వాని వ్యాపారములు క్రమముగా నభిధ, లక్షణ, వ్యంజనమునని మూఁడు. ఇంద్రియములకువలె శబ్దములకుఁ బదార్థవివరణమునకుఁ దగినదియుఁ గదలుటకు మారుటకును వేఱైనదియునగు వ్యాపారము నంగీకరింపవలెను. అదియు నాలోచించఁగా సంబంధమును సంధానము చేయుటయను బుద్ధి విశేషము. అది యాత్మయందున్నది యైనను శబ్దధర్మమని వ్యవహరింపఁబడుచున్నదియని సంప్రదాయవేత్తలు చెప్పుదురు.

వ్యా. లక్ష్యార్థోపి సంకేతవిషయ ఏవేత్యన్వితాభిధానవాదినః. శ్లో॥ ముఖ్యార్థగోచరాతస్య వ్యాపృతిః కథ్యతేభిధా । తత్రాభిధాద్వివిధా. రూఢిపూర్వికాయోగ పూర్వికాచేతి.

తా. లక్ష్యార్థముకూడా వాచ్యార్థవిషయమైనదని యన్వయజ్ఞానము ముందుగలిగి తర్వాత పదార్థజ్ఞానము గల్గునని చెప్పునట్టి పక్షమువారు చెప్పుదురు. అభిధయనఁగా ఆశబ్దముయొక్క ముఖ్యార్థము విషయము గల వ్యాపారము. అది రూఢిపూర్వకాభిధ యనియు యోగపూర్వకాభిధయనియు రెండుదెరఁగులు గలది.

వ్యా, శ్లో॥ ముఖ్యార్థబాధితద్యోగే రూఢితో వా ప్రయోజనాత్। యయాన్యంబోధయేచ్ఛబ్దో వ్యాపృతిస్సాస్యలక్షణా॥ లక్షణాతావద్ద్వివిధా. రూఢిలక్షణా ప్రయోజనలక్షణాచేతి. తత్ర రూఢిలక్షణైకా అవ్యంగ్యా. ప్రయోజనలక్షణా సప్తధా- జహల్లక్షణా, అజహల్లక్షణా, జహదజహల్లక్షణా, శుద్ధసారోపా, శుద్ధసాధ్యవసానా, గౌణసారోపా, గౌణసాధ్యవసానాచేతి,

తా. ముఖ్యార్థమునకేదేని విరోధము కలిగి యాముఖ్యార్థముతో సంబంధము కలుగఁగా రూఢివలనఁగాని యేదేని యొక ప్రయోజ

నముపలనఁగాని శబ్దము దేనిచేత మఱియొకయర్థమును దెలుపునో అది యాశబ్దమునకు లక్షణావృత్తియనఁబడును. లక్షణరూఢి లక్షణయని యుఁ బ్రయోజనలక్షణయనియు రెండుదెఱఁగులం గలది. అందు, రూఢిలక్షణ యొకటియె ధ్వన్యర్థములేనిది. ప్రయోజనలక్షణ యేడు విధములుగలది. జహల్లక్షణయని, అజహల్లక్షణయని, జహదజహల్ల క్షణయని, శుద్ధసారోపయని, శుద్ధసాధ్యవసానయని, గౌణసారోప యని, గౌణసాధ్యవసానయనియు.

వ్యా. సాచ ద్వివిధా. గూఢవ్యంగ్యా, అగూఢవ్యంగ్యా చేతి. తత్ర గూఢవ్యంగ్యముత్తమంకావ్యం. పరంతుమధ్యమమితి వివేకః. వ్యంగ్యస్య ద్రుతప్రతీతావగూఢత్వం మధ్యమప్రతీతౌ గూఢత్వం విలంబితప్రతీతావస్ఫుటత్వం తత్రాద్యంతయోర్మధ్యమత్వం మధ్యమ స్యోత్తమత్వంచేతి ధ్వనిసమయః.

తా. ఆప్రయోజనలక్షణ గూఢవ్యంగ్యయని, యగూఢవ్యంగ్య యని రెండువిధములుగలది. అందు గూఢవ్యంగ్యముత్తమకావ్యము. అగూఢవ్యంగ్యము మధ్యమకావ్యము. వ్యంగ్యము(అనఁగా ధ్వని) త్వరగా స్ఫురించినచో నగూఢము సామాన్యముగా స్ఫురించినచో గూఢము. ఆలస్యముగాస్ఫురించినచో నస్ఫుటము. అందు గూఢా స్ఫుటములు రెండును మధ్యమకావ్యము. గూఢముత్తమకావ్యము. అని ధ్వనికర్తల యేర్పాటు.

వ్యా. నచైవమస్ఫుటవ్యంగ్యత్వే సాధమస్యాపి మధ్యమత్వం శంక్యం తత్రవ్యంగ్యస్య విలంబితప్రతీత్యా నాస్ఫుటత్వం. కింతు ప్రతీతస్య దివాచంద్రప్రకాశవత్ శబ్దార్థవైచిత్రీబలేనతిరోహి తత్వే నాస్ఫుటత్వవ్యపదేశాత్.

తా. ఇంతమాత్రము చేతనధమకావ్యమస్ఫుటవ్యంగ్యమౌటచే దా నినిఁగూడ మధ్యమకావ్యమనఁగూడదు. ఏమంటే- ఆయధమ కా

వ్యమందు ఆలస్యముగా స్ఫురించుటచే నస్ఫుటత్వము గాదు- మఱే మంటే- స్ఫురించుచున్న ధ్వని పగటివెన్నెలవలె శబ్దార్థముల చిత్ర ముచేతఁ గప్పఁబడినదౌటచేత నస్ఫుటమని వ్యవహరించుట-

వ్యా గౌణవృత్తిరపి లక్షణాంతర్భూతైవ- తదంతర్భావనిరూపణప్రకారస్తు ప్రాచీనగ్రంథాదౌ విజ్ఞేయః- విపరీతలక్షణాపి జహల్లక్షణాంతర్భూతైవ-

తా. గౌణవృత్తియును లక్షణయందుఁ గలసియున్నదియే- దాని యందుఁ గలసియున్న రీతియంతయు దాని వివరించు పూర్వగ్రంథములయందుఁ జూచునది. విపరీతలక్షణయు జహల్లక్షణయందుఁ గలసియున్నది.

వ్యా. విద్యానాథస్త్వాహ ముఖ్యార్థస్య హానోపాదానారోపాధ్యవసాయలక్షణోపాధివశాచ్చాతుర్విధ్య మేవలక్షణాయాః. ఆయుర్ఘృతమాయురేవేద మిత్యాదావపి గౌణత్వస్యైవ సుకల్ప్యత్వాదితి.

తా. ముఖ్యార్థమునువిడచుట, స్వీకరించుట, ఆరోపము, అధ్యవసాయమునను నవస్థలవల్ల లక్షణ నాల్గువిధములుగలది- నెయ్యి యాయువు ఇది యాయువు అను మొదలగుచోట గౌణము సులభముగాఁ గల్పించవచ్చునుగావున అని విద్యానాథుఁడు చెప్పినాఁడు-

వ్యా అత ఏవోక్త మలంకారచూడారత్నే యత్రవస్త్వంతరేవస్త్వంతరత్వముపచర్యతే సగౌణోయత్రనతథాతత్రలక్షణేతి.

తా. కావుననే ఎచ్చట మఱియొకవస్తువునందు మఱియొక వస్తువౌట గుణమును బట్టి చెప్పఁబడునో యది గౌణము. ఎచ్చట నావిధములేదో అక్కడ లక్షణయని యలంకార చూడారత్నమందుఁ జెప్పఁబడినది-

వ్యా. కుశలప్రవీణాది శబ్దానాం సాక్షాత్సంకేతవిషయత్వేన ముఖ్యార్థత్వాన్నరూఢి హేతుకత్వం లక్షణాయా ఇత్యాచార్య

హేమచంద్రః. రూఢిపక్షాశ్రయణేతు ప్రయోజనలక్షణాపేక్షయా చాతుర్విధ్యం-

తా. (కుశల=దర్భలు గ్రహించినవాఁడు- ప్రవీణ=అధికమగు వీణగలవాఁడు- ఇది నిజమైన యర్థము- నేర్పరియని లాక్షణికార్థము-) కుశలప్రవీణాది శబ్దములకు నీయర్థములు సంకేతించినవిగాని రూఢిలక్షణయని యొకటిలేదని యాచార్య హేమచంద్రుఁడు చెప్పినాఁడు- రూఢిలక్షణ కలదనుపక్షము నాశ్రయించినచోఁ బ్రయోజనలక్షణతోఁగూడ లక్షణ నాలుగువిధములుగలది-

వ్యా. యత్రశక్యార్థపరంపరాసంబంధ రూపాలక్షణా సాలక్షితలక్షణా- యథా ద్విరేప పదేన రేఫద్వయంసంబంధో భ్రమరపదే జ్ఞాయతే భ్రమరపదస్యసంబంధో భ్రమరేజ్ఞాయత ఇతి కేచిద్వామనాద్యాః-

తా. ఎక్కడ శక్యార్థములు వరుసగావచ్చిన లక్షణయుండునో యది లక్షితలక్షణ- ఏలాగంటే- ద్విరేఫశబ్దముచేత రెండు రకారములసంబంధముగలది భ్రమరశబ్దము తెలియఁబడును- భ్రమరశబ్దముయొక్క సంబంధము తుమ్మెదయందుఁ దెలియఁబడుచున్నదియని వామనుఁడుమొదలగు కొందఱు చెప్పిరి-

• వ్యా. వ్యంజనవ్యాపారస్యప్రకృతోపయోగిత్వాత్కించిత్స్వరూపం నిరూప్యతే- శ్లో॥ అన్వితేషుపదార్థేషు యోసావర్థాంతరగోచరః। వాక్యార్థోపస్క్రియాయైస వ్యాపారోవ్యంజనంభవేత్ ॥ అభినవగుప్తాచార్యపాదా అపి లక్షణామూచుః- సమన్వయశక్తి సమర్పితాన్వయ విధురీకరణ ధురీణత్వాదన్వయ శక్త్యనంతరభావినీ వృత్తిరితి.

తా. వ్యంజనవ్యాపారము ప్రస్తుతోపయోగియౌటవలన నించుకదానిస్వరూపము జెప్పఁబడుచున్నది- శబ్దార్థము లన్వయించిన తర్వాత నన్వయచమత్కారమునకై మఱియొకయర్థము విషయముగలశబ్దముయొక్క యేవ్యాపారముగలదో యదివ్యంజనమనఁబడును- పూ

జ్యులగు నభినవగుప్తాచార్యులు లక్షణను జెప్పి రెట్లన- అన్వయశక్తిచే నియ్యఁబడిన యన్వయమును జెడఁగొట్టునది గావున నన్వయశక్తికిఁ ద రువాతి వృత్తియని-

వ్యా. వ్యంజనవ్యాపారస్త్రివిధః- శబ్దార్థోభయశక్తిమూలకత్వే న- శబ్దశక్తిమూలోఽపి ద్వివిధః- అభిధామూలో లక్షణామూలశ్చేతి- తత్రప్రయోజనలక్షణాసు ప్రయోజనప్రతీతిక్ృద్వ్యాపారో లక్షణా మూలో వ్యంజనవ్యాపారః- ఏత ద్వ్యంగ్యంతు వస్తుమాత్రమేవ- అనలంకారం వస్తుజాతిగుణాదిరూపం- తదేవవిచ్ఛిత్తివిశేషయుక్తమ లంకార ఇత్యాలంకారికసమయః-

తా. శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము, ఉభయశక్తి మూలము నని వ్యంజనవ్యాపారము మూఁడువిధములుగలది- శబ్దశక్తిమూలము, అభిధామూలము, లక్షణామూల మనియు రెండు తెఱంగులుగలది- అందుఁబ్రయోజన లక్షణలయందుఁ బ్రయోజనమును దోఁపఁ జేయు వ్యాపారము లక్షణామూలవ్యంజనము- ఇందుఁదోఁచునది వస్తుమా త్రమే- అనఁగా అలంకారములేనిజాతి గుణాదిరూపమగునది వస్తు వు- అదియేశోభావిశేషయుక్తమగునేని యలంకారమని యలంకార శాస్త్రజ్ఞులసంకేతము.

వ్యా. అభిధామూలవ్యంజనస్య లక్షణముక్తం కావ్యప్రకాశకా రేణ- శ్లో॥ అనేకార్థస్యశబ్దస్య వాచకత్వేనియంత్రితే। సంయోగా ద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతిరంజనమితి- శ్లో॥ అత్యర్జున యశో రాశిః కృతసంరక్తతర్పణః। ఏకవీరోపతాపశ్చ రామోరాజతి రాజ ఘు ఇత్యుదాహరణం- అత్రోపమాలంకారోవ్యంగ్యః-

తా. అభిధామూలవ్యంజనకు లక్షణమును గావ్యప్రకాశ కారుఁ డు చెప్పినాడు- ఎట్లన- బహ్వర్థములుగల శబ్దమునకుఁ దనసంకేతా ర్థముఁజెప్పుటనియమించఁబడఁగా సంయోగము, వియోగము మొద లగువానిచేనప్రస్తుతార్థ బుద్ధినిఁ గలుగఁజేయువ్యాపారము వ్యంజన

ము. ఉదాహరణము- ఈయుదాహరణశ్లోకమందుఁ బరశురామపరముగా నొకయర్థమును శ్రీరామపరముగా నొకటియుఁ గలవు- అత్యర్జునయశోరాశిః- కార్తవీర్యార్జును నతిక్రమించిన కీర్తిరాశిగలవాఁడు- అనిపరశురామపరము॥ మిక్కిలి తెల్లనికీర్తిరాశిగలవాఁడు- అని శ్రీరామపరము- కృతసంరక్తతర్పణః=చేయఁబడినలెస్సయగు రక్తముచేతనైన తర్పణముగలవాఁడు- అనిప॥ చేయఁబడిన యనురాగముగలవారి తృప్తిగలవాఁడు- అనిశ్రీ॥ప॥ ఏకవీరోపతాపః- అసహాయ శూరులను దపింపఁజేసినవాఁడు- అనిప॥ ఏకవీరః, అపతాపః, అసహాయశూరుఁడును, తాపములేనివాఁడును- అనిశ్రీ॥ రాజఘః=శత్రురాజులనుగొట్టువాఁడు- ఇద్దఱికినిసమము- రామః=పరశురాముఁడు, అని- శ్రీరాముఁడు, అని- రాజతి=ప్రకాశించుచున్నాఁడు- ఇక్కడఁ బరశురామ శ్రీరాముల కుపమానము వ్యంగ్యము.

వ్యా. నచైతాదృశస్థలే శ్లేషః- తస్య కేవలప్రకృత పరత్వేన కేవలాప్రకృతపరత్వేనవా నియమనాత్- అత్ర ధ్వనావలంకారస్యైవ వ్యంగ్యత్వం- అస్యచాలంకారతా బ్రాహ్మణపరివ్రాజకన్యాయేనేతి ప్రాచీనాః.

తా॥ ఇట్టిచోట శ్లేషగాదు- ఆశ్లేష కేవలము ప్రకృతపరముగాని యప్రకృతపరముగాఁగాని నియతమగుటవల్ల, ఈధ్వనియందలంకారమే వ్యంగ్యము- ఈధ్వనికలంకారత్వము బ్రాహ్మణసన్యాసి యనునట్లుగా నేయని ప్రాచీనులుచెప్పిరి. అనఁగా, బ్రాహ్మణ వ్యవహారమును సన్యాసివ్యవహారమునుగూడ నుండునట్లుగా నలంకార వ్యవహారమును ధ్వనివ్యవహారమునుగూడ నుండుననుట.

వ్యా. చిత్రమీమాంసాయాంతు ప్రకృతార్థ ఇవాప్రకృతార్థేపి శక్తిరస్త్యేవేతి నవ్యంజనాపేక్షా- ప్రాచీనానాం త్వత్ర ధ్వనివ్యవహారస్తూపమాద్యలంకారే వ్యంగ్యత్వాభిప్రాయేణేతి బహుధాప్రతిపాదితం- శ్లో॥ స్థితాః క్షణంపక్ష్మసుతాడితాధరాః పయోధరోత్సే

ఘనిపాతచూర్ణితాః। వళీషుతస్యాస్ఖలితాఃప్రపేదిరే చిరేణనాభింప్రథమోదబిందవః॥ శ్లో॥ నిశ్శేషచ్యుతచందనంస్తనతటం నిర్మృష్టరాగోధరో నేత్రేదూరమనంజనే పులకితాతన్వీతవేయంతనుః। మిథ్యావాదినిదూతిబాంధవజనస్యాజ్ఞాతపీడాగమే వాపీంస్నాతుమితోగతాసినపునస్తస్యాధమస్యాంతికం॥ ఇత్యుదాహరణద్వయం-

తా చిత్రమీమాంసయందుఁ, బ్రకృతార్థమందువలెనే యప్రకృతార్థమందును శబ్దమునకుశక్తిగలదు కావున వ్యంజనవ్యాపారాపేక్షలేనేలేదు- ప్రాచీనులకునుపమాద్యలంకారములయందు వ్యంగ్యమనునభిప్రాయముచేత నిందుధ్వనియను వ్యవహారముగలదని యనేకవిధములుగాఁ జెప్పఁబడియున్నది- ఈప్రథమశ్లోకము తపస్సుఁజేయుచున్న పార్వతీదేవివర్ణనము- ఎట్లనఁగా- వర్షకాలారంభమందలి చినుకులు దేవియొక్క ఱెప్పలపైని క్షణమున్నవై కొట్టఁబడిన పెదవిగలవియై స్తనములపైఁబడుటచేత చెదరిపోయినవై ముత్తఱులయందుఁ దొట్రువడుచుఁ దడవునకుఁ బొక్కిటియందుఁ బ్రవేశించినవి- రెండవశ్లోకము, ఒకానొకనాయిక తనదూతిక తనప్రియుని దగ్గఱకువెళ్లి యతనితో సంభోగించివచ్చి యాలక్షణములుజూచిన తనతోనవి మఱుఁగుపడునట్లు కొలనికి స్నానమునకు వెళ్లినానుగాని నీ ప్రియునిచెంతకు వెళ్లలేదనిబొంకగా దానితోఁ జెప్పుమాటయెట్లనగా- ఓదూతికా! నీ స్తనములయందలి గంధమంతయుజాఱిపోయినది- నీయధరము తుడచివేయఁబడిన యెఱుపుగలది- నేత్రములయందలికాటుకయంతయుఁ బోయినది- నీపలుచని శరీరమంతయు గగుఱుపొడచినది- బొంకులమారీ! బంధుకష్టమెఱుఁగనిదానా స్నానముజేయుటకుఁ గొలనికిఁబోయినావా! ఆనీచునియొద్దకుఁ బోలేదా! ఈలక్షణములు సంభోగమునకును స్నానమునకును సమానములుగా నుండును గావున బొంకనది- ఇవి రెండుదాహరణములు-

వ్యా॥ అర్థశక్తిమూలవ్యంజనే చిత్రమీమాంసాయాం మేఁగ్లోచ్ఛే కార్థః ప్రతిపాదితః- తథాహి- అత్రతపస్యంత్యాగేహా పరిణత

తాం ప్రథమవృష్టిబిందూనాం క్రియావర్ణనేన దేవ్యాస్సమాధ్యుచితావస్థానాభివ్యక్తిద్వారా చిరనిదాఘతప్తదేహోపరినిపతనేన సుఖపారవశ్యం సంభ్రమహేతౌ ప్రథమవృష్టావవ్యవహితా సమాధ్యవస్థా వ్యజ్యతే- శ్లో॥ నాసాగ్రన్యస్తనయనస్సంవృతాస్యస్సునిశ్చలః। ధ్యాయేతమనసా దేవమురోవిష్టభ్య చాగ్రత॥ ఇతిసమాధముతామవస్థామాహుః-

తా. చిత్రమీమాంసలో నర్థశక్తిమూలవ్యంజనమందు నీశ్లోకములయర్థము తెలియఁజేయఁబడినది- ఎట్లనఁగా- ఇచ్చటఁ దపముఁ జేయుచున్న దేవియొక్క దేహమందుఁబడిన మొదటిబిందువుల వ్యాపారమును వర్ణించుటచేత దేవికిఁ దపోనియమమునకుఁ దగిన యునికిని దెలియఁజేయుటకుపై బహుకాలమునుండి గ్రీష్మముచేఁ బరితపించిన శరీరముపైఁ జినుకులుబడుటచేత సుఖపరవశత్వమును తొందరపడుటకుఁ గారణమైన వానయందు నడ్డులేని సమాధియందుండుటయుఁ దోఁచుచున్నది- సమాధియందున్నవాని యునికి యెట్లనఁగా- నేత్రములు ముక్కుచివరనుంచి నోరు మూసినవాఁడై కదలక ఱొమ్మెదురుగానిలువఁబెట్టి దేవునిధ్యానించవలెను- ,,అని'

వ్యా. తత్రపక్ష్మసుస్థితా ఇత్యనేన నాసాగ్రన్యస్తనయనతారూపమర్థనిమీలనం వ్యజ్యతే-సర్వదోన్మీలనే పక్ష్మణామూర్ధ్వాగ్రత్వేన సర్వథానిమీలనే తేషామధోగ్రత్వేన తేషు విందూనాం స్థిత్యసంభవాత్- పక్ష్మభ్యశ్చ్యుతానాం తేషామాస్యే అప్రవేశేన అధరోష్ఠేనిపత్య తతశ్చ్యుతికథనేన సంవృతాస్యత్వంవ్యజ్యతే- తతశ్చ్యుతానాం తేషాం స్తనోత్సేధనిపాతనాదివర్ణనేన ఉరోవిష్టంభః- సంకుచితాకారావస్థతయా తదుత్సేధయోస్తేషాం పతనం నస్యాత్- కథంచిత్తయోః పతిత్వావళిత్రయం ప్రాప్తానామపి వళిషు తిర్యగేవ గమనంస్యాత్- ననాభిదేశప్రాప్తిః- నాభౌచసంవృతాయాం ప్రవేశో నస్యాత్-

తా. ఱెప్పలపై నున్నవియనుటచేత ముక్కుపైఁజూపునిలుపుట చేతనైనయరమోడ్పుగన్నులకుఁదోఁచుచున్నది- చూపుమిక్కిలియుఁ దెరచినయెడ ఱెప్పలుపైనుండుటచేతను మిక్కిలిఁగుమూసినయెడల ఱెప్పలు క్రిందికినుండుటచేతను వానియందు బిందువులుండవు. ఱెప్పలనుండిజారి బిందువులు నోటిలోఁబ్రవేశించకపోవుటచేతఁ బెదవియందుఁబడి జారుటచేతనోరు మూసికొనియుండుట తోఁచుచున్నది- అచ్చటినుండిజారిన యాబిందువులకు స్తనములపైఁ బడుట మొదలగునది వర్ణించుటచేత ఱొమ్ముజాపియుండుట తోఁచుచున్నది- వంగినయెడ స్తనములపై బిందువులుబడుట సంభవించకపోవును. ఒకవేళ నతికష్టమున స్తనములపైఁబడినను ముత్తరులయందుఁ బ్రవేశించిన బిందువులడ్డముగాఁ బోవును- మఱియు నాభియందుఁ బ్రవేశించుటయుఁ గలుగదు. నాభి కప్పఁబడియున్నయెడ నాభియందుఁ బ్రవేశించవు.

వ్యా. పక్ష్మాధరాదిపతనక్రమకథనేన నిశ్చలత్వం వ్యజ్యతే- ముఖాదిచలనే సతి పతితానాం తేషాం అధరపయోధరాదిక్రమేణ పతనాసంభవాత్.

తా. ఱెప్పలు అధరముమొదలగువానియందుఁ బడుటను జెప్పుటచేత దేవి కదలకయున్నదని తోఁచుచున్నది- నోరు మొదలగునవి కదపినచోఁ బైఁబడ్డబిందువులకుఁ గ్రమముగా స్తనాదులయందుఁ బడుట సంభవింపదు.

వ్యా. కింవైభిరేవ విశేషణైర్దేవ్యా లోకోత్తర సౌందర్యమపి వ్యజ్యతే- స్థితా ఇత్యనేనపక్ష్మణామవిరళతాయాః క్షణమిత్యనేన తేషామసృణతాయాః పక్ష్మపతనశిథిల వేగైర్బిందుభి స్తాడినోక్త్యాధరస్యాధరస్యాతి సౌకుమార్యస్యపక్ష్మాధరపతన శిథిలవేగానాం తేషాం స్తనోత్సేధే చూర్ణీభావ వర్ణనేన తయోరతికాఠిన్యస్య ఉరోవిష్టంభే

పితాసు తేషాంస్థలనోక్త్యావళీనాం విస్పష్టయాస్సర్వబిందూనాంనా భావేవ ప్రవేశకథనేన నాభ్యా అతిగహ్వరతాయా శ్చాభివ్యం జనాత్.

తా. మఱియునీవిశేషణములచేతనే దేవికిలోకాతీతమైన సౌంద ర్యమునుదోఁచుచున్నది- ఎట్లనఁగాబిందువులు అప్పలపైనున్న వియ నుటవలనఅప్పలకు దట్టదనమును, క్షణమని చెప్పుటచేత అప్పలకు నున్నుపును, అప్పలపైఁబడుటచేత వేగముతగ్గినబిందువులచేఁ బెదవికి దెబ్బదగులుటవలనఁ బెదవికిమిక్కిలిమృదుత్వమును, అప్పలపైనథర ముపైఁబడి వేగముతగ్గినబిందువులకు స్తనములపైఁజూర్ణమగుటను జె ప్పుటచేత స్తనములకుమిగులఁ గఠినత్వమును, బొమ్మునిలచియున్నను బిందువులకుఁ దఱులయందుఁదొట్రుపాటుఁజెప్పుటచేతఁ దఱులుమి క్కిలి స్పష్టములుగా నుండుటయు, అన్నిబిందువులు నాభియందుఁ బ్రవేశించినవనుటచేత నాభికిమిక్కిలిలోతునుదోఁచుటవలన,

వ్యా. నిశ్శేషేతి. అత్రవాపీంస్నాతుం నగతాసీత్యధమ పదేన ప్రాధాన్యేనవ్యజ్యతే. తథాహి. అధమత్వమపకృష్టత్వం- తత్రిజా త్యాపకర్షంనోత్తమానాయికావదతినాయకస్య- నాపిస్వాపరాధ ప ర్యవసాయిదూతీసంభోగాది హీనకర్మాతిరిక్తేన కర్మణాతాదృశందూ తీసంప్రేషణాత్ప్రాచీనం సర్వంసోఢమేవేతినోద్ఘాటనార్హామపి- అ న్యథాస్వయందూతీ సంప్రేషణానుపపత్తేః- తదనంతరం స్వప్రేషిత దూతీసంభోగరూపమేవ స్వయంసన్నిహితచిహ్నైర్జ్ఞాతుంశక్యంహీ కర్మసంభవతీతి తత్పర్యవసాయి నాధమపదేన తస్యాంతికమేవ గం తుంగతాసీతివ్యజ్యతే.

తా. నిశ్శేష అనుశ్లోకము- ఇక్కడబావినిఁగూర్చినీవు స్నానము నకుఁవెళ్ళలేదని అధమశబ్దముచేతఁదోఁచుచున్నది- ఏమన్న;— అధ ముఁడనఁగానీచుఁడు- అందుజాతిచేత నీచత్వమును త్తమనాయిక చె ప్పదు- మఱియునీదూతికతో భోగించుట దప్పతక్కినపూర్వపుపనుల

న్నియు నిప్పుడు ఎత్తిపొడుచుటకువీలులేదు- అట్లయినయెడలనది త
నయపరాధము క్రిందఁ బర్యవసానమగును- ఏమంటే- ఆయపరాధము
లుతాను సహించియేదూతికనుబంపినది- లేనట్లయితే పంపక వేయుం
డును- తరువాతఁదానుపంపిన దూతికయొక్క-సంభోగరూపమయిన
దుష్కర్మముదూతికయొక్క- చిహ్నములచేతఁ దెలియుటశక్యమైయు
న్నదిగావున దీనియందుఁబర్యవసానమొందిన అధమ పదముచేత వా
నిదగ్గఱకుఁ గ్రీడించుటకై వెళ్ళినావనితోఁచుచున్నది.

వ్యా. నిశ్శేషచ్యుతచందనం స్తనతట మిత్యాదీని వాక్యాని సం
భోగచిహ్నోద్ఘాటనేనతత్రసాహాయ్యకమేవాచరంతి- నిశ్శేషచ్యు
తచందనం స్తనతటమిత్యత్ర తావద్వాపీంస్నాతుమితోగతాసీతి వా
క్యార్థముపపాదయితుమేవ ఉత్తరీయకషణేన చందనచ్యుతేరన్యథా
సిద్ధేః పరిహారాయనిశ్శేషవిశేషణం- తతశ్చందనచ్యుతేః స్నానసా
ధారణ్యవ్యావర్తనేన సంభోగచిహ్నోద్ఘాటనాయ తటగ్రహణం-
స్నానేసర్వత్ర చందనచ్యుతిస్స్యాత్ - అతస్తు స్తనయోస్తటే ఉపరి
భాగ ఏవ దృశ్యతే- ఇయమాశ్లేషకృతైవేతి.

తా. స్తనములపైగంధమంతయుఁ బోయినదను మొదలగు వాక్య
ములు సంభోగచిహ్నములనెత్తుటచేత భోగించుటకువెళ్ళినావనుటకు
సాహాయ్యమును జేయుచున్నవి. నిశ్శేషచ్యుత చందనం స్తనతటం
అన్నచోట బావిలో స్నానమునకై నీవు వెళ్ళలేదనుమాటను నిర్వ
హించుటకే పైఁటచెంగు రాపిడిచేత గంధము జారిపోయియుండవ
చ్చును అను మాట పోవుటకు నిశ్శేషముగాఁ బోయినదని చెప్పినది.
తరువాత స్నానముచేతఁ గూడ నిశ్శేషముగాఁబోవచ్చుననుమాట రా
కుండ కేవలము భోగచిహ్నమును దెలియఁజేయుటకు తటమని చెప్పి
నది. స్తనతటమనఁగా స్తనములపైభాగము. స్నానమువల్లనైతే అం
తటను గంధము పోయియుండును. కావున నిగంధము జారుట
యాలింగనమువల్లనే జరిగినదియని తాత్పర్యము.

వ్యా. తథా నిర్మృష్టరాగోధర ఇత్యత్ర తాంబూలగ్రహణవిలంబాత్ ప్రాచీన రాగస్య కించిన్మృష్టతేత్యన్యథా సిద్ధిపరిహారాయ నిర్మృష్టరాగ ఇతి రాగస్య నిర్మృష్టతోక్త్వా పునస్స్నాన సాధారణ్యవ్యావర్తనేన సంభోగచిహ్నోద్ఘాటనాయాధర ఇతి విశేష్యగ్రహణం. ఉత్తరోష్ఠేసరాగే అధరోష్ఠమాత్రస్య నిర్మృష్టరాగతా చుంబన కృతైవేతి

తా. మఱియు నధరోష్ఠము మిక్కిలి తుడిచివేయఁబడిన యెఱుపుగలదియనుచోట తాంబూలము వేసికొనుట తడవైనందున పూర్వమందలియెఱుపు కొంత పోయియుండవచ్చునను మాటపోవుటకు మిక్కిలి తుడిచివేయఁబడినదియనుట. తిరిగి స్నానముఁజేసినను మిక్కిలి పోయియుండవచ్చునను మాట పోవుటకు సంభోగచిహ్నమునే ప్రకటనచేయుటకు నధరమని చెప్పట అధరమనఁగాఁ గ్రిందిపెదవి. పైపెదవి యెఱ్ఱగానుండఁగాఁ గ్రిందిపెదవి యెఱుపుపోవుట చుంబనముచేతఁ జేయఁబడినదియె.

వ్యా. నేత్రేదూరమనంజనే ఇత్యత్ర ప్రాతర్దత్తమంజనం కాలేన కించిద్విలుప్తమిత్యన్యథా సిద్ధిపరిహారాయ దూర మిత్యుక్తం. దూరమిత్యాపాతతోర్థస్తేన కాలాన్యథా సిద్ధినిరాసః. పునస్స్నాన సాధారణ్యనివర్తనేన పులకితేతి స్నానచిహ్నాపన్యాసగ్గపులకితాపితస్వీవర్తత ఇతి హృదయస్థితోర్థః తేన స్నానేన పులకితాతనుః కించిదుచ్ఛ్వసితా భవతి ఇయంతు నతథేతి క్లేశజనితగ్గ పులకోద్గమ ఇతి మహోద్ఘాటనం.

తా. కన్నులు మిక్కిలి కాటుకలేనివియన్నచోట ప్రొద్దుటనుంచిన కాటుక కొంతసేపటికిఁ గొంచెము పోయియుండవచ్చునని తోచకుండ దూరం అనుట. దూరమనఁగా మిక్కిలియనుట. దానిచేత నాలస్యమనుటచేతఁ బోయినదికాదనుట. తిరిగి స్నానముచేతను మిక్కిలిపోవచ్చునని పులకితా అను విశేషణముంచఁబడినది. ఇప్పటికి

స్నానచిహ్నమే కావచ్చును. స్నానమువలన గగుర్పాటు పుట్టవచ్చు నని మనస్సులోని తాత్పర్యముచేత తన్వీ అనుట. తన్వీ అనఁగా సన్నమైనదియని యర్థము. స్నానమువలనఁ గొంచెము దేహముబ్బును. ఇది యట్లుగాదు కావున నాయాసమువలనఁ గలిగిన పులకమని గొప్ప యెత్తిపోటుమాట.

వ్యా. ఏవమేభిర్వాక్యైరుపస్కృతే నాధమపదేన తస్యాంతికమేవరంతుంగతాసీతి ప్రాగ్వాచ్యార్థాదశాయాం వాపీం స్నాతుం గతాసీత్యే తదనుగుణార్థతయాన్వితం మిథ్యా వాదినీత్యాది సంబోధనం వ్యంగ్యానుగుణ ఏవార్థే పర్యవస్యతీతి.

తా. ఈప్రకారమీవాక్యములచేతఁ బురస్కరింపఁబడిన అధమ శబ్దముచేత వానియొద్దకే భోగించుటకు వెళ్ళినావని. వాచ్యార్థమందు బావికి స్నానమునకై వెళ్ళినావని దీనికిఁదగిన యర్థముగా నన్వయించు నట్టి మిథ్యావాదినియను మొదలగుసంబోధనము వ్యంగ్యార్థమునకుఁ దగిన యర్థమందే పర్యవసానమునొందుచున్నది. అని యింతవఱకుఁ జిత్రమీమాంసయందువివరించినయర్థము.

వ్యా. సోఽయం ధ్వని ర్ద్వివిధోఽభిధామూలస్సంలక్ష్యక్రమవ్యంగ్యోఽసంలక్ష్యక్రమవ్యంగ్యశ్చేతి తత్రసంలక్ష్యక్రమవ్యంగ్యేవస్త్వలంకారయోర్వ్యంగ్యత్వమితరత్ర రసాదేర్వ్యంగ్యత్వమితివివేకః.

తా. అభిధామూలమగు నీధ్వని సంలక్ష్యక్రమవ్యంగ్య మనియు నసంలక్ష్యక్రమవ్యంగ్యమనియు రెండుతెఱంగులుగలది- అందుసంలక్ష్యక్రమవ్యంగ్యమందు వస్తువుకు నలంకారమునకును వ్యంగ్యత్వము- (అనఁగాధ్వనియనుట) అసంలక్ష్యక్రమ వ్యంగ్యమందు రసాదులకువ్యంగ్యత్వము- అనిభేదము.

వ్యా. శ్లో. పరశుగతిభీషణాత్మా సంగరలీలాసు బాహుజక్షోభః। సోఽధారామో శేమే పితృభక్తో విప్రదత్తభూవలయః॥ ఇత్యుభయశక్తిమూలధ్వనావుదాహరణం.

తా. ఈశ్లోకమందుఁ బరశురామపరముగా నొక యర్థమును శ్రీరామపరముగానొకయర్థమునుగలవు- (పరశుగతిభీషణాత్మా)పరశు=గండ్రగొడ్డంటియొక్క- గతి=సంచారముచేత- భీషణాత్మా=భయంకర స్వరూపముగల- [అని పరశురామపరము] పర=శత్రువులయొక్క- శుక్=దుఃఖముచేత- అతిభీషణాత్మా=మిక్కిలి భయంకరస్వరూపముగలవాఁడు- [అని శ్రీరామపరము] సంగరలీలాసు=యుద్ధవ్యాపారములయందు- బాహుజక్షోభః=రాజుల బాధగలవాఁడు- అనఁగాయుద్ధములయందు రాజులనుసంహరించెననుట- [అనిపరశురామపరము] (సంగరలీలాసుబాహుజక్షోభః) సంగరలీలా=యుద్ధవ్యాపారముచేత- సుబాహుజ=సుబాహువునందుఁ బుట్టిన- క్షోభః=బాధగలవాఁడు- అనఁగాయుద్ధమందు సుబాహువును జంపినవాఁడు- (అనిశ్రీరామపరము) సోఢా=శత్రువులనోర్చునట్టి- [ఉభయపక్షములందునుసమము] పితృభక్తః=తండ్రికిభక్తుఁడు- [ఇదియుసమము] విప్రదత్తభూవలయః=బ్రాహ్మణులకొఱకియ్యఁబడిన భూమండలముగల (అనిపరశురామపరము) బ్రాహ్మణులకొఱకియ్యఁబడిన భూములును గంకణములునుగల [అనిశ్రీరామపరము] రామః=పరశురాముఁడనియు శ్రీరాముఁడనియును- రేమే=క్రీడించెను- అని యిదియుభయశక్తిమూలధ్వనికుదాహరణము.

వ్యా. యద్యపిశబ్దార్థయోరుభయోరపి వ్యంజనత్వమితినాన్యతరస్యైవ- తథాపిప్రాధాన్యేన సహకారిత్వేనచ తథా వ్యపదేశ ఇతి ధ్వనివాదినాంఘోషః- సకృదుచ్చరితశ్శబ్దోనవృత్తిద్వయ మర్హతీతి నిషేధస్యత్వభిధాలక్షణాభ్యాం వ్యంజనస్యయోగాదితరత్రైవ తాత్పర్యం- అనన్యథాసిద్ధకార్యబలేనాభిధాయక లక్షకయోర్వ్యంజనవ్యాపారవత్త్వనియమాత్.

తా. ఆలోచించఁగా శబ్దార్థములురెంటికిని వ్యంజనత్వమున్నది గాని ప్రత్యేకశబ్దమునకుఁగానిప్రత్యేకార్థమునకుఁగానిలేదు- అయి

నను ఒకటిప్రధానమును, ఒకటిసాహాయ్యము చేయునదిగా నుండుట
చేత నారీతిగా వ్యవహారమని ధ్వనివేత్తలచాటింపు- ఒక్కమారుచ్చ
రించినశబ్దము రెండువృత్తులకుఁదగదని నిషేధమునకు అభిధాలక్షణ
లవల్ల ధ్వనిలేనిచోట తాత్పర్యము- అభిధాలక్షణాశబ్దములకు నీరీతి
దక్క వేఱురీతిచేత వ్యంజనవ్యాపారము రాదుగావున వ్యంజనవ్యా
పారము కలదనే నియమము వల్ల వృత్తిద్వయాశ్రయణము విరో
ధించదు.

వ్యా. ననుతదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపీతి
కావ్యప్రకాశలక్షణేకథ మనలంకృతీ ఇతి విశేషణ ముక్తమితిచేత్
క్వచిత్స్ఫుటాలంకార విరహేపినదోష ఇతి తదర్థత్వేన తద్విశేషణం
దోషాయేతి యుక్తమేవ సాలంకారత్వకథనం వాగర్థయోః.

తా. అయితే దోషములేనట్టియు, గుణములతోఁగూడినట్టియు,
నొక్కొకచో నలంకారములు లేనట్టియు శబ్దార్థములు కావ్యమని
కావ్యప్రకాశ లక్షణమందు నలంకారములేనట్టి యనువిశేషణ మేల
చెప్పవలెనంటే. ఒకానొకచోట స్పష్టములైనయలంకారములు లేకు
న్నను దోషములేదని యర్థముగనుక యావిశేషణము దోషముగాదు.
కావున నిచ్చట నలంకారములుండవలెనని శబ్దార్థములకుఁ జెప్పుట
తగియున్నది.

వ్యా. ననుగుణాలంకారయోర్భేదఏవనాస్తి గుణానామప్యుప
మాద్యలంకారవద్రసోపస్కారకత్వాదితిచేత్. నైవం. సముదాయ
వృత్త్యా రసోపస్కారకా గుణాస్సంయోగవృత్త్యార సోపస్కార
కా అలంకారా ఇతి భేదప్రతిపాదనాత్.

తా. అయ్యా! ఉపమాద్యలంకారములవలెనే గుణములును రస
మును శోభింపఁజేయునవి యౌటవలన, గుణములకు నలంకారముల
కును భేదమేలేదు. అందురేమో- అట్లుగాదు. అభేదసంబంధము
చేత రసమును శోభింపఁజేయునవి గుణములనియు భేదసంబంధము

చేత రసమును శోభింపఁజేయునవి యలంకారములనియు భేదముఁ జెప్పుటవలన (మట్టికిని ఘటమునకును గలది యభేదసంబంధము. మట్టికి వేఱుగా ఘటము లేదుగదా- ఘటమునకును జలమునకును గలది భేదసంబంధము- జలములేనిఘటముండవచ్చును.)

వ్యా. నచ నీరసకావ్యాలంకారేషు వ్యభిచారః. తథా విధస్థలే రసశబ్దస్య వ్యంగ్యవ్యంజకజాతీయయోరభేదాధ్యవసాయేన ప్రవృత్తత్వాత్- నచా చేతనశరీరే హారాదీనామివ నీరసకావ్యే అలంకారాణామలంకారత్వా భావేన హేయతాప్రసంగః. సువర్ణప్రతిమాంగేష్వివహారాదీనాం తదలంకారేష్వపి శోభాహేతుత్వేనాలంకారతాయా నిరుపరోధత్వాదితి ప్రామాణికాః.

తా. రసములేని కావ్యములయందలి యలంకారములు రసోపస్కారకములు కావు గావున నలంకారత్వము చెడిపోయిన దనవలదు. అట్టిచోట్ల రసశబ్దము రసమునకును శబ్దార్థములకు నభేదముచేతఁ బ్రవర్తించుటవలన దోషము లేదు. ప్రాణములేనిశరీరమందు హారాదుల కేరీతిగా నలంకారత్వము లేదో యట్టుగా రసములేనికావ్యమం దలంకారత్వము లేదుగావున విడువఁ దగినవియాట తటస్థించునని చెప్పరాదు- బంగారుబొమ్మయొక్క యవయవములయం దేరీతిగా హారాదు లశోభాహేతువులౌనో యట్టుగానే నీరసకావ్యాలంకారముల కలంకారత్వమడ్డులేనిదని ప్రామాణికులు చెప్పుదురు.

వ్యా. యత్తూక్తం దండ్యాచార్యేణ కావ్యాదర్శే కాశ్చిన్మార్గ విభాగార్థ ముక్తాః ప్రాగప్యలంక్రియా ఇతి- యత్తు తట్టీకాకృతా తరుణవాచస్పతినోక్తం- నను పూర్వే శ్లేషాదయో దశగుణా ఇత్యుక్తం కథం తేషా మలంకారతోచ్యత ఇతిచేత్ శోభాకారత్వం హ్యలంకార లక్షణం తల్లక్షణ యోగాత్తేప్యలంకారాః- శోభాహేతవోగుణాశ్శోభాతి శయహేతవోలంకారా ఇతి కైశ్చిదుక్తంశోభాతిశయహేతుత్వస్య వైవక్షికత్వాన్నాయం భేదహేతురితిగుణా అ

ప్యలంకారా ఇత్యాచార్యమతమితి తదనేనపరాస్తం, కావ్యవ్యవహార హేతవో గుణాస్తచ్ఛోభాహేతవోలంకారా ఇత్యేవం రూపభేద ప్రతిపాదక శ్రీభోజాదిమత నిరసనమపి ప్రాచీన గ్రంథా దేవ ద్రష్టవ్య మితి నేహోచ్యతే.

తా. దండ్యాచార్యులు కావ్యాదర్శమందు త్రోవఁజూపుటకుఁ గొన్ని యలంకారములు మునుపున్న చెప్పఁబడినవియని యేదిచెప్పెనో యదియును, ఆకావ్యాదర్శముయొక్క టీకాకారుఁడైన తరుణవాచస్పతియును, (పూర్వము శ్లేషాదులు పదిగుణములని చెప్పఁబడినవిగదా వానికలంకారత్వమెట్టుగాఁ జెప్పఁబడుచున్నదంటే శోభనుజేయుటగదా అలంకారలక్షణము- ఆలక్షణముకలుగుటవలన గుణములకును నలంకారత్వముకలదు- శోభాకారణములు గుణములనియును నతిశయశోభాకారణము లలంకారములనియును గొందఱుజెప్పిరికాని శోభాతిశయముకలదని వివక్షచేసుకుంటే నేకాని లేకపోతే లేదు కావున నిదిభేదమునుగూర్చి కారణముకాదుగనుక గుణములునునలంకారములేయని దండ్యాచార్యులుగారిమతమని) యేదిచెప్పినాఁడో యదియును నీగ్రంథముచేతఁ ద్రోసివేయఁబడినది- మఱియుఁగావ్యమని వ్యవహరించుటకు హేతువులయినవిగుణములు- ఆకావ్యమునకు శోభాహేతువులలంకారములు- అనియీరీతిఁగా భేదమునుజెప్పు భోజరాజాదుల మతమున్ను పూర్వగ్రంథముచేతనే నిరసించఁబడినది. కావుననిచట మరలఁజెప్పఁబడదు.

వ్యా. గుణాశ్చమాధుర్యౌజః ప్రసాదాస్త్రయఏవ- అన్యేషాం కేషాంచిచ్ఛ్లేషాదీనామేష్వంతర్భావః- కేషాంచిద్దోషత్యాగాయాశ్రితత్వమితి తత్ప్రపంచనంతు తద్వివేచకగ్రంథాదవగంతవ్యం.

తా. మాధుర్యము, ఓజస్సు, ప్రసాదమునని మూఁడే గుణములు. శ్లేషాదులయిన కొన్నిగుణములకువీనియందుఁగలసిపోవుటగలదు- కొన్నిఁటినిదోషముపోవుటకై యాశ్రయించుట- ఈమొదలగు విస్తారమంతయును వానినివిమర్శించు గ్రంథమువలనఁ దెలియవలెను.

వ్యా. తత్రమాధుర్యం నామాహ్లాదకత్వం. సంభోగశృంగారే ధృతికారణం. కరుణేవిప్రలంభేశాంతేచ తదత్యంతధృతిహేతుత్వా దతిశయాన్వితం. చిత్తస్య విస్తారరూపదీప్తత్వ జనకమోజో వీరరసే భయానకేచవర్తతే. వీరాద్బీభత్సేతతోపి రౌద్రేసాతిశయమోజః. శుష్కేంధనాగ్నివత్స్వచ్ఛ జలవత్సహసైవచిత్తంవ్యాప్నోతి యస్స ర్వరచనాసువర్తతే సప్రసాదః.

తా. అందు మాధుర్యమనఁగా నానందమును బుట్టించుట ఇది సంభోగశృంగారమందు సంతోషమునకుఁ గారణమైనది. కరుణ విప్రలంభశాంతరసములయందు మిక్కిలి సంతోషమునకుఁ గారణ మైనదౌటవలన నతిశయముతోఁగూడినది. చిత్తము విస్తరించడము రూపముగాఁ బ్రజ్వలనమునుబుట్టించునది యోజోగుణము. ఇది వీర భయానకరసములయందుండును. వీరరసమునకంటె బీభత్సమందును దానికంటె రౌద్రరసమందును నోజోగుణ మతిశయముగ నుండును. ఎండుకట్టెలయందగ్నివలెను, నిర్మలమగుజలమువలెను త్వరగా చిత్త మునువ్యాపించుచు నన్నిరచనలయందుండునది ప్రసాదగుణము.

వ్యా. ఆకారే శౌర్యాదీనామివతేషాం గుణానాం గుణవృత్త్యైవ శబ్దార్థయోర్వృత్తిర్దృశ్యతేహ్యన్యధర్మాణా మివహ్రస్వాదీనామారో పితసంసర్గేణ వర్ణవిశేషణత్వం యథార్థవ్యవహార జనకత్వంచ. అతో న్యధర్మాణామపి గుణానాం వాక్యవిశేషణత్వం నవిరుధ్యతే.

తా. మనుష్యునియొక్కస్వరూపమందు శౌర్యాదిగుణములకువలె నామాధుర్యాదిగుణములకు శబ్దార్థములయందుఁ బ్రవృత్తి గాన్పించు చున్నది. అచ్చుయొక్క ధర్మములైన హ్రస్వాదులకు నారోపించఁ బడిన సంబంధముచేత నక్షరమునకు (అనఁగా అక్షరములసముదాయము నకు) యథార్థవ్యవహారమును బుట్టించుట గలదుగదా. కావున అన్యధర్మములయిన గుణములకు వాక్యవిశేషణమగుట విరోధించదు.

వ్యా. వర్ణసమాసరచనానాం గుణవ్యంజకత్వం తత్ప్రపంచితం కావ్యప్రకాశకారేణ. శ్లో॥ మూర్ధ్నివర్గాంత్యగాస్స్పర్శా అవిసర్గా రణౌలఘూ। అవృత్తిర్మధ్యవృత్తిర్వా మాధుర్యే ఘటనాతథా॥ టతడఢ వర్జాః కాదయోమాంతాః శిరసినిజవర్గాంత్యయుక్తాః తథా రేఫణ కారౌ హ్రస్వాంతావిత్యేతే వర్ణాస్సమాసభావో మధ్యసమాసోవా తథా మాధుర్యవతీపదాంతరయోగరచనాచ మాధుర్యస్యవ్యంజకాః.

తా. అక్షరములును, సమాసములును, రచనయు గుణములను దెలియఁజేయునవి. దీనిం గావ్యప్రకాశకారుఁడు విస్తరించినాఁడు. (ఇచ్చట శ్లోకార్థమునే పైగ్రంథము చేత వివరణచేసినాఁడు.) టతడఢలు తప్ప కకారము మొదలు మకారముదాక నుండు అక్షరములు తమవర్గాంత్యాక్షరములుతలపైగలవి(అనఁగా అంక, అంగ, కాంచన, మంజు, కాంత, మంద అని యీరీతిగానున్నలు ముందుగలవి) దీర్ఘములులేని రేఫణకారములును ఈయక్షరములును, సమాసములేకపోవుటగాని కొద్దిసమాసములుండుటగాని మాధుర్యముగల పదముల తో సంబకథముకలుగునట్టి రచనయు మాధుర్యమును దెలియఁజేయును.

వ్యా. శ్లో॥ యోగ ఆద్యతృతీయాభ్యా మంత్యయో రేఫతుల్యయోః। టాదిశ్శషౌవృత్తిదైర్ఘ్యం గుంభ ఉద్ధత ఓజసి॥ వర్గప్రథమతృతీయాభ్యాం ద్వితీయచతుర్థయోః రేఫేణ అధఃఉపరి ఉభయత్రవా యస్యకస్యచిత్ తుల్యయోః తేనతస్యైవ సంబంధః టవర్గోర్ధ్గాణకారవర్జశ్శషౌ దీర్ఘసమాసశ్చవికట సంఘటనాచఓజోవ్యంజకాః.

తా- (ఇచ్చటఁగూడ శ్లోకార్థమును పైగ్రంథముచేత వివరణ చేసినాఁడు) వర్గులలోనొకటి మూడవయక్షరములతో రెండు నాల్గవయక్షరములకు సంబంధమును (ఎట్లనిన. రుక్షరు, దిగ్ఘన, స్వచ్ఛంద, ఉజ్ఝిత, తత్త్వాంకృతి. ద్విడ్ఢయ, ఉద్ధాన, ఉద్ధసన, ఇత్యాదులు) రేఫముతోఁ గ్రిందగానిమీదగాని రెండుచోటులగాని యేదోయొక్కయక్షరమునకు సంబంధము [ఎట్లనిన. అర్ఘ, రుద్ర, ఆర్ద్రి ఇత్యాదులు]

అక్షరముకుఁదనకుఁ దనతో సంబంధము [ఎట్లనిన]. దిక్కరి, దిగ్గజ, ఉచ్చ, లజ్జ ఇత్యాదులు] [అర్థవశమువల్ల] ణకారములేని టవర్గ దీర్ఘసమాసము కఠినరచనయు ఓజోగుణమును దెలియఁ జేయు నవి.

వ్యా శ్లో॥ శ్రుతిమాత్రేణశబ్దానాంయేనార్థప్రత్యయోభవేత్। సాధారణస్సమగ్రాణాం సప్రసాదోగుణస్మృత ఇతి॥ సమగ్రాణాం రసానాం వర్ణానాం సమాసానాం సంఘటనానాంచ.

తా శబ్దములువిన్నంతమాత్రము చేత దేనిచేత సంపూర్ణశబ్దముల యొక్క అర్థజ్ఞానము కలుగునో అదిప్రసాదగుణమని చెప్పఁబడును. సంపూర్ణములనఁగా రసములు, అక్షరములు, సమాసములు, రచనలు ను అనుట.

వ్యా. ఆనందవర్ధనాచార్యేణాప్యుక్తం. శ్లో॥ శషౌచరేఫస్సంయోగష్టవర్గశ్చాపిభూయసా। విరోధినస్స్యశ్శృంగారే నవపర్ణార సమ్యతా ఇతి. భూయసాబాహుళ్యేనేత్యర్థః.

తా- ఆనందవర్ధనాచార్యుఁడును జెప్పియున్నాఁడు. శకార షకార రేఫములును, సంయుక్తము [అనఁగాద్విత్వముగలది] అయిన అక్షరమును టవర్గమందలి యైదక్షరములును, ఈతొమ్మిదియుఁ దరుచుగానున్నయెడల శృంగార రసమునందు విరోధులుగా నుండును. (అనఁగానివి శృంగారరసమందుండఁగూడదనుట) తరుచుగా ననఁగా విస్తారముగానుండఁగూడదుగాని యచ్చటచ్చటనుండవచ్చును.

వ్యా శ్లో॥ జవర్ణవర్జితాస్స్పర్శాస్స్వస్వవర్గాంత్యశేఖరాః। లఘురేఫణకారౌచకోమలాఃపరికీర్తితా ఇతి సుకుమారవర్ణసంగ్రహః.

తా. జకారముదప్ప తమతమ వర్గపంచమాక్షరములు పైనఁగల కకారాది మకారపర్యంతాక్షరములును, (అనఁగా- అఞ్చిత, కుంజ, వణ్టాక, అణ్డ, దన్త, కన్ద, కమ్ప, అమ్బు ఇత్యాదులు) లఘు రేఫమ్ము ణకారము అనునవి మృదువైనవియని చెప్పఁబడును. అనికోమలవర్ణములయొక్క సంక్షేపము.

వ్యా. శ్లో॥ రేఫేణయస్యకస్యాపి యోగ ఆద్యతృతీయయోః। స్యోత్తరాభ్యాంతుల్యయోర్వా పరుషాక్షరశాశ్వసావితి. పరుషాక్షరసంగ్రహః.

తా. వర్గప్రథమతృతీయములలో నేదో యొకదాని రేఫతో సంబంధము (ఎట్లనఁగా చక్ర, ఉగ్ర, చర్చ, వజ్ర, ఇత్యాదులు) సమానములకుఁ దమపై యక్షరములతో సంబంధము [ఎట్లనఁగా రుక్ఖచిత, వాగ్ఘన, అచ్ఛ, ఉజ్ఝిత, ఇత్యాదులు] శష అనునవి పరుషాక్షరములని కఠినాక్షరసంక్షేపము,

వ్యా. యద్యపిగుణపరతంత్రాస్సంఘటనాదయః తథాపి- శ్లో॥ వక్తృవాచ్యప్రబంధానా మౌచిత్యేనక్వచిత్క్వచిత్। రచనావృత్తివర్ణానామన్యథాత్వమపీష్యతే। క్వచిద్వాచ్యప్రబంధానపేక్షయా వక్త్రౌచిత్యాదేవ రచనాదయః- క్వచిదేవమేవేతరయోః-

తా- ఆలోచించఁగా సంఘటనాదులు గుణాధీనములు. అయినను మాటలాడువానియొక్కయు మాటలాడుప్రస్తావనయొక్కయు, ప్రబంధముయొక్కయు, నర్హతచేతనొకానొకచోట రచనవృత్తికి నక్షరములకును మఱియొకలాగౌటయుఁగలదు. కొన్నిచోట్ల నర్థమును బ్రబంధమును ననుసరించక చెప్పునట్టి వానికిఁ దగునట్టుగా రచనాదులుండును. మఱియునొకానొకచోట నర్థప్రబంధములకుఁ దగునట్టుగాఁ జెప్పునట్టి వానిననుసరించి యీరీతి నేయుండును.

వ్యా. రీతిస్త్రిధా. వైదర్భీగౌడీయా పాంచాలీచేతి. తత్ర సమగ్రగుణావైదర్భీ. ఓజః కాంతిమతీగౌడీయా. మాధుర్య సౌకుమార్యోపపన్నాపాంచాలీ. విదర్భాదిదేశో ముఖ్యత్వా దేషాసమాఖ్యేతి వామనః.

తా. రీతి. వైదర్భియని గౌడీయయని పాంచాలి యనియుఁ మూఁడుతెఱఁగులుగలది. అందుసంపూర్ణ గుణములుగలది వైదర్భి ఓజః కాంతిగుణములుగలది గౌడీయ. మాధుర్యసౌకుమార్యగుణములతోఁ గూడినది పాంచాలి. ఈరీతులువిదర్భాది దేశములు [అనఁగావిదర్భ

గౌడపాంచాలదేశములు] ముఖ్యములుగలవిగావున నీపేరులు గలిగె ననివామనుఁడుజెప్పినాఁడు.

వ్యా. వృత్తయస్తునశబ్దగతాః కింతురచనాశ్రియాస్తాశ్చతస్రః, కైశి క్యారభటీ సాత్వతీ భారతీచేతి తత్రసుకుమారతర శృంగారకరుణయో ర్వ్యంజికా సుకుమారాకైశికీ ఉద్ధతయోశ్రౌద్ర బీభత్సయోర్వ్యంజికా తాద్యగారభటీ కించిన్మృదూనాంహాస్య శాంతాద్భుతానాం వ్యంజికాతాదృగ్భారతీ అనతిప్రౌఢయో ర్వీర భయానకయోర్వ్యంజికాతాదృక్సాత్వతీ.

తా. వృత్తులురచనాశ్రయములుగాని శబ్దగతములు గావు, అవి నాలుగు కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి అని. అందుమృదువులగు శృంగారకరుణరసములను దెలుపునది మృదువైనకైశికీవృత్తి దురుసుగానుండు రౌద్రబీభత్స రసములనుదెలుపునది దురుసైనయారభటీవృత్తి. కొంచెముమృదువులైన హాస్యశాంతాద్భుత రసములను దెల్పునదికొంచెముమృదువైన భారతీవృత్తి, మిక్కిలి ప్రౌఢములుగాని వీరభయానకరసములను దెలుపునది మిక్కిలిప్రౌఢముగాని సాత్వతీ వృత్తి.

వ్యా. మధ్యమకైశికీమధ్యమారభటీచేతి సర్వరససాధారణంవృత్తిద్వయం కేచిద్వదంతి. ఈషత్ప్రౌఢబంధామధ్యమ కైశికీ. ఈషన్మృదుబంధామధ్యమారభటీ.

తా. మధ్యమకైశికియని మధ్యమారభటియనియు సమస్తరససాధారణములైన రెండువృత్తులను కొందఱు చెప్పుచున్నారు. కొంచెముప్రౌఢబంధముగలది మధ్యమకైశికి. కొంచెముమృదుబంధముగలది మధ్యమారభటి.

వ్యా. పదానాంవినిమయాసహిష్ణుత్వం శయ్యా. అర్థస్యాభిరూప్యం పాకః. తత్రార్థస్యద్రుతప్రతీతౌ రసాలాది పాకః. మధ్యమప్రతీతౌ నారికేళపాకః.

తా. శబ్దములమార్చనోర్చకపోవుటశయ్య- [అనఁగానన్వయానుసారముగా శబ్దములుండుట. అర్థమనుకూలముగానుండుట పాకము. అందర్థముత్వరగా స్ఫురించినట్టయితే రసాలాదిపాకము- [రసాలమనఁగా మామిడిపండు] అర్థముసామాన్యముగా స్ఫురించినట్టయిన నారికేళపాకము [నారికేళము కొబ్బరికాయ]

వ్యా. వైదర్భ్యాదీనాంరసాశ్రితమాధుర్యాది శబ్దధర్మపరత్వేన సాక్షాద్రసవ్యంజకత్వం. వృత్తీనాంరచనాశ్రయత్వేన సాక్షాద్రసవ్యంజకత్వమితివివేకః. ఉక్తంచధ్వన్యాచార్యేణ. శ్లో॥ శబ్దతత్వాశ్రయాః కాశ్చిత్కాశ్చిదర్థాశ్రయాఃపరాయితి॥ విభావాదీనామేవ రసవ్యంజకత్వం ప్రాధాన్యేనరచనాదీనాంతు తత్సహకారిత్వమేవేత్యాలంకారికసమయః.

తా. వైదర్భ్యాదిరీతులు రసమునాశ్రయించిన మాధుర్యముమొదలగు శబ్దధర్మంరములుగానుండి సాక్షాత్తుగారసమునుదెలియఁజేయును వృత్తులురచనాశ్రయించినవై సాక్షాత్తు రసవ్యంజకములు అనివివరణము- ధ్వన్యాచార్యులుకూడా చెప్పియున్నారు- కొన్ని శబ్దతత్వము నాశ్రయించినవియు మఱికొన్ని యర్థతత్వమునాశ్రయించినవియునని- విభావాదులు ప్రధానముగారసమును దెలియఁజేయునవి- రచనాదులు విభావాదులకు సహాయ్యమును జేయునవియని యాలంకారికులయేర్పాటు.

సూ॥ సావాగ్యారసవృత్తిః.

వ్యా. యావాక్ రసవృత్తిః రసప్రత్యాయన ప్రవణారసవ్యంజికా కైశికీత్యాదివృత్తిర్యస్యామితివా రసవ్యంజకధ్వనివ్యాపారోయస్యామితివా రసవృత్తిః సైవాత్రవాగిత్యుచ్యతే. తిఙ్సుబంతచయో వాక్యం క్రియావాకారకాన్వితేతి మీమాంసకాద్యైర్వాక్యలక్షణముక్తం. తన్నాత్రం వాక్యమత్రనాభిప్రేతం కింతు రసవ్యంజకమేవవాక్యమిత్యర్థ

తా. ఏవాక్యము రసమును దీపించుట ప్రధానముకలదో లేక రసమును తెలియఁజేయు కైశిక్యాది వృత్తులుగలదో, లేక రసమును బ్రకటించు ధ్వనివ్యాపారముగలదో అది రసవృత్తిః అనిపించుకొనును అదియే వాక్యమని చెప్పఁబడుచున్నది తిఙంతములు (అనఁగా భవతి. అవర్ధత ఇత్యాదులు.) సుబంతము [అనఁగా రామః లక్ష్మణమ్ ఇత్యాదులు] వీనిసముదాయముగాని కర్త్రాదికారకములతోఁగూడిన క్రియగాని వాక్యమని మీమాంసకాదులు వాక్యలక్షణమును జెప్పిరి. అంతమాత్రమే వాక్యమిచ్చట నుద్దేశించఁబడలేదు- ఇఁక నేమంటే రసమును దెలియఁజేయునదియే వాక్యము. అనియర్థము.

వ్యా. వ్యంజనాంజనధ్వననవ్యక్తితాత్పర్యాది నామవ్యవహారయోగ్యవ్యాపారావగమ్యోరసాదిర్వ్యంగ్యార్థ ఇత్యాలంకారికమత సమయః యత్తు పదార్థావగమ సమయానంతరభావినీ సమన్వయశక్తిఃతాత్పర్యం నామవృత్త్యంతరమిత్యలంకార సర్వస్వసంజీవనీకారః, తన్నిరాకృతమన్యైః

తా. వ్యంజనము, అంజనము, ధ్వననము, వ్యక్తి, తాత్పర్యము మొదలగుపేళ్ళచే వ్యవహరించుటకుఁదగిన వ్యాపారముచేఁ దోచఁదగిన రసము మొదలగునది వ్యంగ్యార్థమని ఆలంకారికమతముయొక్క యేర్పాటు- పదార్థములు దెలిసినతరువాతనైన సమన్వయశక్తితాత్పర్యమని యొకవృత్తియని యలంకారసర్వస్వసంజీవనీకారుఁడేదిచెప్పెనో యది యితరులు త్రోసివేసిరి-

వ్యా. తాత్పర్యంనామవృత్త్యంతరం నసంభవతివృత్తిత్రయానుస్యూతస్యవృత్త్యంతరానుపపత్తేః- క్లృప్తేనైవవృత్తిత్రయేణ సర్వవ్యవహారోపపత్తౌ బాహ్యేంద్రియ సహకారిణోమనస ఇంద్రియాంతర కల్పనావత్తాత్పర్యస్య వృత్త్యంతరత్వకల్పనమయుక్తమేవేతి-

తా. అభిధాలక్షణావ్యంజనలను మూఁడువృత్తులయందుఁ గలసియున్నదానికి వేరువృత్తియగుట యుపయోగము లేనందునఁ దాత్ప

ర్యమని మఱియొకవృత్తి సంభవించదు. సిద్ధములైయున్న మూఁడు వృత్తులచేతనే సమస్తవ్యవహారములకు నుపపత్తి గలుగుచుండఁగా బాహ్యేంద్రియములకుఁ దోడైన మనస్సునకు వేఱుగా నింద్రియమని కల్పన యెట్లుగాయుక్తముగాదో యట్లుగా వేఱువృత్తియని కల్పించుట యుక్తముగాదు.

వ్యా. ఆలంకారికమతేతు తాత్పర్యమేవ వ్యంజనం. తేత్వేవం వదంతి వక్తృబుద్ధి సన్నిధాపితో వాక్యావగమ్యో వాక్యార్థో రసాదిరూపస్తచ్ఛబ్దేనోచ్యతే. తస్మిన్ పరాస్తత్పరాః తదాసక్తాస్తద్విషయకా ఇత్యర్థః తేషాంభావస్తాత్పర్య మిత్యర్థావగమాత్-

తా- ఆలంకారికమతమందైతే వ్యంజనమే తాత్పర్యము- వారు ఇట్లుగాఁజెప్పుచున్నారు- చెప్పునట్టివాని బుద్ధియందు సమీపించునదియు వాక్యమువల్లఁ దోచునదియునగు రసాదిరూపమైన వాక్యార్థము (తాత్పర్యశబ్దమందలి) తచ్ఛబ్దముచేతఁ జెప్పఁబడును- దానియందుఁ బ్రధానులు తత్పరులు- అనఁగా దానియందాసక్తిగలవారలు- వారిధర్మము తాత్పర్యము అని యర్థముయొక్క లాభమువల్ల (చెప్పుచున్నారని యన్వయము)

వ్యా- స్వాభిహితానాం పదార్థానామర్థాభిధాయినాం వా శబ్దానాం విశిష్టార్థప్రత్యాయనశక్తిస్తాత్పర్యమితి మీమాంసకామతభేదేన వర్ణయంతి- తన్మతే గామానయేత్యాదౌ దేవదత్తకర్తృకదండ కరణక గోకర్మకానయనరూపో విశిష్టార్థో వ్యంగ్యమర్యాదానావిధురస్తాత్పర్యార్థ ఇత్యుచ్యతే- తత్కథమస్య వ్యంగ్యాంతర్భావ ఇతిచేత్- సహితావస్త్రాత్రే కవీంద్రసంరంభవిశ్రాంతిః-

తా- ఓయీ (శబ్దములచేత) చెప్పఁబడినపదార్థములకుఁగాని యర్థమునుజెప్పునట్టి శబ్దములకుఁగాని సముదాయార్థమును దోపింపఁ జేయుశక్తి తాత్పర్యము- అని మతభేదముచేత [రెండు రెఱఁగులుగా] మీమాంసకులు వర్ణించుచున్నారు- వారిమతమందు ,, గోవునుదీసు

కానిరమ్ము" అను మొదలగుచోట దేవదత్తుఁడు కర్తగలిగినట్టియుఁ గత్తి సాధనముగాఁ గలిగినట్టియుఁ గోవు కర్తగాఁ గలిగినట్టియుఁ దీనికాని వచ్చుటయనునట్టి సముదాయార్థము వ్యంగ్యన్యాయము లేనిదై తాత్పర్యమువలనఁ బొందఁబడుటవల్లఁ దాత్పర్యమని చెప్పఁబడుచున్నది. కావున దీనికి వ్యంగ్యములో నంతర్భావ మెట్లుగాఁగలుగునని కవీశ్వరులకంత మాత్రమందే యుద్దేశము నిలచియుండదు.

వ్యా. కావ్యే శబ్దానా మన్వయవ్యతిరేకాభ్యాం ప్రవృత్తిహేతుభూతస్య ప్రధానస్య ప్రయోజనాంతరస్యాభావాత్ కింతు తదర్థస్య కా-రేణ ప్రతీయమానే సామాజికానందాస్వాదఫలే రసాద్యర్థాంతరే- అతస్స ఏవ తాత్పర్యార్థ ఇతి తత్ప్రత్యాయక పదార్థశక్తిరేవ తాత్పర్యం కవిసమయే.

తా. కావ్యమందలి శబ్దములకు నన్వయవ్యతిరేకములచేత మనుష్యునిఁ బ్రవర్తింపఁజేయుటకుఁ గారణమైన మఱియొక ప్రధానమగు ప్రయోజనము లేదు- మఱియేమంటే పదార్థములను దిరస్కరించుటచేతఁ దోఁచెడునట్టియు సభికులానందముచే ననుభవించుటయే ఫలముగలిగినట్టియు నర్థాంతరమయిన రసాదికమందే కవిసంరంభవిశ్రాంతియగుచున్నది. కావున నదియే తాత్పర్యార్థమని దానినిఁ దోఁపించునట్టి పదార్థశక్తియే తాత్పర్యమని కవీశ్వరుల యేర్పాటునందున్నది.

వ్యా. తచ్చ నాభిధా- సంకేతాభావాత్. నచ లక్షణా. ముఖ్యార్థబాధాద్యభావాత్. అతో వ్యంజనస్యైవేదం నామాంతరకథనమితి తదర్థస్య వ్యంగ్యార్థత్వం యుక్తమితి వదామః.

తా. ఆ తాత్పర్యార్థమున్ను అభిధగాదు. సంకేతములేదుగావున ముఖ్యార్థబాధ మొదలగునవి- [మొదలగునవి యనఁగా సంబంధప్రయోజనములు] లేకపోవుటవలన లక్షణగాదు- కావున వ్యంజనమునకే ఇది రెండవపేరగుటకు దానియర్థము వ్యంగ్యార్థమగుట యుక్తమని చెప్పుచున్నాము-

వ్యా. తర్హి కావ్యేషు పదార్థాన్వయ రూపో వాక్యార్థః కథం ప్రతీయత ఇతి చేత్ తార్కికాణామివ వాక్యశక్త్యా న పున స్తాత్పర్యశక్త్యేః మీమాంసకానామివ, అతఏవ తార్కికా వదంతి ఆకాంక్షాదిమత్త్వే సతి పదార్థానాం సమన్వితానామవయవశక్తిర్వాక్యం. తద్బలాయాతో వాక్యార్థః. తాత్పర్యార్థస్తు పరిణతివిరసం పనసఫలం పరిణతిసరసమామ్రఫలమిత్యాది నిందాప్రశంసాది వాక్యేషు హానోపాదానాది రూప ఏవ నాన్యః. తాత్పర్యమపి భావాభిప్రాయాద్యపర పర్యాయమేవేతి

తా. అట్లైతే, కావ్యమందు పదార్థాన్వయరూపమైన వాక్యార్థ మెట్లుగాఁ దోఁచుచున్నదంటే తార్కికులకువలె వాక్యశక్తిచేతఁ గాని మీమాంసకులకువలెఁ దాత్పర్యముచేతఁగాదు. కనుకనే తార్కికు లేమనుచుండిరన 'ఆకాంక్షాదులు కలుగుచుండఁగా నన్వయించిన పదార్థముల యవయవశక్తి వాక్యము. దాని బలమువలనవచ్చినది వాక్యార్థము. తాత్పర్యార్థమైతేనో. పనసపండు మాగితే రుచి చెడును, మామిడిపండు మాగితే రుచియెక్కును అను మొదలగుచోట నిందాస్తోత్రవాక్యములయందు (అనఁగాఁ బనసపంటికి నింద, మామిడిపంటికి స్తోత్రము) విడుచుట, స్వీకరించుట. (పనసపంటిని విడచుట, మామిడిపంటిని స్వీకరించుట) మొదలగు నదియే. (తాత్పర్యార్థమనుట) మఱియొకటి గాదు తాత్పర్యమును భావము, అభిప్రాయము మొదలగు వేఱుపేళ్లుగలదే అని (తార్కికులనుచున్నారు)

వ్యా. అత ఏవోక్తం కావ్యప్రకాశే తాత్పర్యార్థోపి కేషుచిదితి. సుధానిధావప్యుక్తం అస్మన్మతం తాత్పర్య వ్యాపారాపేక్షం భవతీతి. విద్యాధర విదుషాప్యభిహితం తాత్పర్యం నామ వ్యాపారాంతరం పదైరభ్యుపసంగతమితి. శృంగార భావప్రకాశికేపి గదితం. శ్లో॥ అతోధ్వన్యాఖ్య తాత్పర్యగమ్యమానత్వతస్స్వతః । కావ్యైరసాలంకృత్యాది ర్వాక్యార్థో భవతిస్ఫుటమితి॥ ధ్వన్యాచార్యేణాపి

ఖ్యాతం.' యత్త్వభిప్రాయరూపం విశేష వ్యంగ్యం శబ్దార్థా భ్యాం ప్రకాశ్యతే తద్భవతి వివక్షితం తాత్పర్యేణ ప్రకాశితమితి తాత్పర్య మభిప్రేత్యోక్తం శబ్దశాసనేన సాహాగ్యారసప్రవృత్తిరితి.

తా. కనుకనే కావ్యప్రకాశమందుఁ జెప్పఁబడినది కొన్నిటి యందుఁ దాత్పర్యార్థము అని. సుధానిధియందును జెప్పఁబడినది. మామతము తాత్పర్యవ్యాపారాపేక్షగలదియని విద్యాధరపండితుని చేతనున్ను జెప్పఁబడినది తాత్పర్యమని మఱియొక వ్యాపారమని కొందఱిచే నంగీకరింపఁబడినదని శృంగారభావప్రకాశికయందును జెప్పఁబడినది స్వతస్సిద్ధముగా ధ్వనియనుతాత్పర్యమువలనఁ దోచుటవలనఁ గావ్యమందు రసాలంకారాదులు వాక్యార్థము.' ఇది స్పష్టము అని ధ్వన్యాచార్యులచేతనున్ను చెప్పఁబడినది. ఏదియభిప్రాయరూపమైన విశేషవ్యంగ్యము శబ్దార్థములచేతఁ బ్రకాశింపఁజేయఁబడుచున్నదో యది తాత్పర్యముచేత స్పష్టముగా వివక్షింపఁబడినదియని. ఇదియంతయు నభిప్రాయముఁ జేసికొని నన్నయభట్టు 'సాహాగ్యారసప్రవృత్తిః' అని చెప్పినాఁడు.

వ్యా. శక్త్యాలక్షణయాచ నిర్వాహాన్న వ్యంజనావృత్త్యంతరమితితార్కికాః- తన్నిరసనద్వారావ్యక్తినిర్వాహ ప్రకారస్తుమథురానాథీయగదాధరీయాప్పయదీక్షితీయాది గ్రంథేషు ద్రష్టవ్యం,

తా. శక్తిచేతను లక్షణచేతను నిర్వహించుటవల్ల వ్యంజన యను మఱియొక వృత్తిలేదని తార్కికులు చెప్పిరి. అట్టిమతమును నిరసించుటద్వారా వ్యక్తినిర్వహించునట్టిరీతి మథురానాథుఁడు, గదాధరుఁడు, అప్పయ్యదీక్షితులు మొదలగువారు చెసిన గ్రంధములయందుఁ జూడవలెను.

వ్యా. రసస్వరూపం తావద్విగచ్యతే 'విభావానుభావసాత్త్విక వ్యభిచారి సామగ్రీ సముల్లసితస్థాయిభావో రస ఇతిభావస్యస్థాయిత్వం నామసజాతీయానభిభూతతయా యావదనుభవమవస్థానం- భర

తేనావ్యక్తం-విభావానుభావసాత్త్విక వ్యభిచారిసంయోగా ద్రసని ష్పత్తిరితి.

తా. రసస్వరూపము చేయఁబడుచున్నది- (అనఁగాఁ జెప్పఁబడు చున్నది) విభావములు, అనుభావములు, సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు వీనిపూర్తిచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన స్థాయిభావము [అనఁగా రత్యాదికము] రసము అగును. భావమునకు స్థాయిత్వ మనఁగా నేమంటే సజాతీయములచేతను [అనఁగా మిత్రరసములచేతను] విజాతీయములచేతను [అనఁగా విరుద్ధరసములచేతను] తిరస్కరింపఁబడకుండుటచేత [అనఁగా నంగరసములు విస్తరించి ప్రధానరసము కప్పివేయఁబడకుండుటచేతననుట] సామాజికుల యనుభవపర్యంతముండుట- [స్థాయిత్వము] భరతునిచేతనుగూడఁ జెప్పఁబడినది- విభావానుభావసాత్త్విక వ్యభిచారిభావముల సంబంధము వలన రసముయొక్క పుట్టువని.

వ్యా. విభావాదీనాం సంయోగాద్వ్యంగ్య వ్యంజక భావలక్షణాత్సంబంధాద్రసస్య నిష్పత్తిరభివ్యక్తిరిత్యేతేన రస ఉత్పద్యతే జ్ఞాప్యతఇతివదతాం భట్టలోల్లాదీనాం మతంనిరస్తం- నిరసనప్రకారస్తుతత్ప్రతిపాదక గ్రంథాదేవావగంతవ్యః.

తా విభావాదులయొక్క తెలుపుడుచేయఁబడుట తెలుపుడుంచేయుట యనునట్టి సంబంధమువలన రసమునకుస్ఫుటత్వము అనుహేతువువలన నీసంబంధముచేతరసము పుట్టుచున్నదియనఁగాఁ దెలియఁబడుచున్నదియని చెప్పుచున్న భట్టలోల్లాదుల మతము నిరాకరించఁబడినది- ఆనిరాకరణవిస్తారముదానినిఁ జెప్పునట్టి గ్రంథమువల్ల నే తెలియఁదగినది.

వ్యా. అత్రవిభావానుభావ వ్యభిచారిణాం తత్రతత్ర రసశ్లోకేషు కేవలానామవస్థితిర్దృశ్యతే- తథాపి తేషామపి సాధారణానాంప్రస్పరావినాభావ బలాదన్యోన్యాపేక్షత్వేసతి నానైకాంతికత్వ

మితిసూత్రేమిళితానాం గ్రహణమితిబోద్ధవ్యం.

తా. ఇందువిభావానుభావ వ్యభిచారిభావముల కచ్చటచ్చట రసశ్లోకములయందుఁ బ్రత్యేకముగా నునికి గాన్పించుచున్నది. అయినను సాధారణములయిన యా విభావాదులు పరస్పరసంబంధబలమువల్లఁ బరస్పరాపేక్షలకవాటచేతఁ బ్రత్యేకత్వములేదు. అని [వెనుక జెప్పిన విభావానుభావేత్యాది] సూత్రమందుఁగలిసియున్న వానికేగ్రహణము చేయఁబడినదని తెలియవలెను.

వ్యా. అయమసంలక్ష్యక్రమఏవరసః విభావాది వ్యంజనీయతయా క్రమస్యవిద్యమానత్వేపి రసాస్వాద్వాతి శయమహిమ్నాతస్యాసంలక్ష్య మాణత్వాత్. తదుక్తంశృంగారతిలకే. శ్లో॥ రసభావతదాభాసభావశాంత్యాదిరక్రమః. భిన్నోరసాద్యలంకారాదలంకార్యతయా స్థితఇతి.

తా. ఈరసముచూడఁదగనిక్రమముగలవ్యంగ్యముగలదే(అసంలక్ష్యక్రమవ్యంగ్యము వివరణముసమీపములోనేవచ్చును.)విభావాదులచేత వ్యంగ్యము కాఁదగినదౌటచేతఁ గ్రమమున్నను రసాస్వాదాతిశయమహిమచేత నావ్యంగ్యత్వము కాన్పించదుగనుక అది శృంగారతిలకమందుఁ జెప్పఁబడినది. రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావశాంతి మొదలగునది యసంలక్ష్యక్రమము. అది యలంకరించఁదగినదిగానుండి రసాద్యలంకారమునకంటె వేఱైనది అని.

వ్యా. అసంలక్ష్యక్రమత్వంచ యత్ర విభావానుభావాది వశాదాశుభావినీ రసవ్యక్తి సతైవ. అన్యత్రతురసాదిధ్వనిరపిసంలక్ష్యక్రమఏవ. తదుక్తమభినవగుప్తపాదాచార్యైః. యద్యపి రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవ నవాచ్యః. తథాపినసర్వో ప్యసంలక్ష్యక్రమవిషయ ఇతి. అత ఏవధ్వనికారోపి. శ్లో॥ ఏవంవాదినదేవర్షౌ పార్శ్వేపితురధోముఖీ। లీలాకమలపత్రాణి గణయామాసపార్వతీ

త్యత్రలజ్జాఖ్యసంచారిభావానురణనేనవ్యంగ్యముదాజహార-

తా. అసంలక్ష్యక్రమత్వమున్న యెచ్చట విభావానుభావాదివశమువలన రసస్ఫుటత్వము త్వరగానగునో అచ్చటనే- తక్కినచోట రసాదిధ్వనియును సంలక్ష్యక్రమవ్యంగ్యమే- అదియభినవగుప్తాచార్యులు చెప్పియున్నారు- ఆలోచింపఁగా రసముభావము మొదలగు నర్థము ధ్వనియగుచు నేయున్నది- వాచ్యముగాదు- అయినను అంతయు సంలక్ష్యక్రమ వ్యంగ్యవిషయముగాదు- అని- కావుననే ధ్వనికారుఁడును, (నారదుఁడు శివునికిఁదన్నిమ్మని హిమవంతునితోఁ జెప్పఁగాఁ దండ్రిసమీపమందుఁ దలవంచుకొని పార్వతితనచేతనున్న విలాసపద్మముయొక్క రేకులను లెక్కించెను) అనుచోట లజ్జయను సంచారిభావమును అనురణన [అనఁగా ఘంటమీఁద దెబ్బగొట్టగా మొదటనొక ధ్వనికలిగి దానివలననేక ధ్వనులు ఒకదానిననుసరించియొకటి కలుగును- అట్టిధ్వని] ముచేత వ్యంగ్యముగా నుదాహరించెను.

వ్యా. తత్రరసాభివ్యక్తికారణం దయితోజనోవిభావః- సద్విధా- ఆలంబనోద్దీపనభేదాత్- ఆలంబనం చరతేర్ద్వివిధః- నాయికానాయకభేదాత్- తత్రనాయికా సంభావితనాయకసామాన్యగుణయోగినీ- సాచసంగ్రహేణాష్టధా- స్వాధీనపతికా, వాసకసజ్జికా, విరహోత్కంఠితా, విప్రలబ్ధా, ఖండితా, కలహాంతరితా, ప్రోషితభర్తృకా, అభిసారికాభేదాత్.

తా. అందు రసస్ఫుటత్వమునకుఁ గారణమైన యిష్టజనము విభావమనిపించికొనును. అది యాలంబనము, ఉద్దీపనము నను భేదమువలన రెండువిధములు. అందు రతియొక్క యాలంబనము నాయికయని నాయకుఁడని భేదమువలన రెండువిధములుగలది. అందు గౌరవముగలనాయకునితో సామాన్యములైన గుణసంబంధముగలది నాయిక. అదియు సంక్షేపముచే నెనిమిదివిధములు. ఎట్లనఁగా-

స్వాధీనపతిక=స్వాధీనుఁడైన పెనిమిటిగలది. వాసకసజ్జిక=క్రీడాగృహాదులలంకరించి సిద్ధముఁ జేయునది. విరహోత్కంఠిత=నాయకుఁడు రాకయాలస్యముఁ జేయఁగా విరహముచేత తపించునది. విప్రలబ్ధ=ఒక సంకేతస్థానమునకు వచ్చెదనని రాక నాయకునిచేత వంచింపఁబడినది. ఖండిత=ప్రియుఁడన్యస్త్రీనిఁ గూడెనని తెలసి కోపగించినది. కలహాంతరిత=కోపమువల్లఁ బ్రియునిని రాకరించి తర్వాత పరితపించునది. ప్రోషితభర్తృక=దేశాంతరము వెళ్ళిన పెనిమిటిగలదియై పరితపించునది. అభిసారిక=ప్రియునిఁ గూర్చి సంకేతస్థానమునకుఁ బోవునది. అను భేదములవలన.

వ్యా॥ ఏతాసాం నాయకానుకూలనస్య సఖీ ధాత్రీజాతా ప్రాతివేశినీ శిల్పినీ కారు లింగినీ సంజ్ఞాశ్చదూతికాః.

తా. ఈనాయికలకు నాయకుననుకూలింపఁ జేయుటకు సఖి=చెలికత్తె, ధాత్రీజాత=పెంపుడుతల్లికూఁతురు, ప్రాతివేశిని=పొరుగింటిది. శిల్పిని=చిత్తరువులు మొదలగునవి చేయునది కారువు=చాకిత మొదలగునది లింగిని=యోగిని అను సంజ్ఞగల ఆఱుగురుదూతికలు గలరు.

వ్యా. నాయికాసంగ్రహస్తు విశేషేణ రత్నాపణాదిషు కృతః.
శ్లో॥ స్వాన్యా సాధారణా చ స్వా ముగ్ధా మధ్యా ప్రగల్భికా । ఆద్యైకధా త్రిధాన్యే ద్వే ధీరాధీరోభయాత్మికా। జ్యేష్ఠాకనిష్ఠాభేదేన తే ఏవ ద్వివిధే పునః। అన్యా కన్యా పరోఢా చ వేశ్యా త్రికేతి షోడశ। స్వాధీనపతికాద్యష్టావస్థాభిస్తాస్సమన్వితాః। ప్రత్యేకమష్టధా ముఖ్యా మధ్యా హీనేతి తాస్త్రిధా। ఇత్యేవం నాయికాభేదాస్సముదాహృష్టాగ్ని ౩౮౪ సమ్మితాః । విరహోత్కంఠితా చైవ విప్రలబ్ధాభిసారికా । ఇత్యవస్థాత్రయం ప్రాహుః కేచిత్కన్యాపరోఢయోః। చతుఃపంచాశదధిక త్రిశతీ సమ్మతా భవేదిత్యాదినా.

తా. నాయికలసంక్షేపము (ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమగు)

రత్నాపణము మొదలగు వానియందు విశేషముగాఁ జేయఁడినది. ఎట్లనఁగా. నాయిక స్వీయ, (తానువివాహమైనది) అన్య, (ఇతరులస్త్రీ) సాధారణ (సామాన్యస్త్రీ)భోగముదియనుట) అనిమూఁడు తెఱఁగులు అందు స్వీయ ముగ్ధ[నేర్పరిగానిది]మధ్య[కొంచెము నేర్పరి]ప్రగల్భ[నేర్పుతి]అనిమూఁడువిధములుగలది. అందు మొదటిముగ్ధ ఒకవిధముగలది. తక్కినయిద్దఱు [మధ్యాప్రగల్భలు] ధీర, [ధైర్యముగలది] అధీర, [ధైర్యములేనిది] ఉభయాత్మ, [ధీరాధీరా] అనిమూఁడువిధములు. [అనఁగానొక్కొకతె మూఁడేసిరీతులఁజొప్పున ఆఱువిధములనుట] వారే జ్యేష్ఠ, [పెద్దది]కనిష్ఠ, [చిన్నది] అనిరెండువిధములుగలవారు. [అనఁగా ఆఱురెండ్లుపండ్రెండనుట] [ముగ్ధతోఁబదుమూఁడు] అన్యకన్య, [పెండ్లికానిది] అపరోఢ [అన్యుఁడు వివాహమైనది] అనిరెండువిధములుగలది. సామాన్యయొకతె ఇట్లుపదియాఱుగురు. ఆపదియాఱుగురు స్వాధీనపతికాదు లైనయెనిమిది యవస్థలతోఁగూడి ప్రత్యేకముగా నెనిమిదేసిరీతులఁగాఁగా ౧౨౮గురు అయిరి. వారుముఖ్య, [ప్రథమురాలు) మధ్య, [మధ్యమురాలు] హీన అప్రథానురాలు] అనిమూఁడువిధములు ఈప్రకారము ౩౮౪ నాయకాభేదములైనవి. కొందఱుకన్యకు నపరోఢకును విరహోత్కంఠిత, విప్రలబ్ధ అభిసారికయని మూఁడవస్థలనే చెప్పిరి కావున ఆలెక్కనువీరు ౩౫౪ఱు అయిరి. [అనినాయికాసంగ్రహము.]

వ్యా॥ పద్మిన్యాది భేదాశ్చత్వారః హరిణీతురంగీకరిణ్యాఖ్యాస్తదుపజాతయశ్చ కామశాస్త్రప్రసిద్ధాః॥

తా. పద్మినిమొదలగు జాతిభేదములు నాలుగు [పద్మిని, శంఖిని చిత్రిణి, పాంచాలి] హరిణి, తురంగి, కరిణియనునట్టివానియు జాతులును కామశాస్త్రమందుఁ బ్రసిద్ధములు.

వ్యా. శ్లో. మహాకులీనత్వముదారతాచ తథామహాభాగ్యవిదగ్ధభావౌ। తేజస్వితాధార్మికతోజ్జ్వలత్వమమీగుణా జాగ్రతినాయకస్య।

నయతిప్రాపోన్తి వృత్తంఫలంచేతి నాయకపద వ్యుత్పత్తిరాలంకారికైః ప్రదర్శితా.

తా. మహాకులీనత్వము=గొప్పవంశమందుఁ బుట్టుట. ఉదారత్వము=దాతృత్వము. మహాభాగ్యము=గొప్పయైశ్వర్యము. విదగ్ధత్వము=నేర్పు. తేజస్విత్వము=తేజస్సుగలుగుట ధార్మికత్వము=ధర్మములు గలిగియుండుట. ఉజ్జ్వలత్వము=మంచి రూపముగలిగియుండుట. అనునివి నాయకగుణములుగాఁ బ్రకాశించుచున్నవి వ్యాపారమును ఫలమునుబొందించువాఁడు గావున నాయకుఁడనఁబడును అను వ్యుత్పత్తిని నాయకశబ్దమునకు నాలంకారికులు చూపించిరి.

వ్యా. శ్లో॥ కీర్తిప్రతాపసంపన్నస్త్రిపుమర్థత్రయతత్పరః । ధురంధరశ్చగుణవాక్ నాయకస్సపరికీర్త్యతే॥ అత్ర కీర్తిప్రతాపాదీనాం గుణవత్పదేనైవోపాత్తానామపి పునరుపాదానమే తేషాం సర్వేష్వపి నాయకేష్వా వశ్యకత్వం ద్యోతయితుమితిరహస్యం. సచతుర్విధః. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతభేదాత్. ఏతేషాం సర్వరససాధారణ్యేపి వీరరౌద్రశృంగారశాంతరసప్రాధాన్యమస్తీతి రససంప్రదాయవిదః.

తా. కీర్తిప్రతాపములతోఁ గూడినవాఁడును, (ధర్మార్థకామములను) మూఁడుపురుషార్థములయందాసక్తుఁడును, భూభారమునువహించిన సద్గుణసంపన్నుఁడును, నాయకుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఇందుఁ గీర్తిప్రతాపాదులు 'గుణవాక్' అను పదముచేత స్వీకరింపఁబడినను నాయకులందఱియందు నివి యావశ్యకముగానుండవలెనని తెలియుటకొఱకు మరల స్వీకరించుటయని రహస్యము. ఆనాయకుఁడు ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడునను భేదమువలన నాల్గువిధములు గలవాఁడు. వీరు సర్వరసములయందు సాధారణులైనను వరుసగా వీరరసము, రౌద్రరస

ము, శృంగారరసము, శాంతరసము ప్రాధాన్యముగలవారని సంప్రదాయమెఱింగినవారు చెప్పుచున్నారు.

వ్యా. ఏతేషామేవశృంగారాశ్రయతయా అనుకూల్యాదిభేదేన ప్రత్యేకం చతుర్విధభేదానాముత్తమ మధ్యమాధమభేదేన పునఃప్రత్యేకం త్రైవిధ్యేష్టాచత్వారింశద్భేదాభవంతి.

తా. వీరే శృంగారరసము నాశ్రయించుటచేత (ముందువివరించఁబోవు) అనుకూల్యాదిభేదముచేతఁ బ్రత్యేకముగా నాల్గుభేదములు గలవారై యుత్తమ మధ్యమాధమభేదముచేతఁదిరిగి ప్రత్యేకముగా మూఁడువిధములుగలవారై నలువదియెనిమిది భేదములు గలవారౌమన్నారు.

వ్యా. ఉక్తసకలగుణసంపన్నః ప్రబంధవ్యాపిఫలశిరస్కవ్యాపార ఉత్తమః. కతిపయగుణహీనో మధ్యమః. బహుగుణహీనోధమ ఇతివివేకః. ధీరోదాత్తాదిశబ్దాశ్చ మహావీరచరితాది మహాప్రబంధేషు ఏకస్యానేకరూపాభిధానేన వత్సవృషభమహోక్షాదిశబ్దవదవస్థావాచినోనజాతివాచినఇతి ప్రతిపాదితం దశరూపకే.

తా. చెప్పఁబడిన గుణములన్నిఁటితోఁ గూడినవాఁడై ప్రబంధమంతటను వ్యాపించినవాఁడై ఫలము ప్రధానముగలవ్యాపారము గలవాఁడుత్తమనాయకుఁడు. చెప్పఁబడినగుణములలోఁ గొన్నిగుణములులేనివాఁడు మధ్యముఁడు. చాలాగుణములు లేనివాఁడధముఁడని విభజనము. మహావీరచరితము మొదలగు మహాప్రబంధములయందొకనికే యనేకరూపములను జెప్పుటచేత దూడ, ఎద్దు, పెద్దయెద్దు మొదలగుశబ్దములవలె ధీరోదాత్తాదిశబ్దము లవస్థలను జెప్పునవిగాని జాతులనుజెప్పునవిగావని దశరూపకమందుఁ జెప్పఁబడినది.

వ్యా. శృంగారనాయకశ్చతుర్విధః. అనుకూలోదక్షిణోధృష్టశ్శఠ ఇతి భేదాత్. శ్లో॥ ఏకాయత్తోనుకూలస్స్యాత్తుల్యోనేకత్ర దక్షిణః। వ్యక్తాపరాధోధృష్టస్స్యాద్గూఢవిప్రియకృచ్ఛఠః.

తా. అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అను భేదమువలన శృంగారనాయకుఁడు నాల్గువిధములుగలవాఁడు ఒక స్త్రీయందధీనుఁ డనుకూలుఁడు. అనేక స్త్రీలయందు సమానముగా నుండువాఁడు దక్షిణుఁడు, నాయికావిషయమై స్ఫుటమైనయపరాధముగలవాఁడు ధృష్టుఁడు. నాయికకుమాత్రము దెలిసిన యనిష్టమును జేయువాఁడు శఠుఁడు

వ్యా. ఏతేషాం నాయికానుకూలనే పీఠమర్ద విట చేట విదూషకాస్సహచారిణః శ్లో॥ కించిదూనస్తుపీఠమర్దః కలాసు కుశలో విటః। సంధానకుశలశ్చేటో హాస్యప్రాయో విదూషకః॥ పాంచాలదత్తభద్రకూచిమారాఖ్యాశ్చతస్రః పురుషజాతయః శశవృషహయాఖ్యా ఉపజాతయశ్చ కామశాస్త్రే ప్రతిపాదితాః।

తా. ఈనాయకులకు నాయికననుకూలింపఁజేయుట విషయమై పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడునని స్నేహితులు. నాయకునికంటెఁ గొంచెము తక్కువవాఁడు పీఠమర్దుఁడు. విద్యలయందు నేర్పరి విటుఁడు. స్త్రీపురుషసంధానమందు నేర్పుగలవాఁడు చేటుఁడు. హాస్యముతోఁగూడినవాఁడు విదూషకుఁడు. పాంచాలుఁడు, దత్తుఁడు, భద్రుఁడు, కూచిమారుఁడునను నాల్గు పురుషజాతులు. శశ[చెవులపిల్లి]జాతి, వృష[ఎద్దు]జాతి, హయ[గుఱ్ఱము]జాతియును నుపజాతులును కామశాస్త్రమునందుఁ జెప్పఁబడినవి

వ్యా. ఉద్దీపనంతదుత్కర్షహేతుస్తచ్చతుర్విధం. ఆలంబనగుణచేష్టాలంబనగుణాతటస్థభేదాత్.

తా. ఆలంబనభావము ఆయాలంబనవిభావముయొక్క (అనఁగా నాయికానాయకులయొక్క) యతిశయమునకు హేతువైనది. అది యు నాలంబనగుణము, ఆలంబనచేష్ట, ఆలంబనాలంకారము, తటస్థమునను భేదమువలన నాల్గువిధములుగలది.

వ్యా. రూప యౌవనాదిరాలంబనగుణః. హావభావహేలా మా

ఘుర్య ధైర్య లీలావిలాస విచ్ఛిత్తి విభ్రమకిలికించితమోట్టాయితకు
ట్టమిత బిబ్బోకలలిత కుతూహల చకితవిహృత హాసావ్యయాస్తచ్చే
ష్టా యౌవనోద్భూతాః- హారాదిరలంకారః. మలయానిల చంద్రా
ద్యా స్తటస్థాః. కార్యతః కటాక్షభుజాక్షేపాదిరవయర వికారవిశే
షోనుభావః.

తా. రూపము యౌవనము మొదలగునది యాలంబనగుణము. హా
వము (ఈషద్దృష్టవికారస్యాద్భావో హావః ప్రకీర్త్యతే. ఇంచుక చూ
డఁబడిన వికారముగల భావము హావమనఁబడును) భావము (రసాభి
జ్ఞానయోగ్యత్వం భావ ఇత్యభిధీయతే, రసము దెలియుటకు యోగ్య
తభావమనఁబడును. ఇందు భావము ముందు జెప్పఁదగినది. అయినను
ఇట్లువ్రాయుటకుఁ గారణము తెలియదు ) హేల. (సువ్యక్తవిక్రియో
భావో హేళేతి ప్రతిపాద్యతే. మిక్కిలిస్ఫుటమైన వికారముగల
భావము. హేలయనిచెప్పఁబడును ) మాధుర్యము (అభూషణేపిర
మ్యత్వం మాధుర్యమితికథ్యతే, అలంకరించకపోయినను సుందర
ముగానుండుట మాధుర్యమని చెప్పఁబడును.) ధైర్యము. (శీలాద్య
లంఘనం నామధైర్యమిత్యభిధీయతే. యోగ్యస్వభావము మొదలగు
వాని నతిక్రమించకుండుట ధైర్యమనిచెప్పఁపడును-) లీల. (ప్రియా
నుకరణంలీలా వాగ్భిర్గత్యాథచేష్టితైః. మాటలచేత, నడతచేత, వ్యా
పారములచేతఁబ్రియునితో సమానముగానుండుట లీల ) విలాసము.
(తాత్కాలికో వికారస్స్యాద్విలాసోదయితేక్షణే. ప్రియునియొ
క్కచూచుటయందుఁ దత్కాలమందలి వికారము విలాసము) విచ్ఛి
త్తి. (విచ్ఛిత్తిరతిరమ్యత్వం స్వల్పైరపివిభూషణైః. కొద్దియలంకా
రములచేతనైనను మిక్కిలి సుందరముగానుండుట విచ్ఛిత్తి.) విభ్ర
మము. [విభ్రమస్త్వరయాకాలే భూషాస్థానవిపర్యయః- ప్రియుఁ
డువచ్చుటమొదలగు కాలమందుఁద్వరచేత నలంకారములువ్యత్యయ
ముగాఁ దాల్చుటవిభ్రమము] కిలికించితము- [రోషాశ్రుహర్షభీత్యా

దేస్సంకరశ్శికిల్కిఞ్చితం. కోపము, కన్నీరు, సంతోషము, భయము మొదలగువానిసంకరము కిలికించితము] మోట్టాయితము. [మోట్టాయితంస్యాదిష్టస్యకథాదౌ భావసూచనం. ప్రియునియొక్క కథాదికమందు భావమునుసూచించుట మోట్టాయితము] కుట్టమితము. [సమ్మర్దేపి సుఖాధిక్యంరతౌ కుట్టమితంమతం. సంభోగమందు సమ్మర్దముగలిగినను సుఖాతిశయము కుట్టమితమనిసమ్మతము] బిబ్బోకము. [మనాక్ప్రియకథాలాపే బిబ్బోకోఽనాదరక్రియా. ప్రియునికథలు చెప్పుటయందుఁ గొంచెము నిరాదరణముచేయుట బిబ్బోకము] లలితము. [సుకుమారాంగవిన్యాసో లలితంపరికీర్త్యతే మృదువైనయవయవవిన్యాసములలితము] కుతూహలము. [కుతూహలం రమ్యదృష్టౌచాపలంపరికీర్త్యతే. సుందరులనుజూచుటయందుఁ జాంచల్యము కుతూహలము] చకితము. [చకితం భయసంభ్రమః. భయముచేతనయినతొందరపాటు చకితము] విహృతము. [విహృతంప్రాప్తకాలస్య వాక్యస్యాకథనంహ్రియా. సిగ్గుచేతఁజెప్పఁదగినకాలము గలవాక్యమును జెప్పకుండుట విహృతము] హాసము. [అకస్మికంతుహాసితం యౌవనాదివికారజం. యౌవనము మొదలగువాని వికారమువల్లఁబుట్టినహఠాత్తుగాఁ గలిగినవవ్వు హాసము] ఈపేరుగల యౌవనమువలనఁబుట్టినచేష్టలు. హారములు మొదలగునది యలంకారము. చల్లగాలి, చంద్రుఁడు మొదలగునవి తటస్థభావములు. కార్యమువలనఁ గ్రేగంటిచూపు, చేతులుచిమ్ముట మొదలగు నవయవవికారవిశేషము అనుభావము.

వ్యా. పరగత సుఖదుఃఖానుభావ నయాభావితాంతఃకరణత్వం సత్త్వం తద్భవాస్సాత్త్వికా ఇత్యాదిప్రకారేణ సాత్త్వికశబ్దప్రవృత్తౌ ప్రాచామాచార్యాణామనేకధోక్తయో వర్తంతే. ఏతేషామనుభావాంతర్భావే సత్త్వజత్వలక్షణ విశేషేణ బ్రాహ్మణపరివ్రాజక న్యాయేన పార్థక్యేన పరిగణనమితి రసవాదినాంసమయః.

ల్లఁబుట్టినచురుకు లేకుండుట దైన్యము] ఉగ్రత్వము. [ధృష్టేపరాధే
చండత్వముగ్రతాతర్జనాదికృత్- నేరమికాన్పించినచో బెదరించు
టమొదలగువానినిఁ జేయునట్టి తీక్ష్ణత్వము ఉగ్రత్వము] చింత [ఇ
ష్టానభిగమాద్ధ్యానంచింతాశూన్యత్వతాపకృత్- ఇష్టమును బొందక
పోవుటవలనఁగలిగినట్టియు నివ్వెరపాటును, తాపమును జేయునట్టి
యు ధ్యానముచింత] త్రాసము. [ఆకస్మిక భయాచ్చిత్తక్షోభస్త్రా
సః ప్రకీర్త్యతే- అదిరిపాటుగాఁగలిగినభయమువలన మనస్సుయొక్క
చెదరిపోవుటత్రాసము] ఈర్ష్య. [దీనికనూయయనియుఁబేరు- పరో
త్కర్షాసహిష్ణుత్వ మసూయాపరికీర్తితా- ఇతరులగొప్పతనము నోర్వ
లేమి యసూయ] అమర్షము. [అమర్ష స్స్యాపరాధేషు చేతఃప్రజ్వల
నంమతం- నేరముతోఁగూడినవారివిషయమయి మనస్సు మండుట
యమర్షము] గర్వము. [అన్యధిక్కరణాదాత్మోత్కర్షోగర్వో బలా
దిజః- బలాదులవలనఁ బుట్టినట్టి పరులను దిరస్కరించుట వలనఁ దన
గొప్పతనము గర్వము] స్మృతి. [పూర్వానుభూతవిషయంజ్ఞానం స్మృ
తిరుదాహృతా- మున్నెఱిఁగినదానివిషయమయిన తెలివిస్మృతి] మ
రణము. [మరణంమరణార్థస్తు ప్రయత్నఃపరికీర్తితః- చావుకొఱకై
నప్రయత్నముమరణము] మదము [మదిరాదికృతోమోహహర్షవ్య
తికరోమదః- మద్యపానము మొదలగుదానిచేతఁ జేయఁబడిన మో
హముయొక్కయు సంతోషముయొక్కయు మేళనము మదము] సు
ప్తి. [సుప్తిర్నిద్రా సముద్రేకః- నిద్రయొక్క యతిశయము సుప్తి]
నిద్ర. [నిద్రాచిత్తనిమీలనం- మనస్సుముకుళించుట నిద్ర] విబోధ
ము. [విబోధశ్చేతసావాప్తిర్జృంభాక్షిపరిమార్గకృత్- ఆవులింత, క
న్నులుతుడచుట కలిగించునట్టితెలివినిఁబొందుట విబోధము] వ్రీడ.
[చేతస్సంకోచనం వ్రీడా నంగరాగ స్తవాదిభిః- కామానురాగము,
స్తోత్రముమొదలగువానిచేత మనస్సుయొక్క- సంకోచము వ్రీడ] అ
పస్మారము (ఆవేశోమోహదుఃఖాద్యై రపస్మారోంగతాపకృత్

రీరతాపమును జేయునట్టియు, మోహము, దుఃఖము, మొదలగువాని
చేతనైన పరవశత్వము అపస్మారము.) మోహము.[మోహస్తు మూర్ఛా
సంభీతి దుఃఖావేశానుచింతనైః॥ భయము, దుఃఖము, ఆవేశము, చిం
త మొదలగువానిచేత మూర్ఛఁబొందుట మోహము.] మతి. (తత్త్వమా
ర్గానుసంధానాదర్థనిర్ధారణంమతిః॥ నిజమైనతోవఁ దెలియుట వల
నఁబ్రయోజనమును నిశ్చయించుటమతి) అలసత. [మందోద్యమత్వ
మాలస్యంకర్తవ్యేషుప్రకీర్త్యతే॥ చేయఁదగిన కార్యములయందు నిమ్మ
శమయిన ప్రయత్నముగలుగుట యలసత.] ఆవేగము. (ఇష్టానిష్టాగ
మాజ్జాత ఆవేగశ్చిత్తసంభ్రమః॥ ఇష్టముయొక్కగాని యనిష్టముయొ
క్కగాని రావడమువలనఁ బుట్టిన చిత్తముయొక్క తొందరపాటు ఆ
వేగము.) తర్కము (సందేహాత్కల్పనానంత్యం వితర్కః పరికీర్తితః॥
సంశయమువలనఁ బలుతెరంగులుగాఁగల్పించుట తర్కము.) అవహిత్థ
(హర్షాద్యాకారసంగుప్తి రవహిత్థేతికథ్యతే॥ సంతోషము మొదలగు
నాకారములను మాటుజేయుట యవహిత్థయని చెప్పఁబడును.) వ్యాధి
(మనస్తాపాద్యభిభవా జ్వరాదిర్వ్యాధిరిష్యతే॥ మనస్సు పరితపించు
ట మొదలగువానిచేతనైన తిరస్కారమువల్ల జ్వరాదికము గలుగుట
వ్యాధి.) ఉన్మాదము. (ఉన్మాదస్తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి॥
ప్రాణులయందుఁ బ్రాణులుగానివారి యందును సమముగాఁ బ్రవ
ర్తించుట యున్మాదము.) విషాదము. (విషాదశ్చేతసోభంగ ఉపాయా
భావచింతనైః॥ ఉపాయములేక విచారించుటచేతనైన మనస్సుయొ
క్క విఱుఁగుట విషాదము.) ఔత్సుక్యము. (కాలాక్ష మత్వమౌత్సు
క్యంమనస్తాపత్వరాదికృత్॥ మనస్సునఁదాపము, తొందరపాటుమొ
దలగుదానినిఁ జేయునట్టితడవు నోర్వకుండుట యౌత్సుక్యము.) చ
పలత్వము.(చాపలంత్వనవస్థానం రాగద్వేషాదిసంభవం॥ అనురాగ
ము, కోపము, మొదలగుదానివలనఁ బుట్టిన స్తిమితత్వములేకుండుట
చపలత్వము )ఇవివ్యభిచారిభావములు ముప్పదిమూఁడు.

వ్యా. రతిర్హాసశ్చశోకశ్చ క్రోధోత్సాహౌభయంతథా। జుగుప్సావిస్మయశమాస్థాయిభావాః ప్రకీర్తితాః॥

తా. రతి, [సంభోగవిషయ ఇచ్ఛావిశేషోరతిః. సంభోగమందలి యిచ్ఛాతిశయమురతి.] హాసము. [వికృతిదర్శనాది జన్యోమనోవికారోహాసః. వికారములను జూచుట మొదలగువాని వలనఁబుట్టిన మనోవికారము హాసము] శోకము. [ఇష్టజనవియోగాదినా ఆత్మనిదుఃఖాతిభూమిశ్శోకః. ఇష్టజనుల విరహము మొదలగుదానిచేత మనస్సునందలిదుఃఖాతిశయము శోకము.] క్రోధము. (శత్రుకృతాపచారేమనః ప్రజ్వలనంక్రోధః. విరోధులచేతఁజేయఁబడినయపకారమువిషయమైమనస్సుమండుట క్రోధము) ఉత్సాహము [లోకోత్తరేషుకార్యేషుస్థేయాన్ప్రయత్న ఉత్సాహః లోకాతీతములైన కార్యములవిషయమైమిక్కిలి స్థిరమైనప్రయత్నముత్సాహము.] రౌద్రసందర్శనాదిభిరనర్థాశంకనంభయం భయంకరవస్తువులుజూచుట మొదలగువానిచేత నపరమునూహించుట భయము.] జుగుప్స [అర్థానాందోషదర్శనాదిభిర్గర్హణాజుగుప్సా. వస్తువులయొక్కదోషమును జూచుటమొదలగువానిచేత నిందించుటజుగుప్స] విస్మయము. [అపూర్వార్థసందర్శనాచ్చిత్తవిస్తారోవిస్మయః. క్రొత్తవస్తువులనుజూచుట వలనమనస్సువిస్తరించుట విస్మయము] శమము [వైరాగ్యాదినానిర్వికారచిత్తత్వంశమః. వైరాగ్యము మొదలగుదానిచేత వికారములేనిచిత్తముగలుగుట శమము. ఇవిస్థాయిభావములనఁబడును.

వ్యా శృంగారహాస్యకరుణారౌద్ర వీరభయానకాః బీభత్సాద్భుతశాంతాఖ్యా రసానవసమీరితాః. కేచిత్తుశృంగారమేవరసంమేనిరే కేచిత్తుశాంతంరసంమేనిరే అపరేవత్సలేనసహదశరసానురరీకుర్వతే అన్యేతుస్నేహభక్తిభ్యాం ద్వాదశరసానుపతిష్ఠంతే- శృంగారస్యైవకరుణాదీనా మపిరసత్వమస్తీతి ప్రతిపాదనం తదసాధ్వప్రతిపాదక మతనిరసనపాటవంచప్రాచీన గ్రంథాదవగంతవ్యం-

తా- శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము- శాంతము, ఈతొమ్మిదియురసములు అని చెప్పఁబడుచున్నవి- కొందఱు శృంగారమును మాత్రమే రసమునుగాఁ దలఁచిరి- కొందఱుశాంతమునుమాత్రమే రసమునుగాఁ దలఁచిరి- మఱికొందఱు వత్సలరసముతోఁగూడ పదిరసములనంగీకరించుచున్నారు- మఱికొందఱు స్నేహభక్తిరసములతోఁగూడపండ్రెండురసములను బొందుచున్నారు- శృంగారరసమునకుఁ బోలెకరుణాదులకును రసత్వమున్నదని చెప్పుటయు, కరుణాదులకు రసత్వములేదని చెప్పునట్టి మతమునునిరసించు నేర్పును పూర్వగ్రంథమువల్ల దెలియఁదగ్గది-

వ్యా- కేచిత్తుశాంతస్యోత్సాహం స్థాయిభావమాహుః- కాహళిస్తూత్సాహోనిర్వేదోవా శమోవాస్యస్థాయీత్యవాచ కేచిజ్జుగుప్సాస్థాయి నమేనమాహుః- తదసంగతంరసానాం ప్రతినియతస్థాయికత్వనియమాత్ .

తా- కొందఱుశాంతరసమున కుత్సాహమును స్థాయిభావమును గాఁజెప్పుచున్నారు- కాహళుఁడైతే ఉత్సాహముగాని నిర్వేదముగాని శమముగాని యీశాంతరసమునకు స్థాయిభావమునుగాఁ జెప్పెను- కొందఱు ఈశాంతరసమును జుగుప్సయే స్థాయిభావము గలదానిఁగాఁజెప్పుచున్నారు- రసములకుఁ బ్రత్యేకముగా స్థాయిభావము గలుగుటనియమమువలన నదిబాగుగాలేదు-

వ్యా యద్యపి పిత్రాదేర్గ్గపుత్రాదిప్రీతిస్థాయికోవత్సలోనామస సోమిత్రాదిష్వాదరస్థాయికస్స్నేహోపి రసః సేవకానాం సేవ్యగురుదేవాదిగోచరస్తాత్పర్యస్థాయికా భక్తిర్నామరసశ్చ తథాప్యేషాం రతిభావాంతర్భూతత్వమేవ. విషయభేదమాత్రాద్భేదవ్యపదేశః. రతిర్హి కామినీవిషయావిభావాది సముల్లాసితా శృంగారరసతామాపన్నతే సైవ గురుపుత్రమిత్రవిషయాచేద్భావశబ్దభాగ్భవతి.

తా. ఆలోచించఁగాఁ దండ్రి మొదలగువానికిఁ గొమారుఁడు మొదలగువానియందలి ప్రేమము స్థాయిగల వత్సలమను రసము, మిత్రుఁడు మొదలగువారియందాదరము స్థాయిగల స్నేహమనురసము, భృత్యులకు సేవించఁదగిన గురువు దేవుఁడు మొదలగువారియందలి యాసక్తిస్థాయిగల భక్తియనురసమును గలదు. అయినను వీనికి రతిభావమందంతర్భావమే. విషయభేదమాత్రమువల్ల భేదవ్యవహారము గలదు. రతి స్త్రీవిషయముగలదై విభావాదులచేత నుల్లసింపఁజేయఁబడినదై శృంగారరసత్వమును బొందుచున్నది అదియే గురువు కొమారుఁడు చెలికాఁడు విషయముగలదైతే భావమను పేరును బొందుచున్నది.

వ్యా. ఇదమేవాభిసంధాయ కావ్యప్రకాశకార ఆహ. రతిర్దేవాది విషయా వ్యభిచారీతథాంజితః భావః ప్రోక్త ఇతి.

తా. ఇట్టియభిప్రాయమునే యుద్దేశించి కావ్యప్రకాశకారుఁడు చెప్పినాఁడు. ఏమంటే. దేవుఁడు గురువు మొదలగువారి విషయముగల రతి [అనఁగా నాసక్తి] ధ్వనియని వ్యభిచారిభావమని చెప్పఁబడును అని.

వ్యా. వికాసవిస్తరక్షోభ విక్షేపాఖ్యాశ్చతుర్విధాః । జాయంతే చేతసోధర్మా భావేనతుసమాగమే । వికాసఃకుసుమస్యేవ పాదపస్యేవవిస్తరః । చేతసోభేరివక్షోభో విక్షేపోమరుతోయథా । వికాసమూల శ్శృంగారో వీరోవిస్తరమూలకః । విక్షేపాధికోరౌద్రో బీభత్సః క్షోభమూలకః । ఏతస్మాత్ హాస్యచిత్ర భయానకదయాః క్రమాత్ । శృంగారహాస్యయోర్వీరాద్భుతయో రౌద్రభీమయోః । బీభత్సదయయోర్మైత్రీస్యాదేకోపాధికత్వతః । రసౌశృంగారబీభత్సౌ తథా వీరభయానకౌ । రౌద్రాద్భుతౌతథాహాస్యకరుణౌవైరిణౌమిథః ॥

తా. భావముతోఁ గలియునప్పుడు చిత్తమునకు వికాసము=విచ్చుట, విస్తరము=పెరుగుట, క్షోభము=కలతబారుట, విక్షేపము=చెదరుట నని నాలుగుధర్మములు గలుగుచున్నవి. వికాసము పువ్వున

కుంబోలెనుండును. విస్తరము చెట్టుయొక్క విస్తారముబోలెనుండును. క్షోభము సముద్రక్షోభమువలెనుండును. విక్షేపము గాలియొక్క విక్షేపమువలెనుండును. [అందు] వికాసము కారణముగలది శృంగారము. విస్తరమువలనఁ గలిగినది వీరము విక్షేపము హేతువుగలది రౌద్రము. క్షోభము మూలముగలది బీభత్సము. వరుసగా హాస్యాద్భుతభయానక దయారసములివే మూలముగలవి. [అనఁగా హాస్యమునకు వికాసము, అద్భుతమునకు విస్తరము, భయానకమునకు విక్షేపము, దయకు క్షోభమును మూలము-] శృంగార హాస్యములకును, వీరాద్భుతములకును, రౌద్రభయానకములకును. బీభత్సదయలకును హేతువొక్కటియే కావున స్నేహముగలదు- శృంగారబీభత్సములును, వీరభయానకములును, రౌద్రాద్భుతములును, హాస్యకరుణారసములును బరస్పరము విరోధులు-

వ్యా. తత్ర శృంగారవీరరౌద్రాద్భుతానాం లోకోత్తరాశ్రయత్వేన పరిపోషాతిశయః- అత ఏవ శృంగారస్య మ్లేచ్ఛాదివిషయత్వేనాభాసత్వం- ఉక్తంహి శృంగారతిలకే- శ్లో॥ ఏకత్రైవానురాగశ్చ తిర్యఙ్మ్లేచ్ఛగతోపివా। యోషితో బహుసక్తిశ్చ రసాభాసస్త్రిధామతః॥ ఇతి విభావాదిజ్ఞానం నపరంప్రయోజకమితి తిర్యగాదిష్వపి రసోస్త్యేవేతి విద్యాధరః-

తా. అందు శృంగారవీరరౌద్రాద్భుత రసములకు లోకాతిశయనాయకు నాశ్రయించుటచేత విశేషపుష్టి కలుగును- కనుకనే శృంగారరసమునకు మ్లేచ్ఛాదులు విషయముగలుగుట రసాభాసమగుట- శృంగారతిలకమందుఁ జెప్పియున్నది- "స్త్రీపురుషులలో ఒకరియందుమాత్ర మనురాగము గలుగుటయు, తిర్యగ్జాతులను రసము బొందుటయు, స్త్రీకి ననేకులయం దాసక్తిగలుగుటయు నున్నట్టి ష్టే అద్ది రసాభాసము మూఁడు తెరఁగులు- అని రసమునకు విభావాదులను దెలియుట ముఖ్యప్రయోజనము గాదు కావునఁ దిర్యగ్జా

తులు మొదలగు వానియందును రసముగలదని విద్యాధరుఁడు జెప్పి నాఁడు-

వ్యా. తత్ర శృంగారరసస్యస్థాయిభావో రతిస్సంభోగవిషయేచ్ఛావిశేషః- సైవ విభావాదిభిస్స్వాదుతాంనీతాశృంగార ఇత్యుచ్యతే- శృంగం ప్రాధాన్యమియర్తీతి శృంగారః- తత్ప్రాధాన్యం ధ్వనికారేణోక్తం- శృంగార ఏవమధురఃపరప్రహ్లాదకోరసః। యన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతీతి- అత్రైవకారేణ ప్రాధాన్యమవిసంవాదమితి లోచనకారః-

తా॥ అందు శృంగారరసమునకు సంభోగవిషయాసక్తి విశేషము రతి- అదియే విభావాదులచేత రుచినిం బొందించఁబడినదై శృంగారమనఁబడును- [శృంగమనఁగాఁ బ్రాధాన్యము-] ప్రాధాన్యమును బొందునది గావున శృంగారమనఁబడును- శృంగారరసమునకుఁ బ్రాధాన్యమును ధ్వనికారుఁడు జెప్పినాఁడు- ఏశృంగారరసమయమగు కావ్యము నాశ్రయించి మాధుర్యముండునో అట్టి శృంగారమే మధురమైనదియు నానందింపఁజేయునదియు- అని ఇక్కడనే వకారముచేత దీనిప్రధానత్వము వివాదములేనిదని లోచనకారుఁడు-

వ్యా. సద్వివిధః- సంభోగోవిప్రలంభశ్చ। తత్రసంభోగోరతిరహస్యలక్షితః- శ్లో॥ అనుకూలౌనిషేవేతే యత్రాన్యోన్యంవిలాసినౌ। దర్శనస్పర్శనాద్యైశ్చ ససంభోగోముదాన్వితః॥ ససప్తావస్థః ప్రేమా అభిలాషః॥ రాగః, స్నేహః, ప్రేమ, రతిః, శృంగారః, ఇతభేదాత్.

తా. ఆశృంగారము సంభోగశృంగారమనియు, విప్రలంభశృంగారమనియు, రెండువిధములుగలది- అందుసంభోగమునకు లక్షణము రతిరహస్యమందుఁ జెప్పఁబడినవి- స్త్రీపురుషులు ఒకరియందొకరు సంతోషముతోఁగూడినవారై [ఒకరినొకరు] చూచుట ముట్టుకొనుట మొదలగువానిచేత ననుకూలించినవారై దేనియందు సేవింతురో సంతోషమునిచ్చునట్టి అది సంభోగమనఁబడును- అదిఁయేడు అవస్థలుగలది- అవి యేవియనిన ప్రేమము, అభిలాషము, రాగము,

స్నేహము, ప్రేమము, రతి, శృంగారము అని- (ఇందు మొదటి ప్రేమశబ్దము పుంలింగము- రెండవది నపుంసకము- శ్లో॥ ప్రేమాదౌ దృక్సారమేవ్యైషు తచ్చింతాత్వభిలాషకః । రాగస్తత్సంగబుద్ధిస్స్యా త్స్నేహస్తత్ప్రవణక్రియా । తద్వియోగాసహం ప్రేమ రతిస్తత్సహవర్తనం । శృంగారస్తత్సమక్రీడా సంభోగస్సప్తధాక్రమ ఇతి- సుందరులయందుఁ జూపు నిచ్చ ప్రేమము- వారిం జింతించుట యభిలాషము- వారిఁ గలియుటయందలి బుద్ధి రాగము- వారియందాసక్తిగలపని స్నేహము- వారిని విడిచియుండలేకపోవుట ప్రేమము- వారితోఁ గూడి తిరుగుట రతి- వారితోఁ గ్రీడించుట శృంగారము. అని సంభోగ మేడువిధములుగలది- )

వా సద్వివిధః- సంక్షిప్తోవిస్తృతశ్చేతి ఆద్యస్త్రివిధః- నవీనవిరహమానానంతరజత్వభేదాత్ -విస్తృతో౽పి త్రివిధః మధ్యమప్రవాసశాపానంతరజత్వభేదాత్ -

తా. ఆసంభోగము సంక్షిప్తము [అనఁగా దగ్గించబడినది] అని విస్తృ (అనఁగా విస్తరించబడినది) అనియు రెండువిధములు గలది- [అందు] మొదటిది- [సంక్షిప్తము] నవీనము [క్రొత్తది] విరహము [వియోగానంతరమయినది] మానానంతరజము [కోపానంతరమైనది] అని మూడువిధము గలది విస్తృతము కూడ మధ్యమము [మధ్యకాలమందైనది] ప్రవాసము [దేశాంతరవాసముచేతనైనది] శాపానంతరజము (శాపమునకుఁ దరువాతనైనది] అని మూడువిధములు గలది-

వ్యా- వాత్స్యాయనీయే అస్య ద్వివిధస్యాపి ప్రకారాంతరేణ ద్వైవిధ్యముక్తం- శ్లో॥ బాహ్యమాభ్యంతరం చేతి ద్వివిధం రతముచ్యతే । తత్రాద్యం చుంబనాశ్లేష నఖదంతక్షతాదికం । ద్వితీయం సురతం సాష్టాన్నాకరణ కల్పితమితి-

తా- వాత్స్యాయన తంత్రమందు రెండువిధములుగల యీశృంగారమునకు నతియొకరీతిచేత రెండు తెఱఁగులు జెప్పఁబడినవి- బాహ్యమని అభ్యంతరమని సంభోగము రెండువిధములుంగలది- అందుఁ జుంబనము, ఆలింగనము, నఖక్షత దంతక్షతములు మొదలగునవిబాహ్యము- అనేకబంధములచేఁ జేయఁబడిన ప్రత్యక్షసంభోగము అభ్యంతరము అని చెప్పఁబడును-

వ్యా॥ విప్రలంభోపి అయోగవిరహమాన ప్రవాస శాపహేతుతయాపంచవిధః । తత్రాయోగప్రవరతిర్దశావస్థా అనతిక్రమాదుపపయతే॥ శ్లో॥ దృఙ్మనస్సంగసంకల్పా జాగరః కృశతారతిః । హ్రీత్యాగోన్మాదమూర్ఛాంతా ఇత్యనంగదశాదశేతి । కేచిత్తుప్రలాపసంజ్వరాభ్యాంద్వాదశావస్థాఇతివదంతి॥

తా. విప్రలంభశృంగారమున్ను, అయోగము [స్త్రీపురుషులుకలియకుండుట] విరహము [కలిసినవారువిడిపోవుట] మానము[కోపము] [ప్రవాసము- [దేశాంతరమందుండుట] శాపము [శాపమునొందుట] అనునివి కారణములుగలుగుటచే నైదుతెఱఁగులుఁగలది అందయోగమే విడువక మన్మథావస్థలనుపదింటినిఁ బొందించుచున్నది- మన్మథావస్థలేవియనిన- దృగవస్థ (నాయికానాయకు లొండురులఁజూచుట) మనస్సంగము [ఒకరియందొకరికి మనస్సుదగులుట] సంకల్పము[సాధునివిషయమైనకోరిక] జాగరము (నిద్రలేకుండుట) కృశత్వము [చిక్కుట] అరతి [భోగ్యవస్తువులందిచ్ఛలేకుండుట] హ్రీత్యాగము (సిగ్గువిడచుట) ఉన్మాదము [మతిచలించుట] మూర్ఛ [ఒకతెలుంగకుండుట] అంతము (మరణము) అని మన్మథావస్థలుపది- కొందఱుప్రలాపము పేలుట సంజ్వరము తాపము అనువానితోఁగూడఁ బన్రెండవస్థలని చెప్పుచున్నారు-

వ్యా. సంగమస్యసదాదుర్లభత్వే ప్రాణత్యాగోద్యోగోమరణం- తస్యామంగళత్వాద్ర సవిఘాతత్వాత్సాక్షాదవర్ణనీయత్వం- ప్రకారాంతరేణవర్ణనంచం- శ్లో॥ సాశోకసూనసహకారకమల్లికాబ్జనీలో

త్పలప్రభృతి కామశరాగ్నిశయ్యాః ఆలింగితుం రఘుపతే య తత్తే త్వదుగ్రవిశ్లేషవహ్నిహత జీవనహానబుద్ధ్యా ఇత్యాదౌద్రష్టవ్యం.

తా. సంభోగమెల్లప్పుడును సంభవించకపోవుటచేతఁ బ్రాణములను విడచుటకుద్యోగించుట మరణము. ఆమరణము అమంగళమైనదౌటవలన రసమునకు హానిఁజేయునదియౌటవలను వర్ణించఁదగకుండుటయు మఱియొకరీతిచే వర్ణించుటయుఁ గలదు ఎట్లనిన. ఓరామమూర్తీ (ఆసీత) నీయొక్క యతిశయముగల వియోగాగ్నిచేఁ బీడింపఁబడిన ప్రాణములను విడచుటయందుద్దేశముచేత నశోకపుష్పముతోఁ గూడిన మామిడిపువ్వు, మల్లిపువ్వు, పద్మము, నల్లగలువ మొదలగు మన్మథబాణముల యగ్ని శయ్యలను కౌఁగిలించుటకుఁ బ్రయత్నించుచున్నది. అని యీమొదలగుదానియందుఁ జూడవలెను.

వ్యా. ద్వివిధస్యాప్యస్య శృంగారస్య వ్యభిచారిభావః శృంగారతిలకే పరిగణితః 'శంకాసూయాభయగ్లాని వ్యాధిచింతాస్మృతిధృత్యౌత్సుక్య విస్మయవేగనిద్రోన్మాద విషాదజడతావ్రీడావహిత్థాచాపలమృతయ ఇతి. శృంగారహాస్యయోః కార్యకారణభావః శృంగారతిలకే కథితః హాస్యోభవతి శృంగారాత్కరుణో రౌద్రకర్మణః. అద్భుతశ్చ తథావీరాద్బీభత్సాచ్చభయానక ఇతి.

తా రెండువిధములుగల యీశృంగారరసమునకు వ్యభిచారి భావము శృంగారతిలకమందు లెక్కించఁబడినది శంక, అసూయ, భయము, గ్లాని, వ్యాధి, చింత, స్మృతి, ధృతి, ఔత్సుక్యము, విస్మయము, వేగము, నిద్ర, ఉన్మాదము, విషాదము, జడత్వము, వ్రీడ, అవహిత్థ, చపలత, మృతి అని [వీనిలక్షణములు ఇదివఱకే చెప్పఁబడినవి.] శృంగారహాస్యరసములకు జన్యజనకత్వము శృంగారతిలకమందుఁ జెప్పఁబడినది. [ఎట్లంటే] శృంగారమువలన హాస్యము, రౌద్రమువలనఁ గరుణము, వీరమువలన నద్భుతము, బీభత్సమువలన భయానకమును బుట్టుచున్నది. అని. [ఇట్లు శృంగారరసము.]

వ్యా హాసో వికాసో మనసో వికృతాకారదర్శనాత్. కుబ్జవామన వికలాంగ విదూషకాదయస్త్రియః పురుషాశ్చాలంబన విభావాః. అసత్ప్రలాపశ్రవణమపి విభావ ఏవ. ఓష్ఠవివరణ దశనదర్శన నాసాకపోలవికృతస్పందన దృశాకుంచనాదయో విభావాః. వ్యభిచారిణస్తు. శ్రమశ్చపలతానిద్రా స్వప్నో గ్లానిస్తథైవచ । శంకానూయావహిత్థాశ్చ హాస్యే భావాభవంత్యమీ ఇతి అయం స్మిత హసితవిహసితోదసితాపహసితాతిహసితభేదాత్ షడ్విధః ద్వౌద్వౌ భేదావుత్తమ మధ్యమాధమేషు జ్ఞేయౌ. తేపునరంగవచన నైపథ్యజన్యతయాత్రివిధాభవంతి.

తా. వికారముగల యాకారమునుజూచుటవలనఁగలిగిన మనస్సుయొక్క వికాసము హాసము. [హాసమందు సాధువైనది హాస్యమనఁబడును.] మరుగుజ్జులు, పొట్టివారు, చెడిన అవయవములుగలవారు విదూషకులు మొదలగు స్త్రీపురుషులాలంబనములు. అయోగ్యమగు ప్రేలుటను వినుటయును విభావమే. పెదవి విరచుట, దంతములు జూపుట, ముక్కుచెక్కులు వికారముగాఁగదలుచుట, చూపు ముడుచుట మొదలగునవి విభావములు. వ్యభిచారిభావములైతే శ్రమము, చపలత, నిద్ర, స్వప్నము, గ్లాని, శంక, అసూయ, అవహిత్థ. ఇవి హాస్యమందు వ్యభిచారిభావములు. ఈహాసము స్మితము, హసితము, విహసితము, ఉదసితము, అపహసితము, అతిహసితము అని యాఱువిధములుగలది (స్మితమిహవికసన్నయనంకించిల్లక్ష్యద్విజంహసితం. మధురస్వనంవిహసితంసాంగశిరఃకంపముదసితం. అపహసితం సాస్రాక్షంవిక్షిప్తాంగంభవత్యతీహసితం. వికసించిన కన్నులుగలది స్మితము. కొంచెము గాన్పించు దంతములుగలది హసితము. మంచిధ్వనిగలది విహసితము. అవయవముల కదలుటతోఁగూడినది యుదసితము. కన్నీరుతోఁగూడిన నేత్రములుగలది యపహసితము. చిమ్ముచున్న యవయవములుగలది యతిహసితము ] ఇవి రెండురెండు

భేదము లుత్తమమధ్యమాధములయందుఁ గలుగునని తెలియఁదగినవి. [అనఁగా నుత్తమునియందు స్మితహసితములును, మధ్యమునియందు విహసితోపహసితములును, అధమునియందు అపహసితాతిహసితములును గలుగును. అవి మరల శరీరమువలన, వాక్కువలన, వేషమువలనఁ బుట్టినవియని మూఁడువిధములుగలవి ఇట్లుహాస్యము.]

వ్యా॥ ఇష్టజననాశనస్థాన భ్రంశాది విభావః వక్షశ్శిరోవదనతాడనమహీలుంఠన హాహాకార దైవోపాలంభాద్యనుభావః సకలసాత్త్విక వాక్ నిర్వేద దైన్యోన్మాద వ్యాధిసుప్తిమోహభ్రమగ్లాని చింతామరణ చాపల విషాదజాడ్యౌత్సుక్య శంకా స్మృత్యపస్మృతి వ్యభిచారికః శోకః కరుణః.

తా. ఇష్టులైనమనుష్యులు నశించుట, తన యునికిచోటువిడచుట మొదలగు విభావములు గలిగినట్టియు, ఱొమ్ము, తల, మొగముమోదుకొనుట, నేలపైఁబొరలుట, హాహాకారము, దైవమునునిందించుట మొదలగు ననుభావములు గలిగినట్టియు, సాత్త్వికభావములు అన్నియు గలిగినట్టియు, నిర్వేదము, దైన్యము, ఉన్మాదము, వ్యాధి, సుప్తి, మోహము, భ్రమము, గ్లాని, చింత, మరణము, చపలత, విషాదము, జాడ్యము, ఔత్సుక్యము, శంక, స్మృతి, అపస్మారమునను వ్యభిచారిభావములుగల శోకము కరుణరసము. [ఇట్లు కరుణము.]

వ్యా. అసుహృద్దర్శనాద్యాలంబనః దర్శనావక్షేపావధూననవంచనవాక్పారుష్యాదివిభావః మాత్సర్యోద్దీపనః స్వేదనిర్భర్త్సనభ్రుకుటికపోలస్ఫురణముఖరాగభుజోద్యమన బాహుఘట్టనాద్యనుభావః స్తంభలయాతిరిక్తసర్వసాత్త్వికః క్రోధస్థాయికో రౌద్రః వ్యభిచారిణస్తు. శ్లో॥ హర్షానూయౌ తథాగర్వ ఉత్సాహోమదఏవచ । చాపల్యము గ్రతాచైవ రౌద్రేభావాభవంత్యమీ.

తా. శత్రువులఁజూచుట మొదలగు నాలంబనవిభావముగలిగినట్టియు, చూచుట, ఆక్షేపించుట, తిరస్కరించుట, వంచించుట, వా

కార్కశ్యము మొదలగు విభావములుగలిగినట్టియు, మాత్సర్యముద్దీపన విభావము గలిగినట్టియు, చెమట, భయపెట్టుట, బొమముడిచె కుఱ్ఱలదరుట, మొగమెఱ్ఱబారుట, చేతులెత్తుట, దండచఱచుటమొదలగు ననుభావములు గలిగినట్టియు, స్తంభప్రళయములుదక్క-తక్కిన సాత్త్వికభావములన్నియుఁ గలిగినట్టియుఁ గ్రోధము, స్థాయిభావము గలది రౌద్రరసము. వ్యభిచారిభావములైతే హర్షము, అసూయ, గర్వము, ఉత్సాహము, మదము, చాపలము, ఉగ్రత, అనునివి రౌద్రరసమంగు వ్యభిచారిభావములు [ఇట్లు రౌద్రము]

వ్యా. ఏతాదృశకావ్యనిర్మాణే శక్త్యాదీనాం త్రయాణాం మిళిత్వా హేతుత్వముక్తమాలంకారికైః ఉక్తంహి కావ్యప్రకాశే శ్లో. శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్ కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుద్భవఇతి. హేతురిత్యేకవచనం మిళిత్వాహేతుత్వకథనార్థమితి వ్యాఖ్యాతారః.

తా. ఇట్టికావ్యముఁ జేయుటయందు శక్తిమొదలగునవి మూఁడును కలవిహేతువని యాలంకారికులు చెప్పిరి. కావ్యప్రకాశమందు శక్తియు, లోకము, శాస్త్రము, కావ్యము మొదలగు వానినిఁ జూచుటవలనఁ గలిగిననేర్పును, కావ్యము నెఱిఁగినవారినిఁ జూచుటచేనయిన యభ్యాసమును, అనునీమూఁడును ఆ కావ్యనిర్మాణశక్తి కలుగుటకు హేతువు. హేతువు అని యేకవచనమును జెప్పి మూఁడునుగలసి హేతువగుటకొఱకుఅని వ్యాఖ్యాతలువ్రాసిరి.

వ్యా. కావ్యంచసంపూర్ణలక్షణమపిలోకోత్తరగుణవర్ణనపరమేవశ్రేయస్సాధనత్వేనాభిమతం। ఆదికావ్యస్య శ్రీరామాయణస్య తథావిధత్వాత్। కింబహునా। శాస్త్రమాత్రస్యాపితథావిధత్వమేవ। తథాహి అంకురాదికం సకర్తృకం కార్యత్వాద్ఘటవదితి ప్రమాణైర్న్యాయవైశేషికయోరీశ్వరప్రతిష్ఠాపకత్వం ఆత్మనిష్ఠధర్మప్రతిపాదకత్వాద్వేదస్యాపి తథావిధత్వమేవ అతఏవోక్తం జైమినినా అథాతోధర్మజిజ్ఞాసేతి.

తా. ఆకావ్యమున్ను సంపూర్ణలక్షణములు కలదైనను లోకాతీతుఁడయిన నాయకునియొక్క గుణవర్ణనము ప్రాధాన్యముకలదియే శ్రేయస్సులకు సాధనమని యంగీకరింపఁబడినది. ఆదికావ్యమగు శ్రీమద్రామాయణము ఆప్రకారమయిన దగుటవలననే. విస్తరించనేల. ప్రతిశాస్త్రమును నట్లుగనేయుండును. ఏలాగనిన, మొలకలుమొదలయినవి ఘటమువలెఁ గార్యములవుటవలనఁ గర్తతోఁగూడినవి. [అనఁగా కుండపుట్టినదిగనుక దానినిఁజేసినవాఁడొకఁడు కలఁడని యెట్టులూహించితిమో అట్లుగానే మొలకమొదలయినదియుఁ బుట్టినదిగనుకదీనినిఁజేసిన వాఁడొకఁడున్నాఁడని యూహించవచ్చును. వాఁడేభగవంతుఁడు] అను ప్రమాణములచేత న్యాయవైశేషిక శాస్త్రములకు నీశ్వరుని స్థాపించుట. ఆత్మయందలి ధర్మములను నిరూపించునదియౌటవలన వేదముఁగూడ నట్టిదియే. కనుకనే జైమిని చెప్పినాఁడు. తరువాత నీశాస్త్రమువలన ధర్మములను దెలుసుకొననిచ్ఛ అని.

వ్యా. ధర్మో నామ శ్రేయస్సాధనభూతః యాగపూర్వమాత్మనిష్ఠః. శ్లో॥ శ్రేయస్సాధనతా యత్ర క్రత్వాదౌ విధితో భవేత్ । తస్యైవ ధర్మతా జ్ఞేయా ధర్మస్తత్సాధనం యతః॥ అపూర్వం చ యాగాదేరవాంతర వ్యాపారః. శక్తిర్వేతి భాట్టాః. తన్మతాశ్రయణేతు ధర్మస్యాపూర్వద్వారా, పురుషాశ్రితత్వం గుణత్వం చాపచారికం। ప్రాభాకరాస్తు యాగాదవ్యతిరిక్తం జీవివాక్యమపూర్వమేవ ధర్మ ఇతి భేణుః। తేషాం మతే పునస్తస్య గుణత్వమాత్మనిష్ఠత్వం చ సంప్రతిపన్నమేవేతి యుక్తమాత్మనిష్ఠ ధర్మప్రతిపాదకత్వం వేదస్య.

తా. ధర్మమనఁగా శ్రేయస్సులకు సాధనమై యజ్ఞపూర్వముగా నాత్మయందుండునది. ఇందు ప్రమాణము. యజ్ఞాదికమందుఁజేయుట వలన శ్రేయస్సులకు సాధనత్వము దేనియందుఁగలదో దానికే ధర్మమనుసంజ్ఞ తెలియఁదగినది. ధర్మము దానికి సాధనముగదా. భాట్టమతిసులు ధర్మమనఁగా యజ్ఞాదికముయొక్క యవాంతరవ్యాపార

రూపమైన యపూర్వమందురు. వారిమతము నాశ్రయించిన పక్షమందు ధర్మమునకు అపూర్వద్వారా పురుషునాశ్రయించుటయు, గుణమగుటయు, లక్షణవలనఁ గలిగినవి ప్రాభాకరులైతే యజ్ఞాదికములకన్న వ్యతిరిక్తమైన మనుష్యునియొక్క వాక్యమైన అపూర్వమే ధర్మమనిచెప్పిరి. వాదిమతమందైతే ఆధర్మమునకు గుణమగుటయు, నాత్మయందుండుటయు నంగీకరించఁబడినదే. కావున వేదమునకు నాత్మయందలి ధర్మమును నిరూపించుట యుక్తమే.

వ్యా "చత్వారిశృంగాత్రయో అస్యపాదా" ఇతి మంత్రస్య "సప్తహస్తశ్చతుశ్శృంగస్సప్తజిహ్వోద్విశీర్షక" ఇత్యాద్యుపబృంహణబలేన కైశ్చిదగ్నిపరత్వముక్తం.

తా. "చత్వారిశృంగా" ఇత్యాదిమంత్రమునకు "సప్తహస్తశ్చతుశ్శృంగ" ఇత్యాది వృద్ధిబలముచేతఁ గొందఱిచే నగ్నిపరముగాఁ జెప్పఁబడినది. (వెనుకటి మంత్రమునకును శ్లోకమునకును నర్థము ముందు స్పష్టమగును.)

వ్యా. తథాప్యనేన ప్రణవప్రతిపాద్యత్వం బ్రహ్మణో విధీయతే. అస్య వృషభరూపస్య ప్రణవస్యాఽకారోకార మకార నాదాత్మకాని చత్వారిశృంగాణి. విశ్వతైజసప్రాజ్ఞరూపైర్విరాడ్ఢిరణ్యగర్భవ్యాకృతాఖ్యాస్త్రయః పాదాః. చిదచిద్రూపేత్యేశక్తిమస్తకస్థానీయే భూరాదిలోకాస్సప్తహస్తస్థానీయాః త్రిధాబద్ధః, అకారోకార మకారేషు విశ్వతైజసప్రాజ్ఞరూపైర్విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతరూపైర్వా త్రిభిః ప్రకారైర్బద్ధస్సంశబ్దితః వృషభః, ప్రణవః, ప్రణవస్యఋషభత్వం. "యశ్ఛందసామృషభోవిశ్వరూప" ఇతి ప్రసిద్ధం. "మహాన్తేజోరూపకంబ్రహ్మరోరవీతి" అతశ్శబ్దయేత ప్రతిపాదయతీతి శంకరభగవత్పాదైర్వ్యాఖ్యాతత్వాత్.

తా. అట్లయిననుదీనిచే బ్రహ్మకునోంకారముచే నిరూపించఁబడుట విధించఁబడుచున్నది. ఈవృషభరూపమగు ప్రణవమునకు అకారో

కార మకారనాద స్వరూపములగు నాలుగుకొమ్ములు. విశ్వ, తైజస, ప్రాజ్ఞరూపములచేవిరాట్టు, హిరణ్యగర్భుఁడు, అవ్యాకృతుఁడునను రూపములచేఁగానిమూఁడుపాదములు, చిత్తు, అచిత్తు, అనురూపములుగల రెండుశక్తులు రెండుశిరస్సులు, భూర్లోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములను నేడుహస్తములుగలవు. అకారోకారమకారములయందువిశ్వుఁడు, తైజసుఁడు ప్రాజ్ఞుఁడునను రూపములచేత, విరాట్టు, హిరణ్యగర్భుఁడు, అవ్యాకృతుఁడు, ననురూపములచేతఁగాని మూఁడురీతులచేతఁ జెప్పఁబడిన వృషభరూపమయిన ప్రణవము [ప్రణవమునకు వృషభరూపత్వముయశ్ఛందసామిత్యాది శ్రుతియందుఁ బ్రసిద్ధము] మహః- తేజోరూపమగు బ్రహ్మను రోరవీతి- అతిశయముచె నిరూపించుచున్నది- అని శంకరాచార్యులవారిచే వ్యాఖ్యానము చేయఁబడిన దగుటవలన-

వ్యా. తథాచ పాతంజలం సూత్రం- తస్యవాచకః ప్రణవఇతి

తా. ఆలాగు పతంజలి సంబంధమగు సూత్రమునుగలదు- ఎట్లంటేని, ఆబ్రహ్మకుఁజెప్పునది ప్రణవమని.

వ్యా తత్రాకారాది ప్రణవమాత్రాణాం వేదరూపత్వం ప్రపంచసారే ప్రతిపాదితం. "అగ్నిమీడె పురోహిత" మిత్యాద్యవేదాద్యవర్ణస్య "యోనిస్సముద్రో బంధు" రితి మధ్యమవేద మధ్యమవర్ణస్యాసమానంతర మిత్యంతిమవేదాంతిమ వర్ణస్యచ సమాహృతిరోమితి పదమితి. తథాచ వేదస్య బ్రహ్మప్రతిపాదకత్వంసిద్ధం.

తా. అందకారము మొదలగు ప్రణవముయొక్క యక్షరములకు వేదరూపముగలుగుట ప్రపంచసారమను గ్రంథమందు నిరూపించఁబడినది ఎట్లనిన, "అగ్నిమీడే" అను ప్రథమవేద (మనఁగా ఋగ్వేదముయొక్క) మొదటి వర్ణము యొక్క (అనఁగా అకారముయొక్క) యు, "యోనిస్సముద్రో" అను మధ్యము యొక్క [అనఁగా

యజుర్వేదముయొక్క] మధ్యమువర్ణముయొక్క (అనఁగా నకారముయొక్కయు) "అసమానంతరం" అనుచివర వేదముయొక్క [అనగాసామవేదముయొక్క] చివర వర్ణముయొక్క (అనఁగా మకారముయొక్కయు) ప్రోగు "ఓం" అనుపదము అని. కావున వేదమునకు బ్రహ్మను నిరూపించుటసిదము.

వ్యా ప్రణవస్యాన్యత్రసోఽహమర్థప్రతిపాదనముక్తం. శ్లో॥ సకారంచ హకారంచ లోపయిత్వా ప్రయోజయేత్। సంధిర్వై పూర్వరూపాఖ్య స్తతోసౌప్రణవో మత ఇత్యుక్తేః.

తా ఈప్రణవమునకు మఱియొకచోట "సోహం" అను [అనఁగా నాపరబ్రహ్మనేను] నరమునునిరూపించుట చెప్పఁబడినది. ఎట్లంటే- [సోహంశబ్దములో] సకారమును, హకారమును లోపముచేసిప్రయోగించవలెను- (ఇంట్లుండు, ఓ, అం అయినది) తరువాతను పూర్వరూపసంధి- [అనఁగా సూ॥ ఏజఃపదాంతాదతి- పదాంతములగు ఏకార ఓకారములకు హ్రస్వాకారము పరముకాగాఁ బూర్వరూపమువచ్చును] చేయఁగానీప్రణవము వచ్చినదనిమతము- అని చెప్పట వలన.

వ్యా. పంచపాద్యాంతు అవతేష్టిలోపశ్చేతి మన్ప్రత్యయస్య టిలోపేకృతే జ్వరత్వరే త్యూఠికృతే గుణేచ ఓమిత్యయం నిష్పన్న ఇత్యుక్తం

తా పంచపాదియందు [అనఁగా ఉణాదులయందు] అవధాతువుకంటెఁ బరమగు మన్ప్రత్యయమునకు టిలోపముచేయఁగా జ్వరత్వరేత్యాది సూత్రముచేత అవధాతువునకు ఊఠ్ ఆదేశముచేయఁగా ఊతుకు [సార్వధాతుకార్ధధాతుకయోః- సార్వధాతుకప్రత్యయముగాని యార్ధధాతుక ప్రత్యయముగాని పర ముగుచుండఁగా నజంతాంగమునకు గుణముగును) గుణముచేయఁగా ఓం అనునిది నిష్పన్నమయినదని పలుకబడినది.

వ్యా. నిరుక్తేత్వయంయజ్ఞ పరతయావ్యాఖ్యాతః చత్వారో వేదాశ్శృంగాణి సవనత్రయంపాదాః. ప్రాయణీయోదయనీయాశ్శీర్షే సప్తచ్ఛందాంసిహస్తాః. మంత్రబ్రాహ్మణకల్పైస్త్రిప్రకారేణబద్ధః. వర్షణాద్వృషభః రోరవీతిస్వసాధనీ భూతవేదఘోషేణ మహాదేవ ఇతి.

తా నిరుక్తమందైతే యీమంత్రము యజ్ఞపరముగా వ్యాఖ్యానము చేయఁబడినది ఎట్లంటే, వేదములునాలుగును కొమ్ములు. ప్రాతర్మాధ్యాహ్నికసాయంసవనములుమూఁడును పాదములు ప్రాయణీయ ఉదయనీయలు [అనఁగా ఆరంభేష్టి. సమాప్తేష్టి] రెండునుశిరస్సులు- ఏడుఛందస్సులుహస్తములు. మంత్రము, బ్రాహ్మణము, [అనఁగా, సంహిత, పరాయతము] కల్పము అనువీనిచే మూఁడుప్రకారములుగాఁ గట్టఁబడినది వర్షించుటవలన వృషభము శ్లో॥ అగ్నౌప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతేవృష్టి ర్వృష్టేరన్నంతతః ప్రజాః॥ అగ్నియందుఁ బొందించఁబడిన హోమము సూర్యునిఁబొందును. సూర్యునివలన వర్షము, దానివలననన్నము, దానివలనఁ బ్రజలు, పుట్టుచున్నారు. అనియున్నదిగనుక హోమరూపమగు యజ్ఞము వర్షమును గురియును] ఈయజ్ఞము మహాస్సనఁగా వేదమును దనకు సాధనమగు ఘోషముచేత నద్ఘోషించుచున్నది అని.

వ్యా ఏతత్పక్షేపియజ్ఞ ప్రతిపాదకస్యాపి వేదస్యబ్రహ్మపరత్వంవిహాన్యతే శ్లో వృషస్త్రిపాచ్చతుశ్శృంగ స్సప్తహస్తోద్విమస్తకః। సదారామస్త్రిధాబద్ధో మహాదేవస్త్వమేవహి. ఇత్యాద్యుపబృంహణేన యజ్ఞస్యపరమేశ్వరాభిన్నత్వ ప్రతిపాదనాత్.

తా. ఈపక్షమందు యజ్ఞమును నిరూపించునదియైనను వేదమునకు బ్రహ్మపరత్వము కొట్టఁబడదు ఏమంటె, వృషస్త్రిపాదశత్యాది విస్తరించుటచే యజ్ఞమునకుఁ బరమేశ్వరునకు నభేదముయొక్క నిరూపించుటవలన-

వ్యా. బ్రహ్మప్రతిపాదకత్వేన వేదాంతా అపి తాదృశాః. అతఏవ బ్రహ్మసూత్రం- అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి- నను, చిదేక రసతయా నిర్ధర్మకస్యాత్మనః ప్రతిపాదకేషు వేదాంతేషు కథం గుణవత్పురుషవర్ణనమితిచేన్నాయందోషః బ్రహ్మణిసత్యంజ్ఞానమనంతం బ్రహ్మేతి సత్యాదీనామౌపాధికానాం విద్యమానత్వాత్ తదుక్తం. పంచపాదికాయాం. ఆనందో విషయానుభవో నిత్యత్వంచేతి సంతి ధర్మా ఇతి. అథవా, సచ్చిదానంద లక్షణ బ్రహ్మణో నిర్దోషత్వమేవ గుణః. అపదోషతైవ విగుణస్య గుణ ఇత్యాది వచనాత్- కించ, సర్వోపనిషదాం ప్రాధాన్యేన లక్ష్యం- సత్యజ్ఞానానంద లక్షణంపరబ్రహ్మ- ఏషసర్వజ్ఞస్సైషాశ్చ శక్తిర్వివిధైవ శ్రూయతి ఇత్యాద్యవాంతర వాక్యైస్సర్వజ్ఞత్వంసర్వశక్తిః- నిరవద్యత్వంచ సగుణబ్రహ్మ ప్రతిపాద్యమితి వేదాంతప్రవాద ఇతి నసర్వథోక్తార్థస్య క్షతిః.

తా. వేదాంతములును బ్రహ్మనునిరూపించుటచేత నట్టివే- కనుకనే బ్రహ్మ సూత్రము- తరువాతదీనివలన బ్రహ్మనుదెలిసికొను నిచ్ఛ అనియున్నది- అయిన జ్ఞానమే ప్రధానరసముగలుగుటచేధర్మశూన్యమగు పరమాత్మను జెప్పునట్టి వేదాంతములయందు గుణములు గల పురుషునియొక్క వర్ణనమెట్లుకలుగును- అనినచో నిదిదోషముకాదు- బ్రహ్మసత్యరూపము, జ్ఞానరూపము, అంతములేనిది- అని- సత్యత్వాదులు బ్రహ్మయం దుపాధివశమువలననున్నవి- అ౽పంచపాదికయందుఁ జెప్పఁబడినది- ఎట్లనిన, ఆనందము, విషయమననుభవించుట, నిత్యత్వము ననుధర్మములు బ్రహ్మకుంగలవని- లేదా, సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మకు దోషములేకపోవుటయే గుణము. ఎట్లనిన, దోషములేకపోవుటయే గుణములేనివానికి గుణమని యీమొదలగు వచనమువలన- మఱియునన్ని యుపనిషత్తులకుఁ బ్రధానత్వముచే సత్యజ్ఞానానందాద్వయ స్వరూపమగు బ్రహ్మలక్ష్యము- ఈతఁడు సర్వజ్ఞుఁడు- ఇతనియొక్క శక్తి అనేకరీతులు కలదియై వినఁబడుచున్నది- అనునీమొదలగు వాక్యములచేతసర్వజ్ఞత్వము, సర్వశక్తి, రెం

డవనిలేకపోవుట యనునది సగుణబ్రహ్మకు నిరూపించఁదగినది- అని వేదాంతములవాడుక- కావునననేకవిధములుగాఁ జెప్పఁబడిన యర్థమునకు భంగము లేదు-

వ్యా. వ్యాకరణస్యాపి బ్రహ్మపరత్వమేవ, తథా హి, పస్పశాహ్నికే భగవత్పతంజలినా చత్వారిశృంగేతి మంత్రస్యార్థో వివృతః, నామాఖ్యాతోపసర్గ నిపాతరూపాణి చత్వారిశృంగాణి, భూతభవిష్యద్వర్తమానాఖ్యాః కాలాస్త్రయః పాదాః, నిత్యకార్యం శబ్దరూపంచ శిరోద్వయం, సప్తవిభక్తయోః హస్తస్థానీయాః, త్రిధాబద్ధస్త్రిషుస్థానేషూరసికంఠే శిరసిచబద్ధః, వృషభః కామవర్షణాత్ మహోమహాందేవఇతి శబ్దస్యేశ్వరాభిన్నతే వృషస్త్రిపాదశ్చతుశ్శృంగ ఇత్యాద్యుక్తమేవోపబృంహణం,

తా. వ్యాకరణమునకుఁ గూడ బ్రహ్మపరత్వమే. పస్పశాహ్నికమందు (వ్యాకరణభాష్యభాగము) భగవంతుఁడగు పతంజలి "చత్వారిశృంగే" త్యాదిమంత్రమునకు నర్థమును వివరించెను, ఎట్లనిన, నామము, క్రియ, ఉపసర్గము. నిపాతము [అవ్యయము] అను నాలుగుకొమ్ములు- కడచిన కాలము, రాబోవుకాలము, జరుగుచున్న కాలమునను మూఁడుపాదములు. నిత్యకార్యము, శబ్దరూపములను రెండుశిరస్సులు, ప్రథమాది విభక్తులేడును హస్తస్థానమందైనవి- "త్రిధాబద్ధః" వక్షస్థలమునందు, కంఠమునందు, శిరస్సునందు, ఈమూఁడుస్థానములయందుఁగట్టఁబడినవి కామములను వర్షించుటవలన వృషభము. "మహః" మహాదేవుఁడైనది, శబ్దమునకు నీశ్వరరూపముగలుగుచుండఁగా వృషభము- మూఁడుపాదములుగలది, నాలుగుకొమ్ములుగలది అనునీమొదలగు వృద్ధి చెప్పఁబడినది-

వ్యా. కింబహునారతి రహస్యాదీనామప్యంతతో బ్రహ్మపరత్వమేవ హేయబుద్ధివిషయతయా వైరాగ్య హేతుత్వాదితి బ్రహ్మవాదినో వదంతీత్యలమతిబాలసులభైర్వచనైః ప్రకృతమనుసరామః.

చనచేత సంస్కృత కావ్యమందుఁగాని స్వదేశభాషా కావ్యమందుఁ గాని ఆయా రసముయొక్క సాధించుటయే కవీశ్వరులయొక్క స్వభావమై లోకమందుఁ బ్రసిద్ధమైనదని యర్థము-

వ్యా- అత ఏవోక్తం కావ్యప్రకాశికాయామాదావేవ గ్రంథస్య-
శ్లో॥ నియతికృతనియమరహితాం హ్లాదైకమయీమనన్యపరతంత్రాం।
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతీతి॥

తా. కనుకనే కావ్యప్రకాశికయందు గ్రంథముయొక్క మొదటి యందే "నిశ్చయముగఁ జేయఁబడిన నియమములతో శూన్యమైనట్టియుఁ గేవలానందమయమయినట్టియు నితరాధీనము గానట్టియు నూతనములైన రసములచేత మనోహరమైనట్టియు నిర్మాణమును బొందిన దగుమఁ గవియొక్క వాక్యము సర్వోత్కృష్టమయి యున్నది-" అనిచెప్పంబడినది-

వ్యా- కవిభిస్సాధ్య ఇత్యనేన యథోక్తలక్షణ విశిష్ట కవినిర్మితమేవ కావ్యం గ్రాహ్యమిత్యయ మర్థోవగమ్యతే- అత ఏవోక్తం,
శ్లో॥ గవిక్షీరమివ గ్రాహ్యం కావ్యం విప్రేణనిర్మితం। నశూద్రస్య వచో గ్రాహ్యం శునోచ్ఛిష్టం హవిర్యథేతి.

తా- కవులచే సాధించఁదగినది యని చెప్పుటచేఁ జెప్పఁబడిన లక్షణములతోఁ గూడిన కవులచే నిర్మింపఁబడిన కావ్యమే గ్రహించఁదగినది యని యీయర్థము తోఁచుచున్నది- కనుకనే "గోవునందుఁ బాలవలె బ్రాహ్మణునిచేతఁ జేయఁబడిన కావ్యము గ్రహించఁదగినది- కుక్కయెంగిలిచేసిన హోమద్రవ్యము వలెనే శూద్రునియొక్క కావ్యము గ్రహించఁదగినది కాదు.' అనిచెప్పఁబడినది-

వ్యా నను, దేశభాషా కావ్యస్య కీర్త్యాది కరత్వేపి కథం పాపహరత్వం సిధ్యేత్- "శ్లో॥ దేశభాషాపురాణాని రచితానిచ మానవైః। శ్రుత్వాకావ్యేతిహాసాంశ్చ భయమాప్నోతి మానవ" ఇత్యాదినిషేధాత్- తథాద విశ్వశ్రేయః కావ్యమిత్యుక్తం కథం సంగచ్ఛేత ఇ

తిచేన్నైవం- "శ్లో॥ యత్రకుత్రాపిభాషాయాం శ్రూయతే చరితం శుభం। సాభాషాపాపసంహర్త్రీ భవేదత్ర నసంశయ" ఇత్యభియుక్తోక్తేర్దేశభాషాకావ్యస్యాపి పాపహరత్వం సిద్ధ్యత్యేవ- అతఏవ గుణవత్పురుష వర్ణనాపరమేవ సార్థకమిత్యుక్తం ఏత దభిప్రాయేణైవ శబ్దశాసనో భారతం పంచమో వేద ఇత్యత్యంత ప్రథితస్య శ్రీమహాభారతస్యాంధ్రీకరణే ప్రావర్తతా-

తా. అవునయ్యా! దేశభాషచేతఁ జేయఁబడి కావ్యముకీర్త్యాదులను జేయుఁదదియైనను "దేశభాషాపురాణములు కావ్యములు ఇతిహాసములు మనుష్యులచేతఁ జేయఁబడినవి, వినిమనుష్యుఁడుభయముపొందును" అనునీమొదలగు నిషేధమువలనఁ బాపమును హరించుటయెట్లుగాసిదించును? [అఁటఁగాసిదించదనుట] అలాగుండఁగా విశ్వశ్రేయఃకావ్యంఅని యెట్లుగా ననుకూలించుచున్నది, అన్నట్టయితే యీప్రకారముకాదు. ఏభాషయందైనను శుభచరిత్రమువినఁబడునో ఆభాషపాపమును బోగొట్టునదియగును. సందియములేదుఅని పెద్దలయొక్క వాక్యమువలన దేశభాషాకావ్యమునకుఁ గూడఁ బాపమునుహరించుట సిదించుచునేయున్నది. కావున నేగుణములుగల పురుషునివర్ణించుట ప్రధానముగలదియే సార్థకమైనది. అనిచెప్పఁబడినది. ఇట్టియభిప్రాయమును బెట్టుకొనియే నన్నయభట్టు భారతము అయిదవ వేదమని మిక్కిలిప్రసిద్ధమైన మహాభారతముయొక్క తెనిఁగించుటయందుఁబ్రవర్తించెను.

వ్యా. దేశభాషేతి నిషేధస్యావేద్యరసాన్య దేశభాషాకావ్యపరిత్యాగ ఏవతాత్పర్యం, కావ్యస్యసద్యః పరనిర్వృతేరేవముఖ్య ప్రయోజనత్వేనోక్తత్వాత్ అతఏవోచ్యతే అన్యదపహాయేతి. ప్రాకృతస్యాన్య దేశజత్వేనాపి నాటకాది ప్రపంచస్యాంధ్రభాషాయాశ్చ తన్మూలకత్వేన స్వదేశభాషాయా మివ తత్రాప్యభినివేశః పండితానామితినకశ్చిద్దోషః.

తా, నిషేధమునకుఁ దెలియఁదగని రసముగల యన్యదేశ భాషా కావ్యములయొక్క విడుచుటయందే తాత్పర్యము. [ఎందువలననంటే] కావ్యమునకుఁదత్కాలమందు గొప్పదియగు సుఖమును జేయుటయే ముఖ్యప్రయోజనముకలుగుటచెప్పఁబడుటవలన కావుననే [అన్యదపహాయ] ఇతరమును విడచి అనిచెప్పఁబడుచున్నది. ప్రాకృతభాష యితరదేశమందుఁబుట్టినదైనను, నాటకాదిప్రపంచమును నాంధ్రభాషయు దానిమూలముగనైనదగుటచేత స్వదేశభాషయందువలెనే దానియందునుబండితులకుఆదరముకావున నెంతమాత్రము దోషములేదు.

వ్యా. నను, తస్మాద్బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవ్యం నాపభాషేత, మ్లేచ్ఛో యదపశబ్ద ఇత్యాదివచనేన ఆహితాగ్నిశబ్దం ప్రయుజ్య సారస్వతీమిష్టిమిత్యాదౌ ప్రాయశ్చిత్తశ్రవణేన చ వైదికానాం గావిగోణ్యాదిశబ్దానామపశబ్దత్వేనోచ్చారణానర్హత్వం నిశ్చితం జైమినీయే. తత్కథం పండితకవీంద్రాః, స్వదేశభాషాకావ్యనిర్మితావుత్సహేరన్ కథంతరాం సహృదయాంతర్వాణి పవిపాణయస్తత్ర రసాస్వాదనార్థం ప్రవర్తేరన్,

తా. అవునయ్యా! “బ్రాహ్మణుఁడపశబ్దోచ్చారణము చేయఁగూడదు.” అనునిత్యాదివచనముచేత నాహితాగ్నిశబ్దమును బ్రయోగించి “సారస్వతీమిష్టిం” ఇత్యాదికమందుఁ బ్రాయశ్చిత్తముయొక్క వినుటచేత, అనఁగా నాహితాగ్ని యపశబ్దమునుచ్చరింపఁగూడదనియు, ఆలాగుననుచ్చరించినయెడలఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలెననియు వినబడుటచేత వైదికులకు గావిగోణ్యాదిశబ్దములు అపశబ్దములగుటచేత నుచ్చారణకుఁ దగవని జైమినీయగ్రంథమందు నిశ్చయింపఁబడినది. కావునఁ బండితులయిన కవీంద్రులు స్వదేశభాషాకావ్యముయొక్క నిర్మించుటయందెట్లుగాఁ బ్రవర్తింతురు? మఱియు సహృదయులయిన పండితేంద్రులాకావ్యములయందు రసమునాస్వాదించుటకై బొత్తుగానే యెట్లుప్రవర్తింతురు ?

వ్యా. కించసంస్కృతకావ్యనిర్మాణేనైవ రససాధనం కవీంద్రాణాం భవతీతినస్వదేశభాషాకావ్యనిర్మిత్యపేక్షా సరసహృదయానాం పండితానాంచ తత్రైవ రసానుభవస్సిధ్యతీతి నతదాలోచనాలాలసత్వం సంభవత్యేవేతి స్త్రీశూద్రాధికారికం వికృతిభాషాకావ్యనిర్మిత్యా తదనుశాసన పరమిదం వ్యాకరణమిదం ప్రయోజనమేవేతిచేన్నైవం.

తా. మఱియు సంస్కృతకావ్యములయొక్క నిర్మించుటచేతనే కవీశ్వరులకు రససాధనమగుచున్నది- కావున స్వదేశభాషాకావ్యనిర్మాణాపేక్షలేదు- మఱియు సరసహృదయులగు పండితులకు ఆసంస్కృత కావ్యములయందే రసానుభవము సిద్ధించుచున్నది- కావున స్వదేశభాషా కావ్యములయొక్క ఆలోచనమందాసక్తికలుగనేకలుగదు- అని స్త్రీలకు, శూద్రులకు నుపయోగించు నాంధ్రభాషాకావ్యములయొక్క నిర్మించుటయు వీనిని శాసించుటయుఁ బ్రధానముగల యీవ్యాకరణము ఇదియే ప్రయోజనముకలది అందురేమో! ఈలాగుకాదు-

వ్యా- శ్రుతిగర్హితత్వేపి స్వదేశభాషావస్యం వ్యవహారసిద్ధ్యర్థం గ్రాహ్యేవతస్మాద్బ్రాహ్మణేనమ్లేచ్ఛితవ్యమిత్యత్రైవ తాత్పర్యాత్- ఆహితాగ్నిరపశబ్దమిత్యత్ర ప్రాయశ్చిత్తవిధానకం వచనమపినోక్తార్థబాధకం- ఆహితాగ్నిపదస్యాస్యాహితాగ్ని పరత్వేనాగ్న్యాధానానంతరం కర్మమధ్యాపశబ్దప్రయోగ ఏవప్రాయశ్చిత్తమితి కావ్యాదిభిస్స్వదేశభాషాయాః వ్యవహారాత్ప్రత్య వాయాప్రసక్తేర్న ప్రాయశ్చిత్తిరితి తత్తాత్పర్యవివరణాత్.

తా- వేదముచేత నిందింపఁబడినదైనను స్వదేశభాషవ్యవహారనిధికొఱకై ముఖ్యముగా గ్రహింపఁదగినదే- బ్రాహ్మణుఁడపశబ్దము నుచ్చరింపఁ గూడదనుటకు నీయర్థమందే తాత్పర్యము- ఆహితాగ్ని యపశబ్దము నుచ్చరించినట్టయినఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనవలెనని విధించువాక్యము నీచెప్పినయర్థమును బాధించదు- ఏమంటే యీ

యాహితాగ్నిపదమునకు నుంచఁబడిన యగ్నిహోత్రములు కలవాఁడరమగుటచేత నగ్న్యాధానానంతరమునఁ గర్మమధ్యమునందపశబ్దప్రయోగముఁజేసినట్లయితే నే ప్రాయశ్చిత్తము. అని కావ్యాదులచేత స్వదేశభాషను వ్యవహరించుటవలనఁ బ్రత్యవాయముయొక్క ప్రసక్తిలేనందునఁ బ్రాయశ్చిత్తములేదు. అనిదానిని వివరించుటవలననిట్లనేతాత్పర్యము.

వ్యా. వాగ్యోగవిద్దుష్యతిచాపశబ్దై రితిస్మృత్యనుమిత్యవగమ్యమానోపశబ్దనిషేధోపి క్రమవిషయ ఏవ. వాచాహవ్యంచమనసా వాచాయజ్ఞంచప్రవర్తత ఇతి లింగదర్శనేన వాగ్యోగశబ్దస్యయజ్ఞ పరతయావాగ్యోగవిచ్ఛబ్దస్య యజమానఋత్విక్పరత్వాత్. అన్యథా ఆహితాగ్ని మాత్రస్య స్వభాషయావ్యవహారస్యాపిచ్ఛేద ఏవస్యాదితితాంత్రికావదంతి. అతఏవ వ్యాకరణమహాభాష్యే సర్వోప్యపశబ్దనిషేధః క్రతువిషయ ఏవ నతువ్యవహారవిషయ ఇతిప్రతిపాదితం. తతస్స్వదేశభాషాభిమాన ధౌరేయాః పండిత శశాంకాఃనిశ్శంకాస్స్వదేశభాషా కావ్యనిర్మాణేపిప్రవర్తంత ఏవ.

తా. యజ్ఞప్రయోగముజేయువాఁ డపశబ్దములచేత దూషితుఁడగుచున్నాఁడను స్మృతిచేత నూహింపఁబడిన యపశబ్దనిషేధమునుక్రమవిషయమైనదే వాక్యముచేతను, హవిస్సునుమనస్సుచేతను, వాక్యముచేతను, యజ్ఞమును జరుగుచున్నది యనుగురుతుకనుబడుచుండుటచేత వాగ్యోగశబ్దమునకు యజ్ఞపరముగాను, వాగ్యోగవిచ్ఛబ్దమునకు యజమానఋత్విక్పరముగాను, అర్థము అట్లుగానియెడల నాహితాగ్ని అయినమాత్రముచేత నే స్వదేశభాషచేతను వ్యవహారమునకుఁ గూడ భంగమేకలుగునని తాంత్రికులుచెప్పుచున్నారు కనుకనే వ్యాకరణ భాష్యమందు అపశబ్దనిషేధమంతయుఁ గ్రతువిషయముగాని వ్యవహారవిషయముకాదని నిరూపింపఁబడినది కావున స్వదేశభాషాభిమాన

మునుపహించిన పండితచంద్రులు సందేహములేనివారై స్వదేశభాషా కావ్యములను నిర్మించుటయందును ప్రవర్తించుచునేయున్నారు.

తా. తాదృశాస్సహృదయ విచక్షణాకాయా అపితత్రాపి రసాస్వాదనార్థం నిస్సందేహం నివిశంత్యే వేతి సిద్ధం. తత్రాపి ప్రాకృతాంధ్రయో ర్న్యదేశభాషావ త్సర్వత్రాపశబ్దత్వేనా ప్రమాణ్యం. తథాహి ప్రాకృతభాషా త్రివిధా తత్సమా, తద్భవా, దేశ్యా చేతి తత్ర తత్సమప్రాకృతస్య వేద వేదాంగరూఢత్వేన వైదికత్వేనామ్లేచ్ఛత్వ స్యనిర్వివాదత్వాత్.

తా. అటువంటి సహృదయులలో నేర్పరులయినవారియొక్క సమూహములును ఆస్వదేశభాషా కావ్యములయందు రసానుభవముకొఱకు నిస్సందేహముగాఁ బ్రవర్తించుచునేయున్నారు అక్కడను బ్రాకృతాంధ్రములకు అన్యదేశభాషతో సమానముగ నంతట నపశబ్దము లగుటచేతఁ బ్రామాణ్యములేకపోవుటలేదు. ఎట్లనిన ప్రాకృతభాష తత్సమము, తద్భవము, దేశ్యము నని మూఁడువిధములు అందుఁదత్సమ ప్రాకృతము వేదవేదాంగములయందు రూఢియైనదగుటచేతను వేద మందయినదియే కావున నపశబ్దము కాకపోవుట వివాదము లేనిది.

వ్యా. తద్భవస్యాప్యన్యదేశ్యభాషావన్న మ్లేచ్ఛత్వం. తస్య సంస్కృతభవత్వాత్. అతఏవ తద్భవప్రాకృతవ్యపదేశః- కించ స్వర్గలోకావతరద్గీర్వాణ్యా పూర్వవిశ్రమ స్థానాయమాన రసజ్ఞేన సర్వజ్ఞ శిఖామణినా సాక్షాచ్చతుర్ముఖేన వల్మీకసంభవ మహర్షిణా నిర్మితం వ్యాకరణం- తచ్చ అనుక్తమన్యశబ్దానుశాసనవదిత్యతిదేశాదాద్య వ్యాకరణస్య వికృతీభూతం తేన నిష్పాదితంచ భవతీత్యపరో మహాన్ విశేషః.

తా. తద్భవముకూడ నన్యదేశభాషకు వలె నపశబ్దత్వము లేదు. ఎందువలననని నది సంస్కృతభవమగుటవలన- కనుకనే, తద్భవప్రాకృతమని వ్యవహారము. మఱియు స్వర్గలోకమువలన దిగుచున్న గీర్వా

ణావాణికిఁ బ్రథమవిశ్రమస్థానమును, రసజ్ఞుఁడును, సర్వజ్ఞులలో శ్రేష్ఠుఁడును సాక్షాత్తు బ్రహ్మయగు వాల్మీకిమహర్షిచేతను వ్యాకరణము జేయఁబడినది- అదియును “ఇందుఁ జెప్పఁబడనిది యితరవ్యాకరణములకువలెను” అనియతిదేశించుటవలన మొదటివ్యాకరణమునకు వికారమైనదైయా వాల్మీకిచేతఁ జేయఁబడినది- అనిమఱియొకవిశేషము.

వ్యా. కించాభియుక్తస్మరణపరంపరయా తత్కాలీన వృద్ధప్రత్యక్ష సధ్రీచీనయా తత్తచ్ఛబ్దానాం తత్తదర్థేష్వనాది వాచకత్వాలక్షణం- సాధుత్వమత్రాప్యస్త్యేవేతి నతద్భవస్యాసాధుత్వం- అతఏవసర్వదేశేషు తన్మిశ్రకావ్యానతిప్రయోగ మభియుక్తాస్సంస్కృతకావ్యానీవ బహుమన్యంతే.

తా. మఱియు ఆకాలమందుఁ జూడఁబడిన ప్రత్యక్షప్రమాణముతోఁ గూడిన పెద్దలగువారి స్మృతిపరంపరచేత నాయాశబ్దములకు నాయాయర్థములను మొదటినుండియుఁ జెప్పుటయను సాధుత్వము ఈ తద్భవమందునుగలదు- కావునఁ దద్భవమునకు నసాధుత్వములేదు- కనుకనే సర్వదేశములయందును దానితోఁ గూడిన రూపక (నాటక) కావ్యములయొక్క ప్రయోగమును బెద్దలగువారు సంస్కృతకావ్యములవలెనే గౌరవించుచున్నారు

వ్యా. తేషామయమాశయః నహి వాల్మీకిమహర్షేరన్యస్సన్మార్గోపదేష్టా స్సర్వజ్ఞః ప్రత్యయితతమో౽స్తిలోకే- తేనఖిలు, ప్రాకృతభాషానిష్పాదకం వ్యాకరణం నిర్మితం- కావ్యోపయోగాయ భాషావినియోగశ్చ ప్రవర్తితః- నహిమూలశ్రుతిదర్శనమంతరామహర్షేస్తస్య ప్రయత్నస్సంభవత్యేవేతి తన్నిబద్ధాని తన్మిశ్రాణిచ కావ్యాని కథం నచతుర్విధపురుషార్థప్రయోజనాని భవేయురితి.

తా. వారికి ఇదియభిప్రాయము- ఏదియన “వాల్మీకి మహర్షికంటె మఱియొకఁడు సన్మార్గమును జెప్పువాఁడును సర్వజ్ఞుఁడును, నమ్మికముగలవాఁడును లోకములో లేఁడుగదా- ఆ వాల్మీకిమహర్షి

ప్రాకృతభాషను నిరూపించు వ్యాకరణమును జేసెను- కావ్యోపయోగముకొఱకు భాషావినియోగముం గూడఁ జూపించెను- మహాత్ముఁడగు వాల్మీకి మహర్షికి మూలశ్రుతిఁ జూడకుండ వానియందుఁ బ్రయత్నము సంభవించ నేసంభవించదు- కనుక నాప్రాకృతభాషచేతఁ జేయఁబడినట్టియు దానితోఁ గలసినట్టియు కావ్యములు చతుర్విధపురుషార్థములు ప్రయోజనముగలవి యెట్టుగాఁ గాకపోవును '' అని.

వ్యా. అతఏవ తేనైవ మహర్షిణా శ్రీరామాయణే శ్రేష్ఠశాస్త్రి సమూహేషు ప్రాప్తవ్యామిశ్రకేషు సంస్కృతప్రాకృత మిశ్ర నాటకాలంకారాదిషుచ శ్రీరామదేవస్య జ్ఞానపాటవం ప్రతిపాదితం, అతఏవద్రవిడభాషా అసంస్కృతానుసారిణ్యపి కుంభసంభవానుశాస్త్రికత్వేన పండితైరాద్రియతే- ఆంధ్రభాషాయా అపి సంస్కృతసమాంశే ప్రకృత్యంశస్య వేదవేదాంగే ప్రత్యభిజ్ఞాయ మానత్వాత్సిద్ధమేవ ప్రామాణ్యం. ప్రాకృతసమాంశస్యాపి తత్త్వేనైవ ప్రామాణ్యం తద్భవాంశయోర్ద్వయయోరనుసారిత్వేన నహేయత్వం- అతఏవాస్యా వికృతిసంజ్ఞయా వ్యవహార ఇత్యత ఆంధ్రభాషాకావ్య నిర్మాణే స్వభాషాభిమానినః కవయః ప్రవర్తంతే.

తా. కనుక నే, ఆవాల్మీకిమహర్షిచేతను శ్రీమద్రామాయణ మందును శ్రేష్ఠమయిన శాస్త్రములయందును బొందఁబడిన మిశ్రములుగల సంస్కృతప్రాకృత మిళిత నాటకాలంకారాదులయందును శ్రీరామమూర్తియొక్క జ్ఞానవిశేషము చెప్పఁబడినది. కనుక ద్రవిడభాషసంస్కృతము ననుసరించునది కాకపోయినను అగస్త్యమహామునిచేత శాసింపఁబడిన దగుటచేతఁ బండితులచే నంగీకరింపఁబడుచున్నది. ఆంధ్రభాషకును, సంస్కృత సమాంశమందుఁ బ్రకృతిరూపముయొక్క యంశము [అనఁగాఁ దెలుఁగుప్రత్యయము చేరని సంస్కృతశబ్దము] వేదవేదాంగములయందుఁ బ్రసిద్ధమయిన దగుటవలనఁ బ్రమాణత్వము సిద్ధము- ప్రాకృతసమాంశమును సిద్ధియే యగుటచేత [అనఁగాసం

స్కృతమగుట చేత] ప్రమాణత్వము. తద్భవాంశములు రెండింటికి [అనఁగా, సంస్కృతభవ ప్రాకృతభవములకు] సంస్కృతప్రాకృతము లననుసరించుటచేత విడిచిపెట్టఁదగుటలేదు. కనుకనే, ఈయాంధ్ర భాషకు వికృతియనుపేరిచే వ్యవహారము కలదు- కాఁబట్టి స్వదేశభాషాభిమానముగల కవులు ఆంధ్రభాషాకావ్య నిర్మాణమందుఁబ్రవర్తిం చుచున్నారు.

వ్యా. ప్రతియుగం తత్కావ్యేషు రసికా అపి, తాదృశ రసాస్వాదనార్థం వర్తంత ఏవ. మ్లేచ్ఛభాషాతు సర్వథా అగ్రాహ్యైవ. నమ్లేచ్ఛిత వైభాషి తవైభాషితవై శిక్షితవ్యేతి స్మృతేరభియుక్త వ్యవహారాభావాచ్చ.

తా. ప్రతియుగమందును నాయాకావ్యములయందు రసికులగు వారును నట్టిరసమున ననుభవించుటకొఱకుఁ బ్రవర్తించుచునే యున్నారు మ్లేచ్ఛభాషయభ్యసించఁదగనిదియను స్మృతివలనను పెద్దలవ్యవహారము లేకపోవుటవలనను ఆమ్లేచ్ఛభాష సర్వవిధములఁ చేత గ్రహింపఁదగినదియే కాదు.

వ్యా. నచాస్య కావ్యస్య స్త్రీశూద్రాద్యధికారికత్వం. అని బద వ్యవహారోపయోగిభాషామాత్రస్య తదధికారకత్వేపి శాస్త్రసంస్కృతత్వేన అలౌకికవిభావానుభావ సాత్వికవ్యభిచారలక్షణ రసవ్యంజకసంఘటితత్వ తత్సమాది నానావిధశబ్దవిచిత్రత్వేనచ విలక్షణంవర్ణన ప్రధానం చమత్కారకారికావ్యమపికథన్నామా పండితస్త్రీశూద్రాదిరధికారకత్వమాప్నుయాత్- అంతఃపండితా ఏవాత్రాధికారిణోభవంతి

తా. ఈకావ్యమందు స్త్రీశూద్రాదులకుమాత్రమే యధికారము కాదు- ఛందోబద్ధము కానట్టియు వ్యవహారమునకుమాత్రము పయోగించునట్టియు భాషకుమాత్రము ఆస్త్రీశూద్రాదులధికారులైనను శాస్త్రముచేత సంస్కరింపఁబడినదగుటచేత లౌకికముగాని విభావానుభావ సాత్విక వ్యభిచారిభావరూపములగు రసమును బ్రకటన జేయువాని

తోఁగూర్చఁబడిన తత్సమాదిబహువిధములగు శబ్దములయొక్క సందర్భముచే విచిత్రమగుటచేత విలక్షణమైనట్టియు వర్ణనప్రధానమై చమత్కారములు జేయునట్టి కావ్యముఁగూడ పండితులుగానట్టి స్త్రీశూద్రులే యధికారము కలదియగును. కావునఁబండితులగువారే దీనియందు ననధికారులగుదురు.

వ్యా అయంతువిశేషః. సంస్కృతపురాణపఠన శ్రవణాక్షమాణామీషద్వ్యుత్పత్తిమతాం స్త్రీశూద్రాదీనాం ముముక్షూణాంతు తదర్థోపబృంహణేష్వవర్ణ ప్రధానేష్వాంధ్రపురాణేషు కథాప్రధానేషు ప్రాధాన్యేనాధికారిత్వం తత్పఠనశ్రవణాభ్యాంవినా తేషాం జ్ఞానోత్పత్తిసాధనాంతరాభావాత్.

తా. ఇదైతేయొక విశేషముకలదు. సంస్కృతపురాణములుచదువుటయందును వినుటయందును నసమర్థులగు కొద్దివ్యుత్పత్తిగలముముక్షువులగలస్త్రీశూద్రాదులకు సంస్కృతగ్రంథములయొక్క యర్థముల ననుఘోషించుచున్నట్టియు వర్ణనప్రధానములుకానట్టియు కథాప్రధానములైనట్టియు నాంధ్రపురాణములయందుఁ బ్రధానముగా నధికారముగలదు. ఆయాంధ్రపురాణములను జదువుట వినుటదక్క నాస్త్రీశూద్రాదులకు జ్ఞానముబుట్టుటకు నితరసాధనములు లేవుగదా.

వ్యా. నను, నశూద్రాయమతిం దద్యాదితి నిషేధేన శూద్రస్య బ్రహ్మవిద్యాయా మధికారిత్వాభావ ప్రతిపాదనాత్ కథంతస్య జ్ఞానోత్పత్తి సాధనమితిచేన్నైవం- శ్రావయేచ్చ చతురోవర్ణాన్ కృత్వా బ్రాహ్మణమగ్రత ఇతివచనేన. అర్థాచ్చాతుర్వర్ణస్యాధికార శ్రవణాత్- నిషేధస్యతు వేదపూర్వక విద్యాదాన మాత్ర ఏవేతి నమతిమాత్రదాననిషేధే తాత్పర్యం-

తా- అట్లయిన్యా, శూద్రునకు జ్ఞానమియ్యఁగూడదు. అను నిషేధముచేత శూద్రునకు బ్రహ్మవిద్యయందు నధికారము లేకపోవుటయొక్క చెప్పటవలనఁ వారికి జ్ఞానోత్పత్తిసాధనమెట్లు? అనిన నట్లు

లగాదు- బ్రాహ్మణునిముందుంచుకొని నాలుగు వర్ణములకు వినిపించవలసినదను వచనముకలదుగదా- అటులగానియెడల నాలుగువర్ణములకు నధికారము వినఁబడుచున్నది- కావున నిషేధము వేదపూర్వకవిద్యాదానమందు మాత్రమే- జ్ఞానమాత్రమిచ్చుటను నిషేధించుట మందుఁ దాత్పర్యముకాదు-

వ్యా- అన్యథా చాతుర్వర్ణ్య ధర్మాణామపి జ్ఞాన సాధనత్వాభావేన ప్రతిపాదక వచనానా మననుష్ఠానలక్షణం ప్రామాణ్యం స్యాత్- శూద్రస్యాపి వర్ణధర్మాశ్శ్రూయంతే- తస్యాపి సత్యమక్రోధః శౌచమిత్యాది వచనైః-

తా- అటులకానియెడల నాలుగువర్ణ ధర్మములకు జ్ఞానసాధనమగుటయొక్క లేకపోవుటచేత వానినిఁజెప్పు వచనములకు నాచరించకపోవుటయను అప్రమాణత్వమగును- వానికిని సత్యము, క్రోధములేకపోవుట, శుచి, యుండవలెనను వచనములచేత శూద్రునకుఁగూడ వర్ణధర్మములు వినఁబడుచున్నవి-

వ్యా. నన్వేవమపితమేవం వేదానువచనేన బ్రాహ్మణావివిదిషంతి- యజ్ఞేన దానేన తపసా నాశకేనే త్యుపనిషదాఽత్మశుద్ధ్యర్థ విహితయజ్ఞాద్యనధికారాత్ శూద్రస్య ఆజ్యావేక్షణాద్యసమర్థస్య అంధస్య దర్శపూర్ణమాసాదావివ బ్రహ్మవిద్యాయామధికారాభావ ఇతిచేన్న,

తా- అవునయ్యా, అట్లయినను వేదవాక్యముచేతను, యజ్ఞముచేతను, దానముచేతను, బాధచేయని తపస్సుచేతను బ్రాహ్మణులాబ్రహ్మను దెలియనిచ్ఛగించుచున్నారని యుపనిషత్తుచేతను ఆత్మశుద్ధికొఱకు విధించబడిన యజ్ఞాదికమందు శూద్రునికధికారము లేకపోవుటచేత ఆజ్యావేక్షణాదికమందు అసమర్థుఁడయినట్టియు గ్రుడ్డివానివంటి వాఁడయినట్టియు నాశూద్రునకు బ్రహ్మవిద్యయం దధికారము లేదంటిరేని యటులకాదు.

వ్యా. నహ్యత్ర వాక్యే యజ్ఞాదీనాం సముచ్చయః. నిరపేక్షత్రితీయాపక్షేశ్రుత్యా వికల్ప ప్రతీతేః శ్రుత్యపేక్షయా వాక్యస్య దుర్బలత్వాత్. అంతరాచాపితు తద్దృష్టేరితి శారీరక బ్రహ్మ మీమాంసా సూత్రే. విధురాణాం యజ్ఞాద్యనధికారిణామపి బ్రహ్మవిద్యాయామధికారాంగీకారాచ్చ. నచతత్ర జన్మాంతరానుష్ఠిత సత్కర్మభిస్తేషామధికార ఇతివాచ్యం. విశేషానుగ్రహశ్చేత్యగ్రిమ సూత్రభాష్యే విధురాదీనామప్యవిరుద్ధైః పురుషమాత్రసంబంధిభిర్విశేషైరనుగ్రహో విద్యాయాస్సంభవతీతి తదానీంతన కర్మభిరేవోపపాతితత్వాత్.

తా. ఈవాక్యమునందు యజ్ఞాదులకు సముచ్చయము [అనఁగా యజ్ఞాదులన్నియుఁగలసియే యుండవలెననుట] లేదుగదా! అపేక్షలేని తృతీయయొక్క పక్షమందు శ్రుతికివికల్పముయొక్క తోఁచుటవలన వేదద్వారా వాక్యముబలహీనమయినదిగదా విధురులకుదృష్టిలోపలనే యుండవలసినదను శారీరక బ్రహ్మ మీమాంసాసూత్రమందు విధురులకు యజ్ఞాదులయందధికారము లేకపోయినను బ్రహ్మవిద్యయందధికారము నంగీకరించిరిగదా- ఆవిధురులకుజన్మాంతరమందుఁ జేయబడిన కర్మలచేత ఆబ్రహ్మవిద్యయందు అధికారముగలదని చెప్పఁగూడదు- "విశేషానుగ్రహశ్చ" అనుపైసూత్రముయొక్క భాష్యమందు విధురాదులకును విరుద్ధములుకానట్టియుఁ బ్రతిపురుషునితో సంబంధించినట్టియు విశేషములచేతను విద్యయొక్క యనుగ్రహముసంభవించుచున్నదని ఆకాలమందు [అనఁగా విధురత్వమందు] అయినకర్మలచేతనే చెప్పఁబడినదిగదా.

వ్యా. ఏవంచ ఏకవాక్యగతత్వేన వేదానువచనాధికం సముచ్చయతే. తథాపీహఫలైక్యాన్నైకకర్మవత్. దర్శాదిఫలైక్యేపి ప్రయోగస్య భేదాశ్శ్రుతేఃభిన్నకాలప్రయోగస్తమేవాప్యుపతిష్ఠతే. ఇతియజ్ఞాదీనాం సముచ్చయంప్రతిపాదయితాం నృసింహమిశ్రాణాం ము

దావ్యాత సూత్రభాష్య విరోధో దుర్వార ఇతి స్పష్టమేవ.

తా- ఈలాగునుంచుండఁగా నొకటేవాక్యమును బొందినదగుట చేత వేదపాఠాదికము సముచ్చయము చేయఁబడుచున్నది- అయినను, ఒక్కటే ఫలమగుటవలన నొక్కకర్మణావలెఁగాదు- దర్శాదుల యొక్క ఫలమునకు ఏకత్వముకలిగినను ప్రయోగ భేదముయొక్క వినఁబడుటవలన భిన్న కాలమందయినప్రయోగమందున్నదియే అనుకూలించుచున్నది- అనియజ్ఞాంగులయొక్క సముచ్చయమును జెప్పుచున్న న్యాసింహమిశ్రులకు ఉదహరించఁబడిన సూత్రభాష్యముయొక్క విరోధము నివారించశక్యముగానిదని స్పష్టమైనదే

వ్యా. ఏవం శూద్రస్యాగ్నిహోత్రాద్యసంబంధేపి పాపక్షయ హేతుత్వేనవిహిత దానాదిభిరుదిత వివిదిషస్య బ్రహ్మవిద్యాయామధికారోనవిరుద్ధ ఏవ

తా. ఈరీతిని శూద్రునికగ్నిహోత్రాదులులేకపోయినను పాపనాశనము హేతువగుటచే విధించఁబడిన దానాదులచే కలిగిన బ్రహ్మజ్ఞానిజ్ఞానేచ్ఛగల ఆశూద్రునకు బ్రహ్మవిద్యయందధికారము విరుద్ధము గాదు.

వ్యా. నన్వేవమపి బ్రాహ్మణావివిదిషంతీతి బ్రాహ్మణగ్రహణాత్కథం శూద్రస్యతత్రాధికార ఇతిచేన్న తత్ర బ్రాహ్మణశబ్దశ్య విద్యాధికార మాత్రోపలక్షణత్వాత్. భవతామపి క్షత్రియ వైశ్యసాధారణ్యార్థముపలక్షణత్వస్యేష్టత్వాత్. తథాచసురేశ్వరవార్తికం బ్రాహ్మణగ్రహణంచాత్ర ద్విజానాముపలక్షణం అధిశిష్టాధికారిత్వాత్సర్వేషామాత్మబోధన ఇతి.

తా. అయ్యా! ఈలాగయినను ,,బ్రాహ్మణావివిదిషంతి' అని బ్రాహ్మణశబ్దమును గ్రహించుటవలన శూద్రునికెట్లుగానా బ్రహ్మవిద్యయందధికారము కలదంటిరో ఆశ్రుతియందు బ్రాహ్మణశబ్దము బ్రహ్మవిద్యాధికారిమాత్రమునకు సూచించేదగుటవలన మీకును క్షత్రియవైశ్యులకు సాధారణత్వము నిమిత్తమై యుపలక్షణమిష్టముగదా! సు

శేశ్వరవార్తికమందు ఇక్కడ బ్రాహ్మణశబ్దగ్రహణము ద్విజులకు [అనఁగా బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు] ఉపలక్షణము అందఱును ఆత్మబోధవిషయమై విధించఁబడిన యధికారముకలవారగుటవలన అనియున్నది,

వ్యా. అస్తువా బ్రాహ్మణగ్రహణవివక్షా తథాపి జన్మాంతరానుష్ఠిత యజ్ఞాదిభిరుదితవివిదిషస్య శూద్రస్యాప్యధికారో నవిరుధ్యతే శూద్రోయజ్ఞేనవక్లుప్త ఇతివత్ విద్యాయాం శూద్రోనవక్లుప్త ఇతినిషేధాభావాత్.

తా. శ్రుతియందు బ్రాహ్మణశబ్దగ్రహణముయొక్క వివక్షయుండుగాక అయినను జన్మాంతరమందుఁ జేయఁబడిన యజ్ఞాదులచేఁ బుట్టిన బ్రహ్మజ్ఞానసంపత్తిగల శూద్రునికిఁగూడ బ్రహ్మజ్ఞానాధికారము విరోధించదు. శూద్రునిచేఁ జేయఁబడనియజ్ఞము అనియున్నట్లుగా బ్రహ్మవిద్యయందు శూద్రునిచేఁ జేయఁబడని అనునిషేధముయొక్క లేకపోవుటవలన.

వ్యా. శ్రావయేచ్చతురో వర్ణానితీతిహాసపురాణాధిగమే చాతుర్వర్ణ్యాధికారస్మరణాత్ వేదపూర్వకస్తు నాస్త్యధికారః శూద్రాణామితి సిద్ధమేవ శూద్రాధికరణోపసంహార భాష్యపర్యాలోచన యా పురాణద్వారా శూద్రస్యాపి బ్రహ్మవిద్యాధికారో భగవత్పాదానామపిసమ్మత ఇత్యనుమీయతే.

తా. నాలుగువర్ణములవారిని బ్రహ్మవిద్యను వినిపించవలెనని ఇతిహాసపురాణ ప్రమాణముగలుగుచుండుటవలన నాలుగువర్ణములవారికి నధికారముకలదు కానిశూద్రులకు వేదాధ్యయనముచేసి బ్రహ్మవిద్యను నేర్చుటమాత్రము అధికారములేదు అనిసిద్ధించినది శూద్రాధికరణమును చాలించుచో భాష్యమునాలోచించఁగా పురాణములద్వారా శూద్రులకు బ్రహ్మవిద్యాధికారము భగవంతుఁడగు శంకరాచార్యులవారికి నొప్పిదమయినట్లూహించఁబడుచున్నది.

వ్యా. తత్రశూద్రస్యపురాణ శ్రవణేననిర్గుణ బ్రహ్మజ్ఞానే జాతేపి
తన్నముక్తిహేతుః. తంత్వౌపనిషదమితి వాక్యపర్యాలోచన యావే
దాంత శాస్త్రజన్య బ్రహ్మసాక్షాత్కార స్యైవమోక్షహే తుత్వావధా
రణాత్. కింతుపురాణ శ్రవణేనాపివర్ధిత బ్రహ్మజ్ఞానస్య శూద్రస్య
విద్యోత్పత్తి ద్వారాక్రమేణముక్తిః. యథాత్రైవర్ణి కానాంక్రమము
క్తిఫలకసగుణ విద్యోపాసకానామితి.

తా. అక్కడశూద్రునికి పురాణముయొక్క వినుటచేత నిర్గుణబ్ర
హ్మధ్యానము గలిగినను అదిముక్తిహేతువుగాదు "తంత్వౌపనిష
దం" అనువాక్యమునాలోచించుటచే వేదాంతశాస్త్రమువలనఁబు
ట్టిన బ్రహ్మసాక్షాత్కారమే మోక్షమునకుహేతువగుటను యొక్క ని
శ్చయమువలన. ఇకనేమనిన పురాణమువినటచేతను విస్తరించఁబడిన
బ్రహ్మజ్ఞానముగల శూద్రునికిజ్ఞానోత్పత్తి ద్వారాక్రమముచేతి ముక్తిక
లదు. ఏలాగననిన-క్రమముగామోక్షమగుఫలముగల సగుణవిద్యనుపా
సనచేయు బ్రాహ్మణక్షత్రియవైశ్యులకువలెనే.

వ్యా. విదురాదీనాంతు పూర్వానుష్ఠితసమస్తసాధనకలాపానాం
కేన చిన్నిమిత్తేనాసాదిత శూద్రశరీరాణాం బ్రహ్మసాక్షాత్కారాన్ము
క్తిరస్త్యేవ. జ్ఞానేసత్యజ్ఞాననివృత్తేరావశ్యకత్వాత్. ఏవంగర్భగతస్యై
వ వామదేవస్యజ్ఞానము పపాదనీయం ఏతచ్చైహికమప్రస్తుతం. ప్ర
తిషేధేతిద్దర్శనాదితి తృతీయోపాంత్యాధికరణే నిర్ణీతం. గర్భస్థఏవ
వామదేవః ప్రతిబుబుధే బ్రహ్మాహమితీయం శ్రుతిర్జన్మాంతర సం
పాదితాత్సాధనాజ్జన్మాంతరే విద్యోత్పత్తిందర్శయతి, నహిగర్భస్థస్యై
హికంకించి చ్ఛ్రవణాదికంసాధనంసంభావ్యతే సాంఖ్యతంత్రేచచ
తుర్థాధ్యాయస్యాధికరణేరాజపుత్ర తత్త్వోపదేశాదిత్యస్మిన్ పురా
ణద్వారా బ్రహ్మవిద్యా యామధికార శ్శూద్రస్యాపియత్నేనసాధితః

తా. పూర్వమందుఁజేయఁబడిన సమస్తసాధన సముదాయములు
గలిగినట్టియు నేదోయొక హేతువుచేతఁ బొందఁబడినశూద్రశరీరము.

గలవిధురుఁడు మొదలగువారికిని బ్రహ్మసాక్షాత్కారమువల్ల ముక్తియే ష్టమే. ఏమనినజ్ఞానముగలుగుచుండఁగా నజ్ఞానముమళ్ళిపోవుట యావశ్యకమైనదగుటవలన. ఈలాగునె గర్భమందున్న వామదేవునికిజ్ఞానము కలిగినదనియుపపత్తిచేసికొనవలెను. ఐహికముమాత్రమునిషేధమందుఁ గనఁబడుటవలనఁ బ్రస్తుతముకాదు అనితృతీయాధ్యాయముయొక్క చివర అధికరణముయొక్క పూర్వాధికరణమందు నిర్ణయింపఁబడినది గర్భస్థుఁడైనట్టి యీవామదేవుఁడు నేను బ్రహ్మనని తెలుసుకొనెనను శ్రుతిజన్మాంతరమందు సంపాదింపఁబడిన సాధనమువలనమతియొక జన్మమందు జ్ఞానోత్పత్తినిఁజూపుచున్నది. [ఏమంటే] గర్భమందున్న వాని కిహలోకమందలి శ్రవణమననాదికమైన సాధనమెద్దియుఁగలుగ లేదుగదా. సాంఖ్యతంత్రమందు నాల్గవ యధ్యాయముయొక్క " రాజతంత్రతత్త్వోపదేశాత్, అనునీయధికరణమందుఁ బురాణద్వారా బ్రహ్మవిద్యయందు అధికారము శూద్రునికినియత్నముచె సాధించఁబడె.

వ్యా. అతఏవ శూద్రస్యాపి మోక్షోపయోగి పురాణాదావధికారో భగవతాప్యుక్తః- శ్లో॥ మాంహి పార్థవ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః- స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాంగతిమితి శూద్రస్యాపి మోక్షం ప్రతిపాదయతా- నహిస్వభక్తిరనేకపురాణ శ్రవణమంతరేణ కస్యాపిసంభవతి

తా. కనుకనే " ఓయర్జునుఁడా? నన్నాశ్రయించిపాపాత్ములుస్త్రీలు, వైశ్యులు, శూద్రులును మోక్షమును బొందుచున్నారు '' అని శూద్రునికిఁ గూడ మోక్షమును జెప్పుచున్న భగవంతుఁడగు కృష్ణమూర్తియు శూద్రునికిని మోక్షమున కుపయోగించు పురాణాదికమందు అధికారము సంగీకరించెను- భగవద్భక్తి అనేక పురాణశ్రవణములేనిది ఎవ్వరికినిఁగలుగదుగదా

వ్యా- తస్మాచ్ఛూద్రస్య బ్రహ్మవిద్యాయామధికారోస్త్యేవేతిసం

స్కృతపురాణ పఠనాక్షమాణాంతర్భవణే ప్యలాలసానాం ముము క్షూణాం శూద్రాదీనాం ప్రాధాన్యేన జ్ఞానోపయోగీ న్యాంధ్రి పురాణాని భవంత్యే వేతి తదీయశబ్దానుశాసనపరం వ్యాకరణ మపి సప్రయోజనమేవే త్యేతత్సర్వం మనసినిధాయాహ- స్వస్థానేతి-

తా- కావునశూద్రునికి బ్రహ్మవిద్యయందధికారము కలిగియేయున్నది- అని సంస్కృతపురాణములను జదువుటయందసమర్థులయినట్టియు వానివినుటయందు, ఆసక్తిలేనట్టియు మోక్షేచ్ఛ గల శూద్రాదులకుఁ బ్రధానముగా ఆంధ్రపురాణములు జ్ఞానమునకుపయోగింమనవి యౌ మనేయున్నవి- కావున సాధ్వాంధ్రశబ్దములను శాసించుట ప్రధానముగల వ్యాకరణము ప్రయోజనముతోఁ గూడినదే యని ఇదియంతయు మనమునసుంచికొని స్వస్థానేత్యాది సూత్రములు చెప్పుచున్నాఁడు-

సూ॥ స్వస్థానవేషభాషాభిమతాస్సంతు రసప్రలుబ్ధధియః ।
లోకేబహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య
దపహాయ॥

వ్యా. రసప్రలుబ్ధియో రసాస్వాదనైక ప్రవణాస్సంతః పండిత కవయః- స్వస్థానవేష భాషాభిమతాః స్వస్థానే స్వదేశే యేవేష భాషే తయోరభిమతా అభిమానినస్సంతః, అన్యత్ అన్యదేశభాషా మయం కావ్యమపి విహాయపరిత్యజ్య లోకే వైకృత కావ్యానిచ బహుమన్యంతే- బహూకరణ పూర్వకం కుర్వంత్యే వే త్యర్థః- ఆస్వాద పక్షే ఆద్రియంత ఏ వే త్యర్థః- సంస్కృతభాషా కావ్యనిర్మాణ ధౌరేయా అప్యాంధ్రదేశ నివాసినః కవిచంద్రా అన్యదేశభాషా పరిచిత్యభావాత్- క్వచి త్సద్భావే ప్యభిమానాభావాచ్చ విహాయమద్దేశ భాషేయ మిత్యాంధ్ర భాషా మేవ బహుమన్యమానాః తన్మయాని కావ్యాని బహూనికుర్వంత్యేవ- వ్యవ

హారోపయోగిత్వేన పురుషార్థసాధనత్వేన చాభిమానాస్పదత్వే నాంధ్రభాషా కావ్యస్యాపి సత్కవీంద్రకర్తృకతా నవిహన్యత ఇతిభావః

తా- రసము ననుభవించుటయే ముఖ్యప్రవృత్తిగల పండితులైనకవులు స్వదేశ మందయిన వేషమందును, భాషయందును, అభిమానముకలవారయి అన్యదేశభాషా వికారమగు కావ్యమును విడిచి లోకమున ఆంధ్రభాషా కావ్యములను గౌరవ పూర్వకముగాఁ జేయుచున్నారు- ఆస్వాదించువారి పక్షమందు ఆదరించుచున్నారు- అనియర్థము- సంస్కృతభాషా కావ్యనిర్మాణమునందు భారమును వహించినవారయ్యు నాంధ్రదేశమునందు నివసించు కవిశ్రేష్ఠులు అన్యదేశభాషయందుఁ బరిచయములేనందున నొకానొకచోటనున్నను దానియందభిమానము లేకపోవుటవలన అన్యదేశకావ్యములను విడచి ఇది నాదేశమందలి భాషయని యాంధ్రభాషనే గౌరవించుచున్న వారై యాంధ్రభాషామయ కావ్యములను జేయుచున్నారు- వ్యవహారమునకుపయోగించుటచేతను పురుషార్థములకు సాధనమయినదగుట చేతను అభిమానమునకు స్థానమయినదగుటచేత ఆంధ్రభాషామయ కావ్యముంగూడ సత్కవీంద్రులుచేయుట కొట్టఁబడదనిభావము-

వ్యా- రసప్రలుబ్ధియః- రసైకాయత్తచిత్తాః, పండితాః, ఆంధ్రదేశవాసినః, రసాస్వాదపర్యభాషాకావ్య పరిశీలనేనైవ నిర్వృతత్వే అన్యదేశభాషాకావ్య మననుభవాదభిమానాభావాచ్చపరిత్యజ్య మద్దేశభాషాకావ్యానీమానీతిసంస్కృత కావ్యానీవవికృతికావ్యాన్యపిసమ్మాన్యతత్ప్రియరసాస్వాదంకుర్వంత్యేవేత్యర్థః

తా రసానుభవమునం దధికమయిన మనస్సుగలిగినట్టియు నాంధ్రదేశమందు నివసించియున్నట్టియు పండితులురసము నాస్వాదించుటభాషను కావ్యములను బరిశీలించుటచేతనే గలుగుచుండ నన్యదేశభాషాకావ్యములను అనుభవములేకుండుటవలనను అభిమానములె

కుండుటవలననువిడచి యివినా దేశపు కావ్యములని సంస్కృతకావ్యములవలెనే యాంధ్రకావ్యమునుంగూడ గౌరవించి వానియందును రసానుభవమునుబొందుచున్నారు. అనియరము.

వ్యా. అత ఏవవ్యవహారోపయోగిత్వాదిగుణవిశిష్టత్వేనతాత్రిపిత్రదసాస్వాదనలాలసతా నవిరుధ్యత ఇతి ఇత్యపరోభావః.

తా. కనుక నేవ్యవహారమున కుపయోగించుట మొదలగుగుణములతో గూడినదగుటచేత నాయాంధ్రకావ్యములందును రసాస్వాదనమందాసక్తివిరుద్ధముకాదని మరియొకభావము.

వ్యా. రసప్రలుబ్ధధియో బహుమన్యంత ఇత్యనేనరసజ్ఞానామేమ పండితానాం కావ్యేస్వారసిక ప్రవృత్తిర్నకేవలం తర్కకర్కశధియాంసుధియామపీత్యర్థోజ్ఞాప్యతే తదుక్తమభియుక్తైః॥ శ్లో॥ రసప్రసరనిర్భరాఃకవి గిరాంప్రసారాఃపరం ముదంవిదధతేహృదిమ్రదిమభాజికావ్యామృతైః॥ సుధాకరకరాంకురవ్యతికరేణ చంద్రోపలాద్రవంతీ శిశిరాశ్చ్యాదపినవింధ్యవంధ్యోపలాః॥ ఇతి.

తా. "రసప్రలుబ్ధధియోబహుమన్యంతే" అనిచెప్పుటచేత, రసజ్ఞులైనపండితులకే కావ్యమందు రసాస్వాదనగలవ్యాపారములు కలుగుచున్నవిగాని కేవలముతర్కముచే కఠినమయినబుద్ధిగల విద్వాంసులకుంగూడ గలుగదని తెలుపఁబడుచున్నది. అట్లుత్తములగు వారుచెప్పియుండిరి. ఎట్లనిన, రసముయొక్క ప్రసరించుటతో నిండియున్నకవియొక్క వాక్యములు కావ్యామృతములచే మృదుత్వములుపొందినహృదయమునందే సంతోషమును జేయుచున్నవి ఏలాగనగా చంద్రకిరణములయొక్క ప్రసరించుటచే చల్లనగు చంద్రకాంతమణులు జలమునుస్రవించునుగాని వింధ్యపర్వతమునందలి పలుగురాళ్ళుస్రవించవు అని.

సూ॥ సిద్ధిర్లోకాద్దృశ్యా.

వ్యా. సిద్ధిరాంధ్రదేశభాషాసిద్ధిః లోకాద్దృశ్యా- లోకవ్యవహారాద్ద్రష్టవ్యా- లోకవ్యవహారమూలేతి యావత్ లోకస్య తద్ధేతుత్వమేవ ప్రతిపిపాదయిషతి.

తా. ఆంధ్రదేశభాషయొక్క సిద్ధి, లోకవ్యవహారమువలనఁ జూడదగినది అనఁగా వ్యవహారము హేతువుకలదని నిశ్చయార్థము లోకము శబ్దసిద్ధికి హేతువైనదనుటచే చెప్పనిశ్చయించుచున్నాఁడు.

సూ॥ లోకోనన్యాదృశశ్చనిత్యశ్చ. ఇతి.

వ్యా. లోకః అనన్యాదృశః అన్యాదృశోనభవతీత్య నన్యాదృశః, అనన్యప్రకారః ఏకరూప ఇత్యర్థః నిత్యశ్చ భాషాకవితావత్వేన అప్రళయంవర్తమానః- తేంలోకాత్సిద్ధిరిత్యర్థః.

తా. లోకము మఱియొకలాటిది కాదు అనఁగా ఒక్కరీతినేయుండునని యర్థము మరియు నిత్యమయినది అనగా భాషాకవిత్వముకలదగుటచేత నాశనములేకయుంచున్నది కావునలోకమువలన భాషాసిద్ధికలుగునని యర్థము.

వ్యా. తర్హి, లోకాత్తత్సిద్ధా మందప్రయోజనమిదం శాస్త్రమిత్యాశంక్యాహ.

సూ॥ సంస్కారార్థోనియమః. అని.

తా. అయితేలోకమువలన నాంధ్రభాషాసిద్ధిగలుగుచుండఁగా నీశాస్త్రము తక్కువప్రయోజనముకలది [అనఁగాఁ బ్రయోజనములేనిదనుట] అనిశంకించి సంస్కారార్థోనియమః అని సమాధానముచేయుచున్నాఁడు-

వా. నియమోలక్షణంసంస్కారార్థ సంస్కారశబ్దశిద్ధిః అర్థఃప్రయోజనంయస్య ససంస్కారార్థః వనమును, రామును ఇత్యాదిప్రయోగేష్వాప్తైః కావితిశాస్త్రేణ నకారవిధానపూర్వకం శబ్దస్సంస్క్రియతే తేనవనమునకు రామునకు ఇత్యాదిప్రయోగస్సాధుః జననీ, క

న్యేత్యాదీనాం హ్రస్వ ఏవసాధుత్వం లోకపాలాదిశబ్దానాం ర్వాదేశ ఏవ జసస్సాధుత్వం ఇత్యేవమాదౌ సంస్కారార్థో నియమః- ప్రత్యయాదేశానాం లోకసిద్ధత్వేపి వ్యవస్థా శాస్త్రేణ క్రియతే- బహ్వాంధ్రస్యాపి సంస్కృతేన సమాసే ప్రాప్తే సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతీతి శాస్త్రేణ వ్యవస్థా క్రియతే- అన్యథా బహ్వాంధ్రస్య సంస్కృతేన సమాసే సంస్కృతస్యాప్యాంధ్రేణచ సమాసేవా కోవానివారయితా భవేత్- అతస్సంస్కారార్థత్వేన నియమ ఆవస్యక ఇతి సిద్ధం.

తా. నియమమనఁగా లక్షణము. అది శబ్దశుద్ధి ప్రయోజనము కలది. [అనఁగా లక్షణమువలన శబ్దశుద్ధి గలుగుననుట] వనముకు, రాముకు, అని యీ మొదలగు ప్రయోగములు ఘటసించుచుండఁగా కు, పరమగునపుడు నకారాగమము వచ్చునను శాస్త్రము చేత నకారము నువిధించుట పూర్వముగలుగునట్టుగా శబ్దము సంస్కరించబడుచున్నది. అందుచే వనమునకు, రామునకు, అనునీ మొదలగు ప్రయోగము సాధువు. జనని. కన్య అనునీ మొదలగు శబ్దములకు హ్రస్వాన్త్వము గలుగుచుండఁగానే సాధుత్వము లోకపాలాదిశబ్దములకు ప్రథమా బహువచనమునకు రు, అనునాదేశము కలుగుచుండఁగనే సాధుత్వము ఈ మొదలగు స్థలములయందు శాస్త్రము సంస్కారము కొఱకై యున్నది. ప్రత్యయములు, ఆదేశములు, మొదలగునవి లోకసిద్ధములైనవైనను, శాస్త్రము హద్దును చేయుచున్నది. అనేకములైన యాంధ్రపదములకు సంస్కృతముతో సమాసము ప్రాప్తించఁగా "సంస్కృతపదముతో పరిమితమైన ఆంధ్రపదము కర్మధారయసమాసమగు" నని శాస్త్రము చేత హద్దుచేయఁబడుచున్నది. అట్లుగానిచో అపరిమితములగు నాంధ్రపదములకు సంస్కృతముతో సమాసముగలుగుచుండఁగా సంస్కృతమునకుం గూడ నాంధ్రముతో సమాసము గలుగుచుండఁగానైన నెవ్వఁడుమాన్పఁ గావున శాస్త్రము సంస్కారము నిమిత్తమై అవస్యము గానుండవలసినదని సిద్ధించుచున్నది.

వా. నను నియమోమాస్తు తదభావేతాదృశప్రయోగోప్యస్తు కో వాదోష ఇత్యాశంక్యాహ.

సూ॥ అనియమాద్గ్రామ్యంహి. ఇతి.

తా. ఓయయ్యా! నియమము లేకపోవుఁగాక- అట్టినియమము లేనందున నట్టియపప్రయోగములుంగూడ గలుగుఁగాక- ఏమి దోషము గలదు అని శంకించి "అనియమాద్గ్రామ్యంహి" అని చెప్పుచున్నాఁడు.

వ్యా. హీతిప్రసిద్ధౌ- అనియమాన్నియమాభావాత్, పదంగ్రామ్యంభవేది.

తా. "హి" అనునది ప్రసిద్ధ్యర్థమును దెలుపుచున్నది నియమము లేకపోవుటవలన శబ్దముగ్రామ్యమగునని ప్రసిద్ధము.

వా. గ్రామ్యత్వే కాహానిరితిశంకావ్యాజేన గ్రామ్యాపభ్రంశ శబ్దయోః పర్యాయకథనార్థముక్తం.

సూ॥ యత్త్వపభ్రంశః. ఇతి.

తా. శబ్దముగ్రామ్యమైనయెడల నేమిహానికలదు అని శంకామిషచే గ్రామ్యమన్నను అపభ్రంశము (అనఁగా నపశబ్దము) అన్నను ఒకటే అర్థముకలదని చెప్పుచున్నాఁడు "యత్త్వపభ్రంశః" అని.

వ్యా. యత్తు గ్రామ్యమేవపదమపభ్రంశ ఇత్యుచ్యతే. అపభ్రంశపదస్యాప శబ్దపర్యాయత్వేన సిద్ధత్వాదుభయోః పర్యాయత్వకథనాద్గ్రామ్యత్వ మపశబ్దత్వమితి తన్నివారణార్థంనియమ ఆవశ్యక ఇతిభావః.

తా. గ్రామ్యపదమేదిగలదో అదియేయపశబ్దమని చెప్పఁబడుచున్నది- అపభ్రంశపదము అపశబ్దపర్యాయమగుటచేఁ బ్రసిద్ధమయినదగుటవలను రెండిటికిని బర్యాయములగుటను జెప్పుటవలన గ్రామ్యత్వమనఁగా నపశబ్దత్వమనియు దానినివారించుటకై నియమము ఆవశ్యకమయినదనియు భావము.

వ్యా. అత్రేదంతాత్పర్యం. ఆంధ్రభాషాకావ్యనిర్మాణే కవయః ప్రతియుగం ప్రవర్తంత ఇత్యుక్తం తథాచ తద్గతశబ్దానాం గ్రామ్యతాపరిహారాయ గ్రామ్యాగ్రామ్యవిభాగపరం వ్యాకరణమేతదావశ్యకమేవ- శ్లో॥ తదల్పమపి నోపేక్ష్యం కావ్యేదుష్టం కదంచన। స్యాద్వపుస్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగం॥ శ్లో॥ గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః। దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుస్సైవ శంసతి ఇత్యభియుక్తోక్తిభిరపశబ్దత్వ సౌశబ్ద్యయోః హేయోపాదేయతా ప్రతిపాదనాత్.

తా. ఇచ్చటనిది తాత్పర్యము- ఏమన్నను, ఆంధ్రభాషాకావ్యనిర్మాణమందుఁ గవులు ప్రతియుగమందుఁ బ్రవర్తించుచునేయున్నారని చెప్పఁబడినది- అలాగుననుండఁగా నాకావ్యములను బొందిన శబ్దములకు గ్రామ్యత్వమును పరిహరించుటకై గ్రామ్యమును, అగ్రామ్యమును, విభజించుట ప్రధానముగల యీ వ్యాకరణమవశ్యమైనదే- కావ్యమందు దోషము కొద్దిదైనను ఎన్నిభంగులనైనను విడిచివేయఁగూడదు- శరీరము మిక్కిలి సుందరమయినదయినను ఒక్క బొల్లియున్నందుచే వికారముగలది ఔనుగదా? మఱియు సాధువుగాఁ బ్రయోగించిన వాక్యము కామధేనువనియు అసాధువుగాఁ బ్రయోగించిన శబ్దము ప్రయోగించినవానికిఁ బశుత్వము దెల్పుచున్నది అనియు బెద్దలు చెప్పిరి- ఆమహాత్ములయొక్క వాక్యములుండుటంబట్టి యపశబ్దము విడిచిపెట్టఁదగినదనియు సుశబ్దము స్వీకరించఁదగినదనియుఁ జెప్పుటవలన-

వ్యా అత ఏవాథర్వణేనోక్తం శ్లో॥ త్రిశేషశబ్దేష్వుక్తేషు ప్రమాదాత్పాణినిం స్మరేత్। అథవా ఫణినామీశం చింతయేద్బహుశో బుధః॥ అత్ర శ్లోకే సంస్కృతభాషాయామితి జ్యంతపదాధ్యాహారేణ పదప్రయోజనా. శ్లో॥ ప్రాకృతేషడ్విధే చాపి వాల్మీకిం వా మహేశ్వరం। ధ్యాయేదత్రతు మామేవ స్మరేత్పండితసత్తమ ఇతి.

తా అధర్వణాచార్యులుచెప్పెను. తనమాటలయందుపొరబాటు వలన నపశబ్దమువచ్చిన సంస్కృతభాషయందుఁ బాణిన్యాచార్యుని స్మరించవలయును. లేదా పతంజలిని స్మరించవలెను. [ఈశ్లోకములో సంస్కృతభాషాయాం అని సప్తమ్యంతపదమును అధ్యాహారముచేసి పదములు యోచించుకొనవలెను.] ఆఱుదెఱఁగులుగల ప్రాకృతభాషయందపశబ్దము తటస్థించిన వాల్మీకినిగాని మహేశ్వరునిగాని స్మరించవలెను- ఈయాంధ్రభాషయందు అపశబ్దము వచ్చినయెడఁ బండితుఁడగువాఁడు నన్ను [అధర్వణాచార్యుని] స్మరించవలెను- అని.

వ్యా- నవాచ్యం కవిప్రియుక్తమేవపదం ప్రయుంజానైః కవిభిరేవ అసాధుప్రయోగః పరిహ్రియత ఇతి శాస్త్రస్య ప్రయోజన మదృష్టమితి క్వచిత్ప్రయుక్తేష్వపి స్ఖలనదర్శనాత్ అయం సాధురయమసాధురితి విభాగే అశాస్త్రజ్ఞస్యా సమర్థత్వాత్- అతఏవోక్తం దండినా- గుణదోషావశాస్త్రజ్ఞః కథం విభజతేనరః- కిమంధస్యాధికారోస్తి రూపభేదోపలబ్ధిష్వితి-

తా- పూర్వకవులు ప్రయోగించిన పదమునే ప్రయోగించుచున్న కవులచేతనే అసాధుశబ్దప్రయోగము పరిహరించఁబడుచున్నది- కావున శాస్త్రమునకుఁ బ్రయోజనము కనబడదని చెప్పఁదగినదికాదు. ఒకానొకచోఁ బ్రయోగించిన పదములయందుఁగూడ బొరపాటులు కనపడుచుండునుకదా- ఇది సాధుశబ్దము, ఇది యసాధుశబ్దము అని విభజించుటయందు శాస్త్రజ్ఞుఁడు కానివాఁడు సమర్థుఁడు కాఁడు. కనుకనే దండిచెప్పినాఁడు. గుణదోషములను శాస్త్రజ్ఞుఁడు కాని మనుష్యుఁడు ఎట్లుగా విభజించును- గ్రుడ్డివానికి రూపభేదములను తెలుసుకొనునట్టిశక్తికలదా! అని-

వ్యా- ఏవంచ అనాంధ్రాపశబ్దస్యైవ అస్యాపి కవిప్రయోగాన ర్హత్వాత్ప్రయుక్తం నాపశబ్దత్వం- తస్య చండాలయవనాదౌ ఖిలియోగకథనాత్ప్రయోగానర్హతే నాపభ్రంశత్వమస్తు- ఏతద్భాషాయాస్తు

శిష్టపరిగృహీతత్వేన నతాదృశ మపభ్రంశత్వం కింతు గ్రామ్యత్వేనా పభ్రంశత్వంస్యాత్ - తత్తునియమేననివార్యతఇతి-

తా- ఈలాగుననుండఁగా నాంధ్రమందుగాని యపశబ్దమునకు వలె దీనికిని కవీశ్వరులు ప్రయోగించఁగగదను అపభ్రంశత్వము లేదు- ఆయపభ్రంశము చండాలులు, యవనులు మొదలైనవారియందు విని యోగించుటవలన [అనఁగా వారు వాడుటవలన] ప్రయోగమునకు అర్హమైనది కాకపోవుట చేత నపభ్రంశత్వము ఉండుగాక- ఈభాష కయితే శిష్టులు పరిగ్రహించుటచేతను, అట్టి యపభ్రంశత్వము లేదు- మఱియేమంటే గ్రామ్యత్వముచేతనైన అపభ్రంశత్వముండును- అది శాస్త్రనియమముచేత నివారించఁబడుచున్నది-

వ్యా- అతఏవాథర్వణేనోక్తం- శ్లో॥ సమ్మూలకత్వాద్రూఢత్వా ద్గృహీతత్వాచ్చసాధుభిః । నాపభ్రంశత్వమేతస్యాన్నియమాభావత స్తుతత్ । నివారణాయతస్యైవ ప్రవృత్తిర్వఃదుషామభూత్ । తదర మేవహివయం భూయసాశ్రయతామహే । కవితోపశ్రుతందోషం నైవకించిత్సహామహే॥ ఇతి.

తా- కావుననే అథర్వణాచార్యులుచెప్పినాఁడు- ఈభాషనుంచి మొదలుగలదగుటవలన, దేశమందు రూఢమైయుండగుటవలన, యోగ్యులు గ్రహించినదగుటవలన నపభ్రంశదోషములేదు- ఆయపభ్రంశదోషము శాస్త్రనియమములేకపోవుటవలనఁ గలుగును- దానిని నివారించుటకై విద్వాంసులకుఁ బ్రయత్నము- దానికోసమే మేమును మిక్కిలి ప్రయత్నముచేయుచున్నారము- కవిత్వమందువినఁబడినదోషము కొద్దిదైనను సహించము అని-

వ్యా- ననుసంస్కృతప్రాకృత వ్యాకరణయోరార్షత్వేన భవతి ప్రామాణ్యం- నన్నాదిథర్వణయోరిదానీంతన కవిమాత్రత్వేన కథం తత్ప్రణీతయోర్వ్యాకరణయోః ప్రామాణ్యంస్యాత్, కథన్నుతదను సారేణ కావ్యనిబంధనంభవేత్- కించానుశాసనస్య యదానీంతన త్వేన కుతస్తరాం ప్రాచీనాఃకవయః కావ్యనిర్మాణే ప్రావర్తంత-

ఇతిచేత్ మైవం మమస్థాః- నాన్రుషిః కావ్యకరణచాతుర్యధుర్యత్వం సంభవత్యేవఖలు- 'నానృషిఃకురుతే కావ్యం' ఇత్యభియుక్తోక్తేః- అనితరకవిసాధారణవ్యాకరణనిర్మాణ పటుతయా పండితకవీంద్రప్రథమగణ్యత్వేనచ పరిప్రాప్తం సార్వజ్ఞ్యంతయో రధునాతనత్వమాత్రేణకథం నివార్యేత-

తా- అయ్యా! సంస్కృతప్రాకృతవ్యాకరణములు ఋషులచేఁ జేయఁబడినవగుటచే వానికిఁ బ్రమాణత్వము కలుగు మన్నది- నన్నన్న, అథర్వణుఁడు, నిప్పటివారగు సామాన్యకవులగుటచే వారిచేఁ జేయఁబడిన వ్యాకరణములకు బ్రమాణత్వమెట్లు కలుగును? మఱియు వ్యాకరణగ్రంథము ఇప్పటిదగుటచేత ప్రాచీనకవులు కావ్యము చేయుటయందు ఎట్లుప్రవర్తించిరి? అంటివా- ఈలాగనుకొనవలదు- ఋషి కానివానికి కావ్యనిర్మాణమందు చాతుర్యమే సంభవించదుగదా- ఏమన్న 'నానృషిఃకురుతే కావ్యం' [ఋషి కానివాఁడు కావ్యమును జేయలేడు-] అని పెద్దలుచెప్పుటవలన ఇతరకవులెవరును చేయలేని వ్యాకరణము యొక్క చేయుటయందు శక్తికలుగుటచేతను, పండితులయందుఁ గవీశ్వరులయందును ముందుగ లెక్కించఁదగినవారగుటచేతను, ఆనన్నయాథర్వణులకుఁ గలిగిన సర్వజ్ఞత్వము, ఇప్పటివారైనంతమాత్రముచేత నెట్లుగా నడ్డుకోఁబడును?

వ్యా- అతఏవ "బ్రహ్మాదేవానాంపదవీఃకవీనా" మిత్యుపనిషదే వచనేందజ్ఞస్య ఋషిష్వైశ్వరభూతిసత్తా ప్రతిపాదితా- కించ యదితయోరసాధారణవైదుష్యం నస్యాత్తర్హి వాగనుశాసకవితామూలకం చనామ్నా వ్యవహారఃకుతస్సిద్ధ్యేత్ కథంనామతద్వచనం పాణినాం వచనమివాభియుక్త సముదాయగ్రాహ్యంస్యాత్ తద గ్రాధమాభియుక్తకావ్యాని తద్వచనానుసారీణిభవేయుః-

తా- కనుకనే "బ్రహ్మదేవానాం" అనుపనిషద్వా
జ్ఞునికి విశేషించి యీశ్వరైశ్వర్యముకలుగుట చెప
యువారి కిరువురకి సర్వసాధారణముగాని విద్వత్త

వాగనుశాసనులు, కవితామూలకందము, అను పేరిచే వ్యవహారము ఎట్లుసిదించును మఱియు వారివాక్యము పాణినిమొదలగువారి వాక్యమువలె పండితసముదాయముచేత నెట్లుగ్రహింపతగ్గదియగును వారి వాక్యము గ్రహించదగనిదేయైనయెడల గొప్పవారికావ్యములు వారి వాక్యములననుసరించిన వెట్లులగును

వ్యా- నచ వ్యాకరణస్యేదానీం తత్త్వమేవయేనవా ప్రాచీన ప్రబంధ్కృతాం కావ్యనిర్మాణే ప్రవృత్తిర్న స్యాత్ కింతు ప్రాగిస్య నుశాసనస్యసత్త్వాత్ అత ఏవశబ్దశాసనేన ‹‹క్రియాణాంమబ్రూప్రాచాం। దుజ్జేత్య స్యేవిదుః కేచిత్ ' ఇత్యాదిసూత్రైర్బహవః ప్రాచీనాచార్యాః ప్రకాశితాః ఆథర్వణగ్రంథేపిబహవః పురాతనాంధ్రశిక్షుకాః కవిశిఖామణ్యాదయః, కథితాః యథాపాణినీయే ‹‹లోప శ్శాకల్యస్య, ఋతో భారద్వాజస్య, గురోరనృతోనంత్యస్యాప్యేకైకస్య ప్రాచాం,'' ఇత్యాదౌ తత్తత్ప్రథమ ప్రవక్తృత్వవ్యపదేశస్తుఖిల కవితానుశాసనయోజనాపేక్ష ఇతిజ్ఞేయం

తా- వ్యాకరణము ఈకాలపుదేని నీయెడల ప్రాచీనులగు ప్రబంధకర్తలుకావ్యములు నిర్మించుటయందు ప్రవృత్తిలేకపోవును కావున వ్యాకరణము ఇప్పటిదనవల్లలేదు- మరియేమంటే పూర్వమందువ్యాకరణమున్నది కనుకనే శబ్దానుశాసనుఁడు సూత్రములయందు ‹‹ప్రాచాం'' అని ‹‹అన్యే'' అని ‹కేచిత్' అని ఈమొదలగునవి సూత్రములయందుఁబ్రాచీనులైన ఆచార్యులనేకులనుఁబ్రకటించెను- అథర్వణునిగ్రంథమందును బ్రాచీనులగు ఆంధ్రశిక్షాకర్తలయిన కవిశిఖామణిమొదలగు ననేకులుచెప్పఁబడిరి- పాణినీయవ్యాకరణమందు శాకల్యస్య భారద్వాజస్యప్రాచాం, అని యీమొదలగుచోట్లనువలెనే మఱికొందఱువ్యాకరణకర్తలు ముందుగలరనిచెప్పుటయునుమిష పూర్వమ్మందుండునిట్టి శాస్త్రములు చెడిపోయినవని తెలుపుడిచేయుచున్నదని తెలియవలెను-

వ్యా. నను! ఉతత్వః పశ్యన్నదదర్శవాచముతత్వ శ్శృణ్వన్నశృణోత్యేనాం ఉతోత్వస్మై తన్వాంవిసస్రేజాయేవపత్య ఉశతీసువాసా ఇతి మంత్రేపూర్వార్ధే శబ్దానభిజ్ఞనిందా ఉత్తరార్ధే తదభిజ్ఞప్రశంసాచక్రియతే. త్వః కశ్చిద్వాచంపశ్యన్నపి తపశ్యన్నేవనతదర్శ కశ్చిదేనాం శృణ్వన్నపి నశృణోతి ఉశతీకామయమానా సువాసాజాయాపత్య ఇవవాక్ త్వస్మై క్వచిత్ తన్వాంస్వతనుంవిసస్రఉతో వివృణోత్యేవేత్యర్థానుగతేః ఏవమాదిశ్రుతీనాం, ఏకశ్శబ్దస్సమ్యగ్జ్ఞాతస్సుష్ఠుప్రయుక్తస్స్వర్గే లోకే కామధుగ్భవతీత్యాది స్మృతీనాంఛర్మాధర్మఫలక సుశబ్దాపశబ్ద ప్రయోగ స్తుతినిందా పరాణాం విద్యమానత్వాత్ - శబ్దసాధుత్వాసాధుత్వవివేచనపరంసంస్కృతవ్యాకరణం సమూలశ్రుతి కమితిప్రామాణ్య మశ్నుయాత్. ఏతద్వ్యాకరణస్య మ్లేచ్ఛప్రతి పాదితత్వేకథం మూలశ్రుతిస్స్యాత్. కథంతరాంతదభావేప్రామాణముపపన్నంస్యాత్ - నచన్యాయవైశేషికయోరివతదభావేపి ప్రామాణ్యమితివాచ్యం- పదవాక్య ప్రచారస్యస్వాధ్యాయోధ్యేతవ్య ఇత్యధ్యయన విధ్యధీనత్వాద్వ్యధాసమూలత్వం తద్వ్యుత్పాదకవి చారస్యాపి తదధీనత్వమేవేపి తదాత్మతయో స్తయోరపి సమూలత్వంనిర్విచికిత్సకమేవ- అతఏవై తద్వ్యాకరణస్యాధ్యయనవిధ్యధీనత్వాభావేనసమూలత్వా భావాత్ప్రామాణ్యం నసంభవత్యేవేతిచేత్. నైవం.

తా- ఓయన్యా! 'ఉతత్వః' అను మంత్రముందు పూర్వార్ధమందు శబ్దము తెలియనివాని నిందయు నుత్తరార్ధమందు శబ్దము తెలిసినవాని స్తోత్రమును జేయఁబడుచున్నది- (శ్రుత్యర్థము) త్వః=ఒకానొకఁడు- వాచం=వాక్యమును- పశ్యన్నపి=చూచుచున్నవాఁడయ్యు, నదదర్శ=చూడఁడు- త్వం=ఒకానొకఁడు, ఏనాం=ఈ వాక్యమును, శృణ్వన్నపి=వినుచున్నవాఁడయ్యు, నశ్రుణోతి=వినఁడు- ఉశతీ=కోరుచున్న, సువాసాః=భార్య, పత్యఇవ=పెనిమిటికొఱకువలె, వాక్=వాక్యం- త్వస్మై=ఒకానొకనికొఱకు.

తన్వాం=తనశరీరమును, విసస్రస ఉతో=వివరణచేయుచున్నదే అనుసరమువలన నీమొదలగు శ్రుతులును, ఒకశబ్దము సుష్ఠుగాఁదెలియఁబడ్డదియై సుష్ఠుగాఁబ్రయోగించఁబడినదియై స్వర్గలోకమందుఁగామములను నిండించునది యగుచున్నది యను స్మృతులును, ధర్మఫలముగల సుశబ్దప్రయోగముయొక్క స్తుతియందు అధర్మముఫలముగల అపశబ్దముయొక్క నిందయందును ప్రధానముగలవై యున్నవగుటవలన శబ్దములయొక్క సాధుత్వమును, అసాధుత్వమును విభజించుట ప్రధానముగల సంస్కృతవ్యాకరణము మూలప్రమాణము కలదికావున ప్రామాణ్యమును పొందుఁగాక- ఈయాంధ్రవ్యాకరణమునకు మ్లేచ్ఛునిచేఁ జెప్పఁబడుట గలుగుచుండఁగా మూలముయొక్క వునికి యెట్లులవును. ఆమూలముయొక్క వునికిలేకపోవుట వలనఁ బ్రామాణ్యముబొత్తుగానే యెట్లుగలుగును? న్యాయవైశేషిక శాస్త్రములకువలె మూలశ్రుతి లేకపోయినను ప్రమాణత్వముకలదని చెప్పఁ దగదు- స్వాధ్యాయము చదువఁదగినది అనువిధివలననే పదవాక్యార్థములయొక్క ప్రచారము అధ్యయనవిధికి అధీనమయినదగుటవలననే ప్రకారముగా మూలశ్రుతి కలుగుటసంభవించెనో ఆలాగుపదార్థవిచారము కూడదాని యధీనమయినదే- కావునపదార్థవిచారస్వరూపములయినఆ న్యాయవైశేషికశాస్త్రములకునుమూలశ్రుతిసందేహములేనిదే- కనుకనే యీవ్యాకరణము అధ్యయనవిధ్యధీన మయినది కాకపోవుటచేత మూలశ్రుతిలేదుగావున ప్రామాణ్యముసంభవించదు- అన్నట్టయితే, అట్లుకాదు.

వ్యా. ప్రాకృతాంధ్రయో ర్నాస్త్యేవమ్లేచ్ఛత్వ మన్యదేశ భాషావదిత్యుక్తం- తథాచాస్యాపి మూలశ్రుతిసద్భావః నూపపాద ఏవ- కావ్యవిషయధర్మాధర్మ ఫలక సుశబ్దాపశబ్దప్రయోగావలంబ స్తుతి నిందయో రభియుక్తపరంపరయా ప్రతిపాదితత్వాత్- నచాపశబ్దనిషేధశ్రుతివిరోధః- తస్యక్రతుమాత్రవిషయత్వేన నియత్వ మిత్యుక్త

త్వాత్- నన్వేవమపి హేలాధికరణం విరుధ్యేదితిచేన్నైవం- తత్ర స్మృతీనాం సాధారణ్యేనాచార విధేయత్వాత్- నవిశేషవిషయ శ్రుతికల్పనాసంభవతి- శ్రుతికల్పనస్య స్మృత్యనుసారిత్వాత్- కించ హేలాధికరణం శబ్దప్రయోగాచార వ్యతిరిక్త వసంతోత్సవాద్యాచారవిషయకమేవేతి నతన్న్యాయోత్ర ప్రవర్తత ఇతి సువచం.

తా. ప్రాకృతాంధ్రభాషలకు నన్యదేశభాషలకువలె మ్లేచ్ఛత్వమే లేదని చెప్పఁబడినది కావున దీనికిని మూలశ్రుతికలుగుటను లెస్సగా నుపపాదింపవచ్చును. కావ్యమునందలిధర్మాధర్మములు ఫలముగల సుశబ్దాపశబ్దముల ప్రయోగమునుగురించి స్తోత్రమును నిందయు సాధుజనులసముదాయముచేఁ జెప్పఁబడినదగుటవలన అపశబ్దనిషేధమును జెప్పెడు శ్రుతికి విరోధమునులేదు ఆశ్రుతినిషేధము యజ్ఞమాత్రమందే యగుటచేత నియమించఁబడ్డది. అని చెప్పఁబడినది అయ్యా! ఈలాగయినను హేలాధికరణము విరోధించునన్నట్లయితే అట్లుకాదు అక్కడ స్మృతులు సామాన్యముగా నాచారములను జెప్పుచున్నవి. కావున విశేషవిషయమైన శ్రుతినిఁ గల్పించుట సంభవించదు. శ్రుతికల్పన స్మృతి ననుసరించినదిగదా. మఱియు హేలాధికరణము శబ్దప్రయోగాచారముకంటె వేరగు వసంతోత్సవాద్యాచారములు తెలుపునదికావున నాన్యాయము ఇచ్చట ప్రవర్తించదని లెస్సగాఁ జెప్పవచ్చును.

వ్యా. ననుదేశభాషా కావ్యస్య గ్రామ్యస్యాపి ప్రత్యవాయ జనకతాసంభావితేతిచేత్. నైవం. తథాత్వే నన్నయాథర్వణాపేక్షయా ప్రాచీనానాం తదనుశాసనే ప్రవృత్తానాం కవిభల్లటాదీనాం బహూనాం శిష్టానాం ప్రయాసస్య వైఫల్యాపత్తేర్ద్రవిడభాషానుశాసనే ప్రవృత్తస్య సర్వజ్ఞాగ్రచర స్యాగస్త్యమహామునేః ప్రాకృత వ్యాకరణనిర్మాణే ప్రయత్నవతో భగవతో వల్మీకసంభవ మహర్షిశిష్యామహేశ్చ సర్వజ్ఞత్వస్యాప్రయోజకత్వాపాతాచ్చచ్చలం.

తా. ఓయయ్యా! దేశభాషాకావ్యము గ్రామ్యముకానిదయ్యు ప్రత్యవాయము కలిగించుట యూహింపఁబడుచున్నది అన్న యెడ నట్లు కాదు. అలాగే యయినట్లయితే చిన్నయభట్టు అథర్వణాచార్యుల కంటెఁ బ్రాచీనులగు ఆంధ్రభాషాశాసనమందుఁ బ్రవర్తించుచున్న కవిభల్లటుఁడు మొదలగు ననేకమహాత్ములయొక్క ప్రయాసమునకు వ్యర్థత్వము సంభవించుటవలనను ద్రవిడభాషను శాసించుటయందుఁ బ్రవర్తించుచున్నట్టియుఁ, బరిజ్ఞాతలలో మొదటివాఁడయినట్టియు నగస్త్యమహామునియొక్కయుఁ, బ్రాకృతవ్యాకరణనిర్మాణమునందుఁ బ్రయత్నముగల భగవంతుఁడగు వాల్మీకిమహామునిశ్రేష్ఠునియొక్కయు సర్వజ్ఞత్వము ప్రయోజనశూన్యమయినదని చెప్పవలసివచ్చును. కావున నింక చాలును

వ్యా. వస్తుతస్తు వాఙ్మాత్రాను శాసనమాత్రస్య బ్రహ్మజన్యత్వమేవేత్యాంధ్రభాషా తదనుశాసనయో ర్బ్రహ్మకారణత్వమేవ. "యతో వా ఇమాని భూతాని జాయంతే, సోఽగ్భ్యఏవపురుషం సముద్ధృత్యామూర్ఛయత మభ్యవతత్తస్యాభితప్తస్యముఖం నిరభిద్యత యథా తస్ముఖాద్వాగ్వాగ్నేస్స యథా ఽర్ద్రైధాగ్నే రభ్యాహితస్య పృథగ్ధూమా వినిశ్చరంత్యేవం వా అరేస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదస్సామవేదో ఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదశ్శ్లోకాస్సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాన్యస్యైవ యేతాని సర్వాణి నిశ్వసితాని- జన్మాద్యస్య యతః. శాస్త్రయోనిత్వాత్, నలవస్తి వినాయత్స్యాన్మయా భూతం చరాచర మిత్యాదిక సూత్రాదికమత్రప్రమాణం.

తా. వాస్తవమువల్లనైతే ప్రతిశబ్దములయొక్క శాసనమంతయు బ్రహ్మవలనఁ గలిగినదే. కావున నాంధ్రభాషయు దానిశాసనమును గూడ బ్రహ్మవలనఁ గలిగినదే ఎవనివలన నీభూతములు పుట్టుచున్నవో అతఁడు ఉదకములవలనఁ బురుషునిఁగలిగించి యతనిచేతఁ బలికించె

ను. అతనిముఖమువిడెను. ఆముఖమువలన వాక్యములు, అగ్నియుఁ గలిగెను. అగ్ని మూఁడువిధములుగా నుంచఁబడి వేలుగాధూమాదికమును ఎట్లుప్రసరింపఁజేయునో అట్లుఆవాక్యములు ఈగొప్పపురుషుని యొక్కనిట్టూర్పువలనఁ బుట్టినవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము ఇతిహాసములు, పురాణములు, ఉపనిషత్తులు, శ్లోకములు, సూత్రములు, వ్యాఖ్యానములు, ఇవి యన్నియు నతనినిట్టూర్పులు- ఈప్రపంచమునకు జన్మాదికము ఎవనివలనఁగలుగునో (అట్టిబ్రహ్మ) శాస్త్రప్రమాణముకలవాఁడు- నాతో వినాగా చరాచరములయందొక భూతమునులేదు- అనునీమొదలగుసూత్రములు మొదలఁగునవి ఇందుకుఁబ్రమాణము.

వ్యా॥ అతఏవ బ్రహ్మమాయాశబలం, తదేవసర్వకార్యోపాదానం, తత్రప్రకృతిసత్తాకత్వాత్ప్రకృతేః పరిణామః. బ్రహ్మసమానసత్తాకత్వాద్బ్రహ్మణోవివర్తఃప్రపంచః. కారణసత్తాకోఽన్యథాభావః పరిణామః. తతసత్తాకోఽన్యథాభావో వివర్తఇతి వివర్తపరిణామయోర్భేద ఇత్యౌపనిషదః పంథాః ఏవంచ వ్యాసాదీనామివ శబ్దానుశాసనాదీనామపి హేతుత్వమాత్రమేవేతి నాస్య వ్యాకరణస్య వ్యావహారికా ప్రామాణ్యశంకాంకురస్యాపి ప్రసక్తిరిత్యలంవైస్తృత్యేన.

తా. కావుననే మాయతోఁగూడిన బ్రహ్మ సర్వకార్యములకు సమవాయకారణము. అందు ప్రకృతిగల్గుటవలనఁ బ్రకృతికి బరిణామము, బ్రహ్మతో సమానమగు నునికి గలుగుటవలన బ్రహ్మకు వివర్తమును ప్రపంచము. కారణముయొక్కయునికిగల మారుపుపరిణామము. అదిలేనిమారుపు వివర్తము. అని వివర్తపరిణామములకు భేదము. అని ఉపనిషన్మార్గము. కావున వ్యాసాదులకువలెనే నన్నాదులకును హేతుత్వమాత్రముగలదు. కాఁబట్టి ఇది వ్యాకరణమునకు వ్యవహారసంబంధమయిన యప్రమాణత్వముకలదను శంకాలేశమయినను లేదు. ఇఁక విస్తారముచాలును.

వ్యా. ప్రకృతమనుసరామః. ఆలంకారికాస్తు శబ్దార్థయోర్గ్రామ్యత్వమన్యథోచుః. తదుక్తం దండ్యాచార్యేణ. ' కామం సర్వోప్యలంకారో రసమర్థే నిషించతు । తథాప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా । కన్యే కామయమానం మాం త్వం న కామయసే కథం । ఇతి గ్రామ్యోయమర్థాత్మా వైరస్యాయైవ కల్పతే । కామం కందర్పచండాలో మయి వామాక్షి నిర్దయః । త్వయి నిర్మత్సరో దిష్ట్యేత్యగ్రామ్యోర్థో రసావహః । శబ్దేపి గ్రామ్యతాస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్ । యథా యకారాదిపదం రత్యుత్సవనిరూపణే । పదబంధానువృత్త్యా వా వాక్యార్థత్వేన వా పునః । దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యా భవతః ప్రియా । ఖరం ప్రహృత్య విశ్రాంతః పురుషో వీర్యవానితి ॥ ఏవమాదీని శంసంతి మార్గయోరుభయోరపి । భగినీభగవత్యాదిసర్వత్రైవానుగమ్యతే " ఇతి. ఉభయోర్మార్గయోర్గౌడీవైదర్భీమార్గయోరిత్యర్థః. శ్లో॥ పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయత ఇతి గ్రామ్యపదస్య లక్షణముక్త్వా గల్లాదయశ్శబ్దా గ్రామ్యా ఇత్యూచుః. కేచిద్గల్లశబ్దో గండపర్యాయత్వేన ప్రయుజ్యత ఇత్యేకే. ప్రాకృతవ్యాకరణనిష్పన్నత్వేపి తస్యాద్యభాషామధ్యే ప్రయోగో గ్రామ్యత్వం జనయతీతి కేచిదాహుః.

తా. ప్రస్తుతమనుసరింతము- ఆలంకారికులు శబ్దార్థములయొక్క గ్రామ్యత్వమును మఱియొకరీతిం జెప్పిరి- అదియెట్లనినం దండ్యాచార్యులు చెప్పుచున్నాఁడు- సమస్తాలంకారములు అర్థమందు రసమును ప్రవహింపఁజేయుచున్నవి. అయినను గ్రామ్య దోషములేకపోవుటయే యీరసమును బ్రవహింపఁజేయుభాగమును దరుచుగ వహించుచున్నది- గ్రామ్యదోషమెట్టిదనఁగా— ఓచిన్నదానా నిన్ను గామించుచున్నన్ను నీవేల కామించవు- అనునిది గ్రామ్యము- ఇది విరసత్వము పుట్టించుచున్నది. ఓచిన్నదానా ఆమన్మథచండాలుఁడు నాయందు దయలేనివాఁడు- నీయందు ఏమియుఁగోపములేనివాఁడు అనునది గ్రామ్యముకానిది సరసముగనున్నది- శబ్దమందుఁగూడ సేర్ప

రులకంటె నీశ్వరులగువారుచ్చరించుటవలన గ్రామ్యత్వముకలదు. ఎట్లన్న పెనిమిటితో నుత్సవమును నిరూపించి చెప్పునపుడు యకారమాదియందుఁగల పదమును [అనఁగా యాభశబ్దమును] చెప్పుటయుపదసందర్భమువలనఁగాని వాక్యసంవర్భమువలనఁగాని హేయార్థమునుబుట్టించునదియు నెట్లన- యాభవతః ప్రియాయనుచోట యాభశబ్దము స్ఫురించుచున్నది- [యాభశబ్దమునకు మైథున మర్థము] ఇదియుఁబరాక్రమవంతుఁడగు పురుషుఁడు గాడిదెనుగొట్టి పరాక్రమమునుజూపెను- అనునదియునీమొదలగునవి, గౌడి, వైదర్భి మార్గములయందు గ్రామ్యదోషములని చెప్పుచున్నారు. భగిని, భగవతి, మొదలగుశబ్దములు సర్వత్రప్రయోగింపఁబడుచున్నవి. [అనఁగా, భగము కలదియను హేయార్థమునిచ్చిన నీశబ్దములు సార్వత్రిక ప్రయోగము కలుగుటచే నింగించఁబడవు] పామరులు మొదగువారుప్రయోగించు పదమేదిగలదో అదిగ్రామ్యమని గ్రామ్యపదముల లక్షణములు చెప్పి గల్లాదిశబ్దములు గ్రామ్యములనిచెప్పిరి- కొందఱు గల్లశబ్దము చెక్కిలికిఁబేరగుటచేఁ బ్రయోగించఁబడుచున్నదనిచెప్పుచున్నారు- ప్రాకృతవ్యాకరణముచె నిష్పన్నమయినను ఆగల్లశబ్దములకుసంస్కృత భాషామధ్యమందుఁ బ్రయోగముగ్రామ్యమని కొందఱు చెప్పుచున్నారు.

సూ. ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషాతయోర్భవే
ద్వికృతి। కేవలతయాను సర్వత్ర్యభేచ యేయం
యథాతథంభాషా.

వ్యా. సర్వభాషామూలకత్వేన ఆంధ్రభాషా హేతుత్వేనచ ఆద్యే సంస్కృతభాషా షడ్విధప్రాకృతిభాషాచోభే ఆద్యఃప్రకృతిః- ప్రకృతిరితి- క్రిమాదుచ్యేతే- ఆద్యాచసాప్రకృతిశ్చ ఆద్యప్రకృతిః- సంస్కృతభాషా తస్యాస్సకలభాషా నిదానత్వాత్ అతఏ

వ శాస్త్రిమపౌరుషమాద్యంప్రాలంబకనిత్యప్రయోగలక్ష్యే తతుద్భ్వస్యా
మతిసవిరంయజ్ఞాత్వాశబ్దాః ప్రయుక్త ఆగ్నసమఇతి- క్వచిత్పుస్తకేసరస్వ
తీ కవికరలిఖితఏవ శబ్దానుశాసనప్రణీతత్వేన పద్యంస్థితం- ఆగ్నస
మః- వైదికశబ్దతుల్యాః ప్రామాణికఇతి యావత్- శేషంసుగము-
తతో౽న్యద్రమాద్యప్రకృతిరితినామ- ప్రికృతిరిత్యాఖ్యాప్యప్వారాసం
స్కృతాపేక్షయాశుద్ధప్రికృత్యాః- శౌరసేన్యాదీనాంప్రాకృతాపే
క్షయావికృతత్వేప్యాంధ్రాపేక్షయాషడ్విధాప్రాకృత్యాః- ప్రకృతి
త్వంసభవత్యేవ- ఆంధ్రభాషాయా అపిద్వైధానుసారిత్వాత్ -

తా- అన్నిభాషలకు మూలమయినదగుటచేత నాంధ్రభాషకుహే
తువైనదగుటచేతను మొదటిదగు సంస్కృతము నాఱువిధములగుప్రా
కృతము అను నీరెండును ఆద్యప్రకృతియనియుఁ బ్రకృతియనియుఁ
గ్రమముగాఁ జెప్పఁబడుచున్నవి. మొదటిదియగు ప్రకృతి- [కార
ణము] గావున నాద్యప్రకృతి [అనఁగా సంస్కృతము] అది సమస్త
భాషలకు నాదికారణముగదా-

కావుననే [ఏశాస్త్రమును తెలిసి ప్రయోగించఁబడినశబ్దము వేదశ
బ్దముతో సమానమగునో అట్టిశాస్త్రము పురుషులచేతఁ జేయఁబడనిది
యు, మొదటిదియుఁ దరుచగు నిత్యప్రయోగములు చిహ్నముగలది
యు మిక్కిలివిస్తరించినదియునై చూడఁదగినది] అనునీపద్యము బా
లసరస్వతికవి తనచేతితో వ్రాసినయొకానొక పుస్తకమందున్నయ
భట్టుచేసినట్టుగా వ్రాయఁబడియున్నది ఆహేతువువలన నాద్యప్ర
కృతియనుపేరుసార్థకమయినది ప్రకృతియనుపేరుకూడ సంస్కృతి
ద్వారా శుద్ధప్రాకృతమయినభాషకు సార్థకమయినదే శౌరసేని
మొదలగుభాషలు ప్రాకృతద్వారా వికృతములయ్యును నాంధ్రిద్వా
రా ఆఱువిధములగు ప్రాకృతభాషవలనఁ బుట్టినవగుటచే నిదిప్రకృ
తియనుటసంభవించుచున్నది. ఆంధ్రిభాష కూడ రెండువిధముల అ
నఁగా సంస్కృతప్రాకృతములవలనఁబుట్టినదై ప్రవర్తించుచున్నదిగదా.

వ్యా. ఏపాతయోర్వికృతిః ఏషా ఆంధ్రభాషాతయోరాద్యప్రకృతిప్రకృత్యోః వికృతిర్భవతి. ఉభయానుసారిత్వేన ఉభయవిలక్షణత్వేనచ ఉభయాపేక్షయా వికృతిత్వం. వికృతిత్వవ్యపదేశాత్ ప్రకృతివద్వికృతిరితిన్యాయేనానుక్తస్య కార్యస్యాత్రతాభ్యాంప్రాప్తిరిత్యాచార్యాశయః, తేనహలంత్యం "సానునాశికోచ్చారంజిత్" ఇత్యాదికార్యంప్రవర్తతే. ఇమమర్థంసూచయితుమేవ ఉత్తరత్రతత్రత్రనుమ్ సుసాదివ్యవహారోపిలభ్యత ఇతిజ్ఞేయం.

తా॥ ఈయాంధ్రభాషయైతే ఆయాద్యప్రకృతిప్రకృతులయొక్క వికారమగుచున్నది ఆరెండింటినసరించుటచేతను, రెండింటికంటెవిలక్షణమయినదగుటచేతను రెండింటిద్వారా వికృతియాట. వికృతియనివ్యవహరించుటవలన "వికృతిప్రకృతివలెనగుచున్నది" అనున్యాయముచేత నిందుఁజెప్పఁబడనికార్యము ఆరెండిటివలన ప్రాప్తించును. అని ఆచార్యునియభిప్రాయము. ఆహేతువుచేత హలంత్యం ఇత్యాదికార్యము దీనియందుఁబ్రవర్తించుచున్నది. ఈయర్థమునుసూచనచేయుటకే ముందుముందక్కడక్కడనుమ్ సున్ మొదలగువ్యవహారము పొందఁబడుచున్నదని తెలియఁదగినది.

వ్యా. అతఏవోక్తంద్వితీయాచార్యేణ ఆద్యా మహార్ఘాసామూలం సర్వస్యేతినిగద్యతే। తదనుక్తస్యకార్యస్య వక్తాభవతిపాణిః' రితి. అనుశిష్టవికృతిత్వనిర్వాహార్థముత్తరార్థం. కేవలతయేతి. కేవలతయా ప్రాధాన్యేనయథాతథంయథేచ్ఛం యేయంభాషావికృతిత్వేనప్రసిద్ధాసా భాషాఉభేచ. ఆద్యేత్యత్ర సమాదిభిరనుసర్వత్యనువర్తతే.

తా. కనుకనే ద్వితీయాచార్యుఁడు 'మొదటిదియగు సంస్కృతము మిక్కిలి పూజ్యమైనది. సమస్తభాషకు మూలమైనది అని చెప్పఁబడుచున్నది. దానియందుఁ జెప్పఁబడిన కార్యమును పాణిని చెప్పఁగలఁడు.' అనిచెప్పియున్నాఁడు- ఈచెప్పిన వికృతిత్వమును నిర్వహించుటకై సూత్రశ్లోకమందలి యుత్తరార్థము చెప్పఁబడినది.

కేవలతయా వేరగుటచేతను "యథాతథం=స్వేచ్ఛగా, యేయంభాషా=విక్కృతియని ప్రసిద్ధిపొందిన యేయీయాంధ్రభాషగలదో, సా= అది, ఉభేచ=రెండయినసంస్కృతప్రాకృతములను తత్సమాదులచేతను అనుసర్పతిః=అనుసరించుచున్నది.

వ్యా. నచాత్రేదంశబ్దస్తచ్ఛబ్దార్థమభిదధాతి. శ్లో॥ కరవాలకరాళదోస్సహాయో యుధియో సౌవిజయార్జునైకమల్లః। యదిభూపతినానతత్ర కార్యే వినియుజ్యేత తతః కృతంకృతంస్యాదిత్యాది కవిప్రయోగవిరోధాత్. నచ, శ్లో॥ యోవికల్పమిదమర్థమండలం, పశ్యతీశనిఖిలంభవద్వపుః। స్వాత్మపక్షపరిపూరితేజగత్యస్యనిత్యసుఖినఃకుతోభయమిత్యాదావివవాక్యభేదః యోనతత్తదర్థమభిదధ్యాత్. తతోయచ్ఛబ్దనికటస్థితఇదంశబ్దః ప్రసిద్ధింపరామృశతి. ఏతచ్చకావ్య ప్రకాశే స్పష్టం.

తా. ఇదంశబ్దముతచ్ఛబ్దార్థమును జెప్పునది కాదు. ఏమనిన "యుద్ధమందు కత్తిచేత భయంకరమైన భుజముసహాయముగలయే యీవిజయార్జునమల్లుఁడుగలఁడో అతఁడు రాజుచేత కార్యమందు అజ్ఞాపించఁబడెనేని తరువాత కార్యముచేయఁబడినది అగును" అనియీ మొదలగు కవిప్రయోగవిరోధముకలుగును. మఱియు "ఓయీశ్వరుఁడా! ఎవఁడునిర్వికల్పమైన యీయర్థమండలరూపమగు నీశరీరముం జూచుచున్నాఁడో అట్టి సుఖవంతునికిఁదనపక్షముచేనిండించఁబడిన జగత్తునందు భయమెట్లుకల్గును" అనునీ మొదలగుదానియందువలె వాక్యభేదమును కాదు, అట్టివాక్యభేదముచేసినయెడల అది యాయర్థముం జెప్పదు. కావున యచ్ఛబ్దమునకు సమీపమందున్న ఇదంశబ్దము ప్రసిద్ధిని చెప్పుచున్నది. ఇదియుఁగావ్యప్రకాశమందు స్పష్టముగానున్నది.

వ్యా. అనుసరణప్రకారస్త్వేవం. చంద్రుఁడు, వనము, ధనము ముఖము, ఇత్యాద్యాస్సంస్కృతసమాః. చందురుఁడు, సంద్రము,

న్యేత్యాదీనాం హ్రస్వ ఏవసాధుత్వం లోకపాలాదిశబ్దానాం రాదేశ ఏవ జసస్సాధుత్వం ఇత్యేవమాదౌ సంస్కారార్థో నియమః- ప్రత్యయాదేశానాం లోకసిద్ధత్వేపి వ్యవస్థా శాస్త్రేణక్రియతే- బహ్వాంధ్రస్యాపి సంస్కృతేనసమాసే ప్రాప్తే సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతీతి శాస్త్రేణ వ్యవస్థాక్రియతే- అన్యథా బహ్వాంధ్రస్య సంస్కృతేన సమాసే సంస్కృతస్యాప్యాంధ్రేణచ సమాసేవా కోవానివారయితా భవేత్- అతస్సంస్కారార్థత్వేననియమ ఆవస్యక ఇతి సిద్ధం.

తా. నియమమనఁగా లక్షణము. అదిశబ్దశుద్ధిప్రయోజనముకలది. [అనఁగా లక్షణమువలన శబ్దశుద్ధిగలుగుననుట] వనముకు, రాముకు, అని యీమొదలగు ప్రయోగములు తటసించుచుండఁగా కు, పరముగునప్పుడు నకారాగమమువచ్చునను శాస్త్రముచేత నకారమునువిధించుట పూర్వముగలుగునట్టుగా శబ్దముసంస్కరించబడుచున్నది. అందుచేవనమునకు, రామునకు, అనునీ మొదలగుప్రయోగము సాధువు. జనని. కన్య అనునీ మొదలగుశబ్దములకు హ్రస్వత్వముగలుగుచుండఁగానే సాధుత్వము లోకపాలాదిశబ్దములకు ప్రథమా బహువచనమునకు రు, అనునాదేశముకలుగుచుండఁగనే సాధుత్వము ఈమొదలగుస్థలములయందు శాస్త్రము సంస్కారముకొఱకైయున్నది. ప్రత్యయములు, ఆదేశములు, మొదలగునవిలోకసిద్ధములైనవైనను, శాస్త్రముహద్దును చేయుచున్నది. అనేకములైన యాంధ్రపదములకు సంస్కృతముతో సమాసముప్రాప్తించఁగా "సంస్కృతపదముతో పరిమితమైన ఆంధ్రపదము కర్మధారయసమాసము" అని శాస్త్రముచేత హద్దుచేయఁబడుచున్నది. అట్లుగానిచో అపరిమితములగు నాంధ్రపదములకు సంస్కృతముతో సమాసముగలుగుచుండఁగా సంస్కృతమునకుం గూడ నాంధ్రముతో సమాసము గలుగుచుండఁగానైన నెవ్వఁడుమాన్పను కావున శాస్త్రముసంస్కారమునిమిత్తమై అవస్యముగానుండవలసినదని సిద్ధించుచున్నది.

హితో వ్యాకరణేఽక్షఇతిసూత్రస్యఛాదేశవిధాయకస్యైవప్రకృతత్వాత్. చ్ఛాదేశవిధాయకస్యాశ్రుతత్వాచ్చ అధర్వణేన॥ శ్లో॥ వర్ణలోపాగమాద్యైకే సర్వస్మిం స్తద్భవేపదే ఇత్యుక్త్వా పునస్స్పష్టార్థం॥

శ్లో॥ స్వభిన్నత్వాయుక్తవర్ణలోపాదేశాగమాస్తథా। తద్భవేసంస్కృతీయే స్వరాదేశాద్యాస్తదన్యతః। స్యాద్వర్ణస్య వ్యత్యయశ్చ కృతశ్చిత్క్వచిత్సమ్మత ఇత్యుక్తం. యుక్తస్యాస్య సంయుక్తవర్ణస్యేత్యర్థః. లోపః సతిఇత్యాదౌ పకారాదీనాం ఆదేశాః ప్రాణరూపాః ప్రాణిరూపాశ్చ చందమామేత్యాదౌద్రష్టవ్యాః. ఆగమాశ్చోభయవిధాః. తెచ, దేవర, చందురుఁడిత్యాదౌ జ్ఞేయాః. తదన్యతః. సంస్కృతప్రాకృతతద్భవవ్యతిరిక్తే ప్రాకృతాదితద్భవ ఇత్యర్థః. ఆదేశాద్యా ఇతి శుద్ధాంధ్రసంబంధిన శ్ఛకార ఖకారాదీనాం చకార కకారాద్యా ఆదేశాః. తేచ లచ్చి, లచ్చనము, కంబము ఇత్యాదౌజ్ఞేయాః. ఆదిశబ్దేన లోపాగమా. తాచ, జక్కులు, మూగేత్యాదౌ జ్ఞేయా. జక్కులు ఇత్యాది జిహ్వామూలీయస్య లోపఃక్షఃక ఇతి మాగధీసూత్రాత్. కేచిత్తుప్రాకృత తద్భవత్వం మేనిశే. పేరించెనిత్యాదౌ ప్రేరేచెనిత్యాకారవ్యత్యయః. అత్ర ఇకారస్యైకారాదేశ స్తద్భవమూలక ఇతిజ్ఞేయం. ఏవమన్యేపి పెరిమాదిశబ్దాజ్ఞేయాః.

తా. మఱియు లచ్చి అనుచో "మనయాం" అను సూత్రముచేత మకారమునకులోపము చేయఁగా "క్షః" అను సూత్రముచేత మిగిలినదానికి చ్ఛకారాదేశము అని అప్పకవి చెప్పెను. అదియు అపరిశీలనమువలనఁ గలిగినదే. ఛకారాదేశము ప్రాకృతవ్యాకరణమందు విధించఁబడినది. "క్షః" అను సూత్రము ఛకారాదేశమును విధించునదియై కానవచ్చుచున్నదిగాని ఛకారద్వయమును విధించునదియై కాన్పించలేదు. అధర్వణాచార్యులిట్లు చెప్పెను. ఎట్లన— సమస్తతద్భవపదములయందు వర్ణలోపాగమాదులు అనేకములు కలుగుచున్నవి, అనిచెప్పి మరల స్పష్టము చేయుటకొఱకు సంయుక్తవర్ణము

నకు వేరగుట లోపాదేశాగమములు సంస్కృత తద్భవమందు కలుగును. తక్కినచోట ఆదేశాదులు, అక్షరవ్యత్యయములు, ఒకానొకచోట కవిసమ్మతివలనగలుగుచున్నవి. అని- లోపమునకుదాహరణము. "సత." ఇత్యాదులయందు 'సప్త' మొదలగు శబ్దములయందలి పకారాదులకుఁ గల్గును. ఆదేశములు అచ్చులరూపములుగను హల్లులరూపములుగను రెండు విధములు. అవి చంచమామ ఇత్యాదులయందు చంద్రమశ్శబ్దము మొదలగువానియందలి చకారాదులకు ౘకారము మొదలగునవి. ఆగమములును రెండువిధములు. అవి దేవర, చందురుఁడు, దేవర అనుచో దేవశబ్దముమీఁద 'ర' అనునది చందురుఁడు అనుచోఁ జంద్రశబ్దమందలి దకారముపై ఉకారము ఈ మొదలగునవి తెలియతగ్గవి. ఆదేశాదులు శుద్ధాంధ్రసంబంధులగు ఛకార ఖకారాదులకు చకార కకారాదులు. అవియు, లచ్చి, లచ్చనము, కంబము, అనుచో లచ్ఛి, లచ్ఛన, ఖంబ అను శబ్దములయందలి ఒత్తులకు సాదులువచ్చుట ఈమొదలగునవి తెలియఁదగినది ఆది శబ్దముచేత లోపాగమములు. అవియు, జక్కులు అనుచోట్ల క్షః కః అను మాగధీసూత్రమువలన జిహ్వామూలీయము (ᳵక) నకు లోపము. మూఁగ అనుచో అర్ధానుస్వారాగమము. ఈమొదలగునవి యెఱుఁగునవి. జక్కులు అనునది కొందఱు ప్రాకృతతద్భవమని తలఁచిరి. వర్ణవ్యత్యయము. ప్రేరించె౯ అనుదానికి ప్రేరేచె౯ అని ఇకారమునకు ఏకారము తద్భవమూలముగా వచ్చినదని తెలియఁదగినది. ఈమొదలగుశబ్దములు ఇట్లెఱుఁగునది.

వ్యా. సీ. తుక్కుగో శెంబోలి-తూళ్ళగుండముకంతి,
గుజ్జుకరాటంబు-గజ్జికట్టె।
సిగచేత చిక్కంబు-చిన్నిసింగము సెజ్జ,
లక్కలచ్చనసుద్ది-లయ్యాలాగు।

ప్రోడపొత్తముపోక-పుడమిబన్నముబూది,
బీరంబుబికిరము-పిట్టుపుటము।
వదినెవెన్నుఁడువంక-వడుగువీడెమువన్నె,
రక్కసిరవణంబు-రిక్క-పగ్గ।
గీ. పీటదయ్యముతోరంబు-పెట్టెమట్టి
బత్తిజతనముజాతర-ముత్తియంబు।
దాదికుప్పసమిటికని-ద్దంబుపెరిమె।
యిమముదెసడిగ్గియనఁగఁద-ద్భవములయ్యె॥

ఇత్యప్పకవిః. కుర్కురశబ్దాత్ కుక్కశబ్దః. గోళాత్=గోలెము. ఆళేః=ఓలి. క్రూరాత్=కూళ. కుండాత్=గుండము. గ్రంథేః=కంతి. కుబ్జాత్=గుజ్జు, కరండాత్=కరాటము. ఖర్జ్వాః=గజ్జి. కాష్ఠాత్=కట్టె. శిఖాయాః=సిక. చేష్టాయాః=చేత. శిక్యాత్=చిక్కము. చిహ్నాత్=చిన్నె. సింహాత్=సింగము. శయ్యాయాః=సెజ్జ. లాక్షాయాః=లక్క. లాంఛనాత్=లచన. సూక్తేః=సుద్ది. లంజాయాః=లయ్య. లంఘాయాః=లాగు. ప్రౌఢాత్=ప్రోడ. పుస్తకాత్=పొత్తము. పూగాత్=పోక. పృథివ్యాః=పుడమి. భగ్నాత్=బన్నము. భూతేః=బూది. వీరాత్=బీరము. భిక్షాయాః=బికిరము. పిష్టాత్=పిట్టు. స్ఫుటాత్=పుటము. వధూవ్యాః=వదినె. విష్ణోః=వెన్నుఁడు. వక్రాత్=వంక. వటోః=వడుగు. వీట్యాః=వీడెము. వర్ణాత్=వన్నె. రక్షసః=రక్కసి. రమ్యాత్=రవణము. ఋక్షాత్=రిక్క. ప్రజ్ఞాయాః=పగ్గ. పీఠాత్=పీట. దైవాత్=దయ్యము. సూత్రాత్=తోరము. పేట్యాః=పెట్టె. మృత్తికాయాః=మట్టి. భక్త్యాః=భక్తి. యత్నాత్=జతనము. యాత్రాయాః=జాతర. మౌక్తికాత్=ముత్తియము. ధాత్ర్యాః=దాది. కూర్పాసాత్=కుప్పసము. ఇష్టకాయాః=ఇటిక. స్నిగ్ధాత్=నిద్ద

ము. ప్రేమ్ణః = పెరిమె. హిమాత్ = ఇవము. దిశః = దెస. దీర్ఘికాయాః డిగ్గిశబ్దశ్చ నిష్పన్నః. ఏవమన్యేపి జ్ఞేయాః.

తా. స్పష్టము.

వ్యా. యథా ప్రాకృతే ప్రథమశబ్దస్య ప్రణీత్యాదిత్వాద్దత్వే పదిమా ఇతి సిద్ధే గజడదబఘఝఢధభాం కచటతప ఖఛఠథఫాః ఇతిచూళికా పైశాచీసూత్రేణ పతిమా ఇతి రూపం. తథాపి ఘేత్యస్యాపి తల్లోదరీతి పైశాచసూత్రేణ తకారే పైశాచీతత్సమత్వమేవేతి సూక్ష్మదృష్ట్యావధేయం. జక్కులు, మాగధీతద్భవః, గోనములు, పైశాచీతద్భవః. రాచకొలము చూళికాతద్భవః. మూఁగ, అపభ్రంశతద్భవః. జూదము, శౌరసేనతద్భవః. నతుతద్భవః. తథాహి. ప్రాకృతవదిత్యతిదేశాత్ ద్యయ్యర్యాం జఇతి జాదేశః. దస్తస్యశౌరసేన్యామఖోరచోస్తారితి సూత్రేణతస్య దాదేశేతద్రూపం సిద్ధం నచతాలవ్యజకారేణ వైలక్షణ్యం. ప్రాకృతేతద్భవేచాపి చజౌవంతిభవాస్తృతాదితి ఆథర్వణాచార్యేణోక్తత్వాత్. ప్రాకృతే ప్రాకృతసమ ఇత్యర్థః.

తా. ప్రాకృతమందు ప్రథమశబ్దమునకు ప్రణీత్యాది సూత్రమువలన దకారముగలుగగా "పదిమా" అని అయినది. గజడదబేత్యాదిచూళికాపైశాచీసూత్రముచే తపతిమాఅనురూపము ఏలాగుకలుగునో ఆలాగున నే కదా అనుదానికి తల్లొదరియను పైశాచిసూత్రముచేత తకారముగలుగుచుండఁగా పైశాచతత్సమత్వమని సూక్ష్మదృష్టిచేఁ దెలియఁదగినది. జక్కులు అనునది మొదలు అపభ్రంశతద్భవః అనుపర్యంతము స్పష్టము. జూదము శౌరసేనీతద్భవము. సంస్కృత ప్రాకృతతద్భవముకాదు. ప్రాకృతవత్ అని అతిదేశించుటవలన "ద్యయ్యర్యాంజః" అనుసూత్రముచేజకారాదేశము దస్తస్యేత్యాదిసూత్రముచేతఁ దకారమునకుం దకారమును చేయుఁగా నారూపముసిద్ధించినది. తాలవ్యజకారముచేత దీనికిరూపభేదములేదు. ప్రా

కృతసమమందును తద్భవమందును చజలు దంత్యములేకాని తాలవ్యములులేవని అథర్వణాచార్యులుచెప్పెను.

వ్యా. నచైవంమాంగేత్యాదీ నామపితత్సమత్వాహతిః యత్రవర్ణాంతరాగమవర్ణలోపయోః శాస్త్రితో విశిష్యనప్రాప్తిస్తత్రైవతద్భవత్వం నాన్యత్రేతినియమాంగీకారాత్. దంత్యజకారస్యతుశాస్త్రతః ప్రాప్తత్వాన్న నియమవిరోధః. అన్యథా, రాముఁడు, లక్ష్మణుఁడు, మేరువు, ఇత్యాదీనామపితత్సమత్వంనస్యాదితి.

తా. ఈలాగుననుండఁగా మాఁగి మొదలగుశబ్దములకు తత్సమత్వమునకు బాధలేదు. ఏమనిన ఎచ్చట ఇతరాక్షరములయొక్క రావడమునకు, అక్షరలోపమునకును శాస్త్రమువల్ల విశేషించి ప్రాప్తిలేదో అక్కడ నేతద్భవము కాని మరియొకచోటలేదు. అని నియమమునంగీకరించుటవలన దంత్యజకారమైతే శాస్త్రమువలన వచ్చినదగుటచేత నియమవిరోధములేదు అట్లుగానియెడల రాముఁడు మొదలగుశబ్దములకును తత్సమత్వములేక పోవును.

వ్యా. ఏవంసితే జూదశబ్దః. శౌరసేనీతద్భవఇతి సరస్వత్యోక్తం. తద్విచారమాంద్యేనైవ, ఏవమన్యేపిజ్ఞేయాః. "ప్రాకృతే తద్భవేచాపీ త్యథర్వణసూత్రే ప్రాకృతశబ్దస్య ప్రాకృతసమపరత్వం నరసింహగ్రంధరీత్యా వ్యాఖ్యాతం. వస్తుతస్తుప్రాకృతశబ్దస్య ప్రాకృతపరత్వమేవ చజౌతజ్జేప్రాకృతేచదంత్యావేవ నసంశయ ఇత్యథర్వణాచార్యవచనాత్.

తా. ఇట్లుండఁగా జూదశబ్దము శౌరసేనీతద్భవమని బాలసరస్వతిచేఁ జెప్పఁబడియె. అది యాలోచన తక్కువచేతఁ జెప్పినది. ఈలాగు తక్కినవియుఁ దెలియఁదగినవి. "ప్రాకృతే తద్భవేచాపి" అను నథర్వణసూత్రమందుఁ బ్రాకృతశబ్దమునకుఁ బ్రాకృతసమమని నరసింహగ్రంథమున ననుసరించి వ్యాఖ్యానముచేయఁబడినది. వాస్తవ

ముచేతఁ బ్రాకృతశబ్దమునకుఁ బ్రాకృతపరముగానే యర్థము. చజాతజ్జే అను అధోక్షజాచార్యవచనము కలదు కావున.

వ్యా. ప్రసంగతః ప్రాకృతాదీనాం స్వరూపం వినియోగశ్చ కథ్యతే. ప్రకృతిప్రత్యయాది వ్యుత్పత్తిమత్ । ప్రకృతం సంస్కృతం. తత ఆగతమితి ప్రాకృతశబ్దవ్యుత్పత్తిః తత్త్రివిధం తత్సమం, తద్భవం, దేశ్యం చేతి శ్లో। తత్సమం సంస్కృతసమం జ్ఞేయం సంస్కృతలక్షణాత్ । దేశ్యమార్షం చ రూఢత్వా త్స్వతంత్రత్వాచ్చ భూయసా। లక్షణానాపేక్షతే తస్య సంప్రదాయో హి బోధకః॥ ప్రకృతేస్సంస్కృతాస్సాధ్యమానం సిద్ధం చ తద్భవం । దేశ్యమవ్యుత్పత్తిమత్ప్రాకృతత్వేన కథ్యతే । సంస్కృతీ ప్రాకృతీ చేతి భేదాద్భాషాద్విధా మతా॥ తత్ర సంస్కృతలక్షణం దండినోక్తం. "శ్లో॥ సంస్కృతీ నామ దైవీ వాగిత్యాఖ్యాతా మనీషిభిరితి॥"

తా. ప్రస్తావనావశమువలనఁ బ్రాకృతము మొదలగువాని స్వరూపమును, వినియోగమును జెప్పఁబడుచున్నది. ప్రకృతిప్రత్యయాది సంస్కారముగలది ప్రకృతమనఁబడును. సంస్కృతము. దానివలన వచ్చినది ప్రాకృతము అని ప్రాకృతశబ్దవ్యుత్పత్తి. ఆప్రాకృతము మూఁడు విధములు గలది. తత్సమము, తద్భవము, దేశ్యము అని. తత్సమమనఁగా సంస్కృతలక్షణముండుటంబట్టి సంస్కృతము. దేశ్యమును, ఆర్షమును, రూఢియైనవగుటవల్లను తరుచుగా స్వతంత్రము లగుటవల్లను, లక్షణాపేక్ష వానికిలేదు. వాని రూపమును సంప్రదాయమే తెలియఁజేయును. సంస్కృతము వలన సాధించఁబడి సిద్ధమైనది తద్భవము. వ్యుత్పత్తిశూన్యమైనది దేశ్యము. భాష సంస్కృతి ప్రాకృతి, అని రెండు విధములు. అందు సంస్కృతిలక్షణమును దండి చెప్పినాఁడు. ఎట్లనిన సంస్కృతి అనఁగా దేవతావాక్యమని మహర్షులు చెప్పిరని.

వ్యా. భాషాప్రదీపేప్యుక్తం. శ్లో॥ కౌమారపాణినీయాదిసంస్కృతా సంస్కృతిర్భవేత్ । సాదేవతావిశేషాణాంనాయకానాంతపస్వినాం ప్రశస్తచాతుర్వర్ణ్యానాంమంత్రిణాం ప్రతిహారిణాం। లింగినాంచవిటాదీనామన్యేషాంలలితాత్మనాం। ప్రయుజ్యతేనాటకేషుత్వన్యేషామపరామతా। ప్రకృతిస్సంస్కృతాభాషావికృతిఃప్రాకృతిర్భవేత్। షడ్విధేయంప్రాకృతీచశౌరసేనీచమాగధీ। పైశాచీచూళికాపైశాచ్యపభ్రంశఇతిక్రమాత్। మహారాష్ట్రోద్భవాభాషాప్రాకృతీపరికీర్త్యతే। శూరసేనోద్భవాభాషాశౌరసేనీతిగీయతే । ప్రచక్షతేమాగధీంతాంయాభాషామగధోద్భవా। పిశాచదేశసంభూతం పైశాచీద్వితయంభవేత్।ఆభీరాదికజాంభాషామపభ్రంశంప్రచక్షతఇతి॥

తా. భాషాప్రదీపమందును జెప్పఁబడియున్నది- కౌమార వ్యాకరణము, పాణినీయవ్యాకరణము మొదలగువానిచే సంస్కరింపఁబడినదిసంస్కృతము. ఆసంస్కృతము దేవతలకుకథానాయకులకు మునులకుఁ, బ్రశస్తస్థితిగల నాలుగువర్ణములవారికి, మంత్రులకు, ద్వారపాలకులకు, భిక్షుకులకు, విటులుమొదలయినవారికి ఇంకనితరులనుమంచివారికి నాటకములయందుఁ జెప్పబడుచున్నది. తక్కినవారికి ప్రాకృతము. ప్రకృతియనఁగాసంస్కృతభాష వికృతియనఁగాఁ బ్రాకృతభాష. ఆప్రాకృతభాష యాఱువిధములుగలది. ప్రాకృతము, శౌరసేని, మాగధి, రెండువిధములగు పైశాచి, చూళిక, అపభ్రంశము నని. మహారాష్ట్రదేశమందు వాడఁబడుభాషప్రాకృతము. శూరసేనదేశమందలిభాషశౌరసేని. మగధదేశమందు వాడఁబడుభాష మాగధి. పిశాచదేశమందయినది రెండువిధములగుపైశాచి. ఆభీరాది దేశములయందుఁబుట్టినది అపభ్రంశము. అనిచెప్పఁబడును.

వ్యా. షణ్ణాంభాషాణామపి ప్రాకృతమిత్యేవవ్యవహారః. దండినాపి శ్లో॥ శౌరసేనీచగౌడీచ లాటీచాన్యాచతాదృశీ। యాతిప్రాకృతమిత్యేవం వ్యవహారేషుసన్నిధిం। ఆభీరాదిగిరఃకావ్యేష్వపభ్రంశఇ

తి పితిః। శాస్త్రేషుసంస్కృతాదన్యదపభ్రంశతయోదిత మిత్యుక్తం ఆభీరదేశో నామాభీరప్రాయః, పశ్చిమసముద్రపార్శ్వవర్తీ జనపదః ఆదిశబ్దేనఘూర్జరాదయః.

తా. పండితుఁ జెప్పెను. శౌరసేని, గౌడి, లాటి మఱియు నిట్టి మఱియొకటి ప్రాకృతమనెడి వ్యవహారము బొందుచున్నది. కావ్యములయందు గొల్లలు మొదలైనవారిమాట లపభ్రంశములని చెప్పఁబడును శాస్త్రములయందు సంస్కృతమునకంటె నన్యభాష యపభ్రంశమని చెప్పఁబడినది. అని "ఆభీరదేశమనఁగా గొల్లలు విస్తారముగల పశ్చిమసముద్రపార్శ్వమందలి దేశము" "ఆభీరాదికజాః" అనుచోట ఆదిశబ్దముచే ఘూర్జరులు మొదలగువారు చెప్పఁబడుచున్నారు.

వ్యా. వివరణేచాప్యుక్తం.

శ్లో॥ తత్రతుప్రాకృతంస్త్రీణాం సర్వాసాంనాటకాదిషు । క్వచిత్ప్రశస్తనారీణాం యోగినీనాంచసంస్కృతం । యేనీచాఃకర్మణా జాత్యా తేషాంప్రాకృతముచ్యతే। ఛద్మలింగవతాంతద్వజ్జనానామితికేచన। మధ్యమస్యాధమస్యాపి శౌరసేనీప్రయుజ్యతే। కైవర్తభిల్లముఖ్యానాం మాగధీవినియుజ్యతే। రక్షోసురపిశాచానాం పైశాచీద్వితయంభవేత్ । చండాలయవనాదీనా మపభ్రంశఃప్రియుజ్యతే। నాటకాదావపభ్రంశ విన్యాసస్యసహిష్ణవః । అన్యేచండాలకాదీనాం మాగధ్యాది ప్రయుంజతే। సర్వేషాంకారణవశా త్కార్యోభాషావ్యతిక్రమః । మాహాత్మ్యస్యపరిభ్రంశం యథాలిఖితవాచనం। ప్రచ్ఛాదనంచవిభ్రాంతిం మదస్యాతిశయంతథా। కదాచిదనువాదంచ కారణానిప్రచక్షతే। బాహ్లీకసహ్య నేపాళ పాండ్యకేకయ కుంతలాః। సోళలాటకగాంధారా సుధేష్ణద్రవిడాదయః। పిశాచదేశాస్తద్దేశ్యం పైశాచీద్వితయంభవేత్ । ప్రాకృతంషడ్విధంచాపి భార

త్యా బాల్యభాషితం । భాషాణాంప్రాకృతాదీనాం వాల్మీకిర్మూలసూత్రకృదితి

తా. వివరణమందుఁగూడఁ జెప్పఁబడియున్నది. ఎట్లన్న. అందు ప్రాకృతము స్త్రీలకందఱికి నాటకము మొదలగు రూపకములయందుఁ జెప్పవలయును. ఒకానొకచోట నుత్తమస్త్రీలకు యోగినులకు సంస్కృతము జెప్పవలెను. కర్మచేతగాని జాతిచేతగాని నీచులయినవారికిఁ బ్రాకృతము చెప్పఁబడుచున్నది. మిషము, నీచచిహ్నముగలవారికి ప్రాకృతమని కొందఱు చెప్పిరి. మధ్యమునికి, అధమునికి శౌరసేనీభాష ప్రయోగించఁబడుచున్నది పల్లెవాండ్రు, ఎరుకలవాండ్రు మొదలగువాండ్రకు మాగధీభాష. రాక్షసులు, అసురులు, పిశాచములు వీరికి రెండుతెరఁగుల పైశాచీభాష. మాలవాండ్రు, యవనులు మొదలగువారికి అపభ్రంశము. నాటకాదులయందపభ్రంశముంచుట సహించనివారు కొందఱు చండాలాదులకు మాగధి మొదలగుదానిం జెప్పుచున్నారు. అందఱికిని నేదేని యొకకారణమువలన భాషయొక్కమార్పు గలుగును. కారణములనఁగా మాహాత్మ్యము పోవడము, ప్రాకృతభాష చేలిఖించినది చదువడము, తనభాషను మాటుపరచుకొనుట, భ్రమజెందుట, మిక్కిలి మదించుట, ఇతరులు చెప్పినమాటలను తాననువదించిచెప్పుట ఇవి కారణములు. బాహ్లీకము, సహ్యము, నేపాళము, పాండ్యము, కేకయము, కుంతలము, చోళము, లాటము, గాంధారము, సుధేష్ణము, ద్రవిడము మొదలగునవి పిశాచదేశములు. ఆదేశమందలి భాష రెండుతెరఁగులగు పైశాచి. ఆఱుతెరఁగులగు ప్రాకృతభాషయు సరస్వతియొక్క బాల్యమందలి మాటలు. ప్రాకృతము మొదలగు ఆఱుభాషలకు వాల్మీకి మహర్షిమూలసూత్రములు చేసినవాఁడు.

సూ॥ ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తేదశో నాస్యుః। షట్త్రింశదత్రతేన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. ఇతి.

వ్యా. ఆద్యాయాః పంచాశద్వర్ణాః సంస్కృతభాషాశబ్దానాంపంచాశద్వర్ణైస్సిద్ధిర్భవతి.

తా. మొదటిభాషకు ఏబదియక్షరములు. అనఁగా సంస్కృతభాషాశబ్దములకు నేబదియక్షరములచేత సిదియగును

వ్యా. అత్రకేచిత్ అఆ ఇఈ ఉఊ ఋౠ ఌ ఎఐ ఒఔ వర్ణాః అనుస్వారవిసర్గౌచ స్వరాఇతి కథ్యంతే స్పర్శా అంతస్థాః క్షళవర్ణసహితా ఊష్మాణశ్చ హలఇత్యుచ్యంతే మిళిత్వా పంచాశద్వర్ణా భవంతీతి వదంతి, తేషాంమతే ప్రకృతేస్తు తేదశోనా ఇత్యత్ర- ఋ ౠ ఌ ఐఔ ఙ ఞ శ ష వర్ణా విసర్గశ్చ న్యూనాభవంతి. కేషాం చిన్మతే ఌ వర్ణస్యదీర్ఘగ్రహణం ళవర్ణగ్రహణంచ సమ్మతం.

తా. ఇక్కడ, అఆ ఇఈ ఉఊ ఋౠ ఌ ఎఐ ఒఔ అనునక్షరములును అనుస్వారవిసర్గములును అచ్చులు అనిచెప్పఁబడుచున్నవి. కకారముమొదలు మకారముదాక నుండువియును యరలవలుక్షళశషసహలును హల్లులనిచెప్పఁబడుచున్నవి. కలసియేఁబదియక్షరములగుచున్నవని కొందఱుచెప్పుచున్నారు. వారి మతమందుఁ బ్రాకృతమునకుఁ బదియక్షరములు తక్కువయనుచోట. ఋౠ ఌ ఐఔ ఙ ఞ శ ష విసర్గములు తక్కువయగుచున్నవి కొందఱిమతమందు ఌ వర్ణమునకు దీర్ఘమును ళకారమును సమ్మతమయినది.

వ్యా. అత్ర సంప్రదాయాభిమానినోవదంతి. ఆదిక్షాంతా స్మృతావర్ణా ఇత్యాగమజ్ఞవ్యవహారమాత్రేణ నక్షకారస్య వర్ణాంతరత్వేన గణనా- అన్యథాసంయుక్తత్వావిశేషాత్ స్త్రాదీనామపి వర్ణాంతర

త్వేన గణనా స్యాత్ క్షస్యవర్ణాంతరత్వాభావే ధాతుపారాయణికై ర్భిక్షాదిధాతూనాం షాంతమధ్యే పాఠఏవ మానం.

తా. ఇచ్చటసంప్రదాయాభిమానులు కొందరేమనుచున్నారంటే ఆదిక్షాంతాః స్మృతావర్ణాః అను నాగమవేత్తల వ్యవహారమున్నంతమాత్రమున క్షకారము వేఱువర్ణమని లెక్కించుటతగదు అట్లుగాకపోతే సంయుక్తములైన స్త మొదలగువానిం గూడ వేఱువర్ణములుగా లెక్కించుట సంభవించును. క్షవర్ణము వేఱువర్ణము కానందుకు ధాతుపాఠము జేయువారు భిక్షాదిధాతువులను షకారాంతధాతువులలోఁ బాఠము సేయుటయే ప్రమాణము.

వ్యా. నచైవం ళకారస్యాప్యవర్ణాంతరత్వం- తత్ర మహేశ్వర సూత్రానుక్తత్వేపి లడయోర్లళయోశ్చైకత్వమితి శాబ్దిక శిక్షావతంసై రుక్తత్వాల్లో ళఇతి వాల్మీకిభిరుక్తత్వాల్లళయో రుచ్చారణస్య లోకవేదయోర్భిన్నత్వేన ప్రతీయమానత్వాచ్చ నళస్యావర్ణాంతరత్వం వక్తుం శక్యతే

తా. ఇట్లుండఁగా ళకారము గూడ వేఱువర్ణముకాని చెప్పఁగూడదు. మాహేశ్వరసూత్రములయందు (అ ఇ ఉణ్ ఇత్యాదిసూత్రములయందు) జెప్పఁబడకున్నను లడలకును లళలకును ఏకత్వమనిశబ్దశాస్త్రజ్ఞులు చెప్పుటవల్లను లకారమునకు ళకారము వచ్చునని వాల్మీకిమహర్షి చెప్పుటవల్లను, లళలకునుచ్చారణము లోకమందును వేదమందును వేఱుగాఁ దోఁచుచుండుటవల్లను ళకారము వేఱువర్ణముకాదని చెప్పుటశక్యముకాదు.

వ్యా. యద్యప్యనుస్వారవిసర్గజిహ్వామూలీయోపధ్మానీయయమానామకారోపరి శర్షుచ పాఠస్యోపసంఖ్యానమితి కాత్యాయనవ్యవహారాదనుస్వారవిసర్గయోర్హల్త్వంచాప్యస్తి. తథాపి వర్ణపరిగణనదశాయాంతయోరచ్త్వేనైవ ప్రామాణికైర్వ్యవహారః కృతః. అతఏవహ

రింవం దేహరిః కరోతీత్యాదౌ త్రిపాదిగతత్వేనానుస్వార విసర్గకార్యయోరసిద్ధత్వా న్నయణా దేశప్రసక్తిరిత్యాద్యవ్యాకరణపారీణాః ఫేణుః

తా. విచారించఁగా. అనుస్వార [ం] విసర్గ [ః] జిహ్వామూలీయ [ẖక] ఉపధ్మానీయ [ḫప] యమ [వర్గములలో మొదటినాలుగక్షరములకుఁ బంచమాక్షరములు పరములగునపుడు పూర్వముతో సమానమగు నింకొక వర్ణము కలుగును. ఎట్లనంటే. 'అగ్గ్ని' ఇందు గకారము 'పద్ద్మము' ఇందు దకారము ఇది యమయనఁబడును] వీనికి అకారమునకుఁ దరువాతను శర్రులు (శషస) వీనియందును పాఠముఁ జెప్పవలసినది అని వార్తికకారుని వ్యవహారమువలన అనుస్వారవిసర్గలు హల్లులును అగును. అయినను అక్షరములను లెక్కించునపుడు అవి యచ్చులనియే ప్రామాణికులవ్యవహారము. కావున నే హరింవం దేహరిఃకరోతి ఇత్యాది స్థలములయందు అనుస్వారవిసర్గలు (ఇకో యణచియను సూత్రముచేతి) ఇక్కుపకంటెఁ బరమైన అచ్చులు గావున యణాదేశము రావలసియున్నను ఈయనుస్వారవిసర్గకార్యములు (అనఁగా 'మోనుస్వారః' 'ఖరవసానయోర్విసర్జనీయః' అనునవి) త్రిపాదిలోనివిగావున [' పూర్వత్రాసిద్ధం ' సపాదసప్తాధ్యాయీకార్యము చేయునలయునపుడు త్రిపాదీకార్యమసిద్ధమగును] అసిద్ధములగుటవలన యణాదేశము ప్రసక్తించదు అని పాణినీయవ్యాకరణవేత్తలు జెప్పిరి.

వ్యా. జిహ్వామూలీయోపధ్మానీయయోస్తునోభయత్రాపి పరిగణనం. తయోర్విసర్గాత్మకత్వేన వర్ణాంతరత్వాభావాత్.

తా. జిహ్వామూలీయోపధ్మానీయములు విసర్గరూపము లౌటవలన వేఱువర్ణములు కావుగావున నచ్చులయందును హల్లులయందుంగూడ లెక్కలేదు.

వ్యా॥ శస్యగ్రాహ్యత్వే షస్యాగ్రాహ్యత్వే ఌవర్ణస్యద్వైవిధ్యే శ్లో॥ ద్విధాకపఫౌనుస్వారో విసర్గష్షోడశస్వరాః। స్పర్శా అంతస్థోష్మాణశ్చతుస్త్రింశద్ధలస్స్మృతాః। సిద్ధిస్సంస్కృతశబ్దానాం భవేత్పంచాశదక్షరైః। ప్రాకృతానాంచసిద్ధిస్యాత్ త్రైశ్చత్వారింశదక్షరైః। ఋౡవర్ణావైనైకారౌకారాభ్యాంచదశస్వరాః। శషావసంయుక్తఙఞౌ వినైవాన్యేహలోమతాః। ఋౡవర్ణౌహ్రస్వదీర్ఘౌ ఐజాద్యావనునాసికౌ। శషౌచదశతేన్యూనాః ప్రాకృతోక్తిషుసర్వత ఇత్యాది వరరుచిహేమచంద్రాది వ్యాకరణప్రవణోక్తిర్మానమితి.

తా. శకారమును గ్రహించఁదగుటయందును ష.కారమును గ్రహించఁదగకుండుటయందును ఌవర్ణమునకు ద్వివిధత్వమందును మానమేమనిన రెండువిధములగు అక్కులు [అనఁగా హ్రస్వదీర్ఘములైన అఆఇఈఉఊఋౠఌౡ అనుట] ఏచ్చులు [ఏఓఐఔ] అనుస్వారము విసర్గ అను పదియాఱు అచ్చులు. స్పర్శములు [కకారాది మకారాంతవర్ణములు] అంతస్థములు [యరలవ] శకారము ఊష్మలు (శషసహ) ముప్పదినాలుగుహల్లులు. అను నేఁబదియక్షరములచేత సంస్కృతశబ్దముల సిద్ధియగును. ప్రాకృతశబ్దములకు నలువదియక్షరములచేత సిద్ధియగును. ఋౡఐఔ లను వినాగాఁ బదియచ్చులు. శషలు సంయుక్తములుగాని ఙఞలువినాగాఁ దక్కినహల్లులు అనఁగా హ్రస్వదీర్ఘములైన ఋ ౡ వర్ణములు ఐ ఔ ఙ ఞ శ షలు అను నీపది ప్రాకృతభాషయందుఁ దక్కువ అను నీమొదలగు వరరుచిహేమచంద్రాదివ్యాకరణవేత్తలవాక్యము ప్రమాణము.

వ్యా॥ ఌవర్ణస్యద్వైవిధ్యమిత్యత్ర తస్యదీర్ఘాభావాత్ ప్లుతేనద్వైవిధ్యమితి కేచిదాహుః. తస్యసాక్షాద్దీర్ఘాభావేపి ఋవర్ణసవర్ణత్వేనతద్దీర్ఘమాదాయ దీర్ఘవత్త్వమితి కేచిదవదన్.

తా. ఌవర్ణమునకు ద్వివిధత్వమనుచోట దానికి దీర్ఘము లేదు గావున ప్లుతముచేత ద్వివిధత్వమని కొందఱు చెప్పచున్నారు. దానికి

సాక్షాత్తుగా దీర్ఘములేకున్నను ఋవర్ణమునకు సవర్ణమౌట చేత దానిదీర్ఘమునుబట్టి దీర్ఘములుకలవని కొందఱుచెప్పిరి.

వ్యా. అత్రేయంచింతా. హ్రస్వస్యేవ దీర్ఘస్యాపి సిద్ధత్వేన ద్వయోః పార్థక్యేన గణనా- ప్లుతస్యతు విధివిషయత్వాన్న పరిగణనేతిహి సంప్రదాయః- ఏవంసతి లృకారప్లుతస్యైవ విశిష్యగ్రహణ మిత్యప్రామాణికమేవ. ననా తేన ప్రయోజనమితి ఋవర్ణ దీర్ఘేనైవ దీర్ఘవత్వం ప్రామాణికం- అణుదిత్సవర్ణస్యచాప్రత్యయ ఇతి గ్రహణకశాస్త్రానుగతా ఋకారత్రింశతస్సంజ్ఞా లృకారశ్చ తథావిధ ఇతి సిద్ధాంతాత్- అతఏవ హోతౄ లృకార ఇత్యత్ర సవర్ణదీర్ఘే హోతౄకారఇతి రూపంసిద్ధం.

తా. ఇక్కడ నీవిచారము జేయవలయును. హ్రస్వము వలెనే దీర్ఘముగూడ సిద్ధమయినదవుటచేత [అనఁగాశాస్త్రాపేక్ష లేకుండుటచేత] హ్రస్వదీర్ఘములను రెంటిని వేరు వేరుగా లెక్కించుట ప్లుతముశాస్త్రవిషయముగుటవలన [అనఁగా శాస్త్రాపేక్షగలదౌటవలన] వేరుగాఁ లెక్కించుటలేదు- అనిసంప్రదాయము. ఇట్లుండఁగా లృకార ప్లుతమును మాత్రము వేరుగా గ్రహించుట ప్రామాణికముగాదు దానిచేఁ బ్రయోజనమును లేదు- ఇఁక నేమంటే ఋకారదీర్ఘముచేత దీర్ఘముకలుగుట ప్రామాణికము. [అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః. విధించఁబడని అణ్ణు, హ్రస్వాకార మిత్సంజ్ఞగలదియు సవర్ణమునకు సంజ్ఞయగును. అనునట్టి] గ్రహణకశాస్త్రము ననుసరించి ఋకారము ముప్పదింటికి సంజ్ఞయగును లృకారముగూడ నిట్లేయనుసిద్ధాంతమువలన- కనుక నే హోతౄ లృకారః అనుచోట సవర్ణదీర్ఘము గలుగఁగా హోతౄకారః అనునట్టిరూపము సిద్ధమయినది.

వ్యా. తత్రకేషాం చిద్వర్ణానాం క్వచిదభిన్నతావ్యవహారః లడయోర్లళయోశ్చైవ రలయోర్వబయోర్భిదేత్యుక్తేః తత్రాపిలడయోర్లళ యోరభేదస్తు వైయాకరణవ్యవహారేణగరీయాన్ వబయోరభిన్నత్వంతు ప్రాకృత వ్యాకరణరూఢం తథాహి నీవిస్వప్నే వేత్యత్రవస్యమాదేశో విధీయతే తత్రచ బస్యస్థానిత్వం మస్యాదేశత్వం భోమశ్శబ్దఇతిపూర్వసూత్రాదనువర్తనీయం. ఏతద్వబయోరభేదం వినాదుర్ఘటమితిస్పష్టమేవ. తేనాబ్దమిత్యత్రదవలామధశ్చేతి బలోపః ఫలం. ప్రపంచస్తు చంద్రికాదేరవగంతవ్యః. రలయోస్త్వభిన్నతా చింతామణౌ రామచంద్రేణసూర్యేణమః పౌరస్త్యదేశజమిత్యాదౌ కవిభిరేవవ్యవహృతేత్యవగంతవ్యంతదుక్తంత్రిభోజనే. 'రలయోర్లడయోస్తద్వల్లళయోశ్శసయోరపి వబయోర్నణయోశ్చాంతే సవిసర్గావిసర్గయోః సబిందుకాబిందుకయోస్స్యాదభేదేనకల్పనమితి.'

తా. అందుఁగొన్నివర్ణములకుఁగొన్నిచోట్ల నభేదవ్యవహారముగలదు లడలకు లళలకువబలకును భేదములేదనిచెప్పియున్నది. అందులడలకును లళలకునభేదము వైయాకరణుల వ్యవహారముచేత నెక్కువదై యున్నది. వబలకభేదమైతే ప్రాకృతవ్యాకరణమునందుగలదు ఎట్లంటే నీవిస్వప్నే వాయనుచోట వకారమునకుమకారాదేశము విధించబడుచున్నది అందుబకారము, స్థాని, మకారమాదేశము గానున్ను భోమశ్శబ్దే అనుపూర్వసూత్రమువలన దెచ్చుకోఁదగినది ఇదియువబలకభేదములేక సిద్ధించదుఅనుటస్పష్టమే. దానిచేత అబ్దమనుచోట దవలామధశ్చ అని బకారలోపముఫలము. దీనివివరణము చంద్రికాది గ్రంథములవలన దెలియఁదగినది. రలలకభేదము చింతామణియందుఁ జెప్పఁబడినది. రామచంద్రేణేత్యాదిశ్లోకమందు పౌరత్యదేశజం అనుచోట రలలక భేదమువలనఁ బౌలస్త్యదేశజమనివచ్చును. ఇదిమొదలనుచోట్లఁగవులువ్యవహరించిరని తెలియవలయును. త్రిభోజనమను గ్రంథమందది చెప్పఁబడినది ఎట్లంటే రలలకును,లడలకును, లళలకును, శసలకును

వబలకు నణలకును, అంతమున విసర్గగలదానికి విసర్గలేనిదానికిని బిం
దువుగలదానికిని లేనిదానికి నభేదకల్పనము గలుగును అని.

వ్యా. ఏవంసతి అప్పకవినాయదుక్తం యత్తురలయోర్మైత్రీతా స్త్రీ
తిలాక్షణికానామ్ కీర్తిర్న ప్రామాణికీతి లీలామకరాంక చంద్రరేఖాం
కురచూడాలంకార పదాంబురుహాలింగిత మహితనిర్మలాంతః కరణ,
త్యాదౌ రేఖాశబ్దస్య లాదిత్వమపి నైఘంటికైరుక్తత్వాత్ న రేఫాదిత్వ
మితితదవిచారితాభిధానమేవేతి స్పష్టమేవ. ఏతేనరాయంచ కాళ్ళ
దోలకయమున్న. ఇత్యాదికవిప్రయోగాణాం నకించిదప్యసామంజ
స్యమితిధ్యేయం ప్రాసేతు తదభిన్నత్వం కవిభిర్న వ్యవహృతమి
తిజ్ఞేయం.

తా. ఇట్లుండఁగా అప్పకవిరలలకు మైత్రికలదని లక్షణవేత్తలు
చెప్పినమాట ప్రామాణికముకాదని లీలా మకరాంకేత్యాది పద్యమం
దు రేఖాశబ్దములోని రేఫమును లీలాశబ్దము మొదటి లకారమునకును
యతివిషయమున రేఖాశబ్దమునకు లకారాదిత్వము గూడ నిఘంటుకా
రులచేఁ జెప్పఁబడినందున నిక్కడ రేఖాశబ్దము లకారాదిగాని రేఫా
దిగాదు అనియేమాటఁ జెప్పినోయది యాలోచించనిమాట యెయని
స్పష్టము. ఇందుచేత రాయంచ కాళ్ళఁదోలకయమున్న యనుచోటరల
లకు యతి యీమొదలగు కవిప్రయోగములకనుపపత్తి యెంతమాత్ర
మును లేదని తెలియవలయును. ప్రాసమందైతే రలలకభేదమునుకవు
లువ్యవహరించలేదని తెలియవలయును.

వ్యా. ప్రకృతేస్తుతే దశోనాస్స్వరితి. దశవర్ణా ఊనాయేషాం
తేదశోనాః. ప్రకృత్యాంపంచాశద్వర్ణాభవంతి. ప్రాకృ
తశబ్దః ప్రవృత్తి శ్చత్వారింశద్వర్ణవతీత్యర్థః. తతోన్యా దశవర్ణాశ్చ
ఋఋౡౡ ఐఔ వర్ణా అసంయుక్త ఙఞ గా వర్ణాస్వీతత్వేషి
శిష్టద్ధోషః. శషవర్ణనిషేధస్య సంస్కృతీయవిషయత్వేఽన్యోః శ్లావి

మాగధ్యాంగవర్ణస్య విద్యమానత్వేపినవిరోధః. ప్రాకృత్యాం విసర్గస్య సాక్షాదభావేపిక్షుగ్లక ఇతి సూత్రే తత్స్థానికస్యజిహ్వామూలీయస్య సత్త్వాత్తస్యాపివిద్యమానతుల్యతేతి తావన్మాత్రాశయేన భాషాశబ్దానుశాసనగ్రంథేదశస్వరా ఇత్యుక్తమితితత్తాత్పర్యం తత్తాత్పర్యవిదో విదాంకుర్వంతు.

తా. ప్రాకృతభాషయందుఁ బదిస్వరములు తక్కఁగల యేబది వర్ణములుగలవు. (అనఁగా ఏలుపదియనుట) ప్రాకృతశబ్దనిష్పత్తినలు పదియక్షరములచేనగు నిన్నదనియరము అందుఁ దక్కవగ్గైనయక్షరములుపది. యేవియనిన ఋౠౢౣఐఔవర్ణములు సంయుక్తములు గాని ఙఞగవర్ణములు ఇతరవర్ణములతోఁగూడినను దోషములేదు. శష వర్ణనిషేధము సంస్కృతాక్షరవిషయమైనదౌటచేత స్తోకశ్లో అనిమాగధీభాషయందు గవర్ణమున్నను విరోధములేదు. ప్రాకృతభాషయందుసాక్షాత్తుగా విసర్గలేకున్నను క్షుగ్లకః అనుసూత్రమందు విసర్గస్థానమందలి జిహ్వామూలీయముండుటవలన విసర్గమున్నదానితో సమానమనియంతమాత్రపు అభిప్రాయముచేత భాషాశబ్దానుశాసనగ్రంథమందుఁబదియచ్చులు అనిచెప్పఁబడినదని వారితాత్పర్యమని తాత్పర్యవేత్తలు తెలియుదురుగాక.

వ్యా. షట్త్రింశదత్ర. అత్రశుద్ధవికృతౌషట్త్రింశద్వర్ణానాం వ్యవహారః. రస్త్వత్రగృహ్యతే ద్వివిధఇతి రేఫస్య ద్వైవిధ్యకథనేన గురురేఫస్యవర్ణమధ్యే పరిగణనదశాయాం సప్తత్రింశదిహాన్యే ఇత్యప్యకవి పుస్తకపాఠోపి సాధురేవ. తస్య రేఫభేదత్వేనా వర్ణాంతరత్వాదపరిగణన దశాయామయంపాఠఇతి వివేకః.

తా. ఈశుద్ధవికృతిభాషయందు [అనఁగా అచ్చతెనుఁగునందు] ముప్పదియాఱువర్ణములకు వ్యవహారము. రేఫము ఈయాంధ్రమందు రెండుదెఱఁగులగా గ్రహింపఁబడుచున్నదను సూత్రముచేత రేఫమునకు ద్వివిధత్వము చెప్పుటచేత శకటరేఫము నక్షరములలో లెక్క

చేసుకొన్న పక్షమందు ముప్పదియేడక్షరములని యప్పకవి పుస్తకమందలి పాఠమును మంచిదే. ఆశకటరేఫము రేఫభేదమగుటచేత వేఱుపర్ణముగా లెక్కించనిపక్షమున ముప్పదియారను నీపాఠము చెప్పఁబడినది అని వివరణము.

వ్యా. తేన్యఇతి. షట్త్రింశదక్షరవ్యతిరిక్తాస్తేవర్ణాశ్చ శబ్దయోగవశాత్తత్సమాదిశబ్దయోగవశాదనుప్రవిశంతి. స్వాతంత్ర్యేణశాద్యక్షరాణాం ప్రవేశోనాస్తి కింతు షణ్ముఖుఁడు, శరీరము, ఝళీ, మజ్ఝా ఇత్యాది తత్సమాదిద్వారా ప్రవేశస్సంభవతీత్యర్థః.

తా. ముప్పదియారక్షరములకంటె వేరగువర్ణములును శబ్దసంబంధమువలన అనఁగాఁ దత్సమాదిశబ్దసంబంధమువలన ఈభాషయందుఁ బ్రవేశించుచున్నవి. స్వతంత్రముగా శవర్ణాదులకుఁ బ్రవేశములేదుగాని షణ్ముఖుఁడు, శరీరము ఇత్యాది తత్సమశబ్దములద్వారముగా ఝళీ, మజ్ఝా ఇత్యాది దేశ్యశబ్దములద్వారముగాను బ్రవేశముగలుగుచున్నదియనియర్థము

వ్యా. నచ త్రిలింగదేశవ్యతిరిక్తదేశీయానాం ఝళ్యాదీనాం ప్రవేశే విరోధః అహేయమన్యదేశీయంయత్తదేవప్రయుజ్యత ఇత్యథర్వణోక్తిః. శ్రీశైలద్రాక్షారామకాళేశ్వరమధ్యవర్తిత్వే నాంధ్రదేశస్య త్రిలింగదేశఇతి ప్రసిద్ధిః. త్రీణిలింగాని యస్మిన్ సత్రిలింగోదేశః ద్రాక్షారామాణాం భూయిష్ఠత్వాద్ద్రాక్షారామసంజ్ఞేతి ప్రౌఢోక్తిః. వస్తుతస్తు దక్షస్యసంబంధా ద్ద్రాక్షారామఇతి తన్నామ 'తదుక్తంస్కాందే' దక్షస్యారామభూమిత్వాద్ద్రాక్షారామ ఇతీర్యత ఇతి. ఏతత్సర్వంరత్నాపణే కుమారస్వామియజ్వనాప్రతిపాదితం.

తా. త్రిలింగదేశశబ్దములుకాని దేశీయశబ్దములగు ఝళి మొదలగు శబ్దములకీభాషయందు బ్రయోగము విరోధముగాదు హేయముగాని యన్యదేశపదము ప్రయోగించఁబడుచున్నదని యథర్వణాచార్యులు చెప్పిరి. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరమునను నీమూఁడు

లింగముల మధ్యమందుండుటచేత నాంధ్రదేశమునకుఁ ద్రిలింగదేశమని ప్రసిద్ధి. మూఁడులింగములుగలదిగావున త్రిలింగము. ద్రాక్షతోటలు విస్తారముగాఁ గలుగుటవల్ల ద్రాక్షారామమని పేరు వచ్చినదని ప్రౌఢవాదము. నిజమాలోచించఁగా దక్షుని సంబంధమువలన దాక్షారామమని దానిపేరు. అట్లు స్కాందపురాణమందుఁ జెప్పియున్నది. దక్షుని యారామభూమిగావున దాక్షారామమని చెప్పఁబడుచున్నదియని. ఇదియంతయుఁ గుమారస్వామి సోమయాజి ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమగు రత్నాపణమందు వివరించెను.

వ్యా త్రిలింగశబ్దాదేవ భవతి తెలుగు ఇతి నకారమధ్యకమపి పదం. తద్భవమేవేతి వ్యవజహారాచార్య ఆదిపర్వణి.

గీ. ఆంధ్రవిషయపురస్థాయు-లైనసకల।
జనములకునుమరుంగులే-శంబులేక।
చేటతెల్లముగాఁబలు-మాటలెల్ల।
నవనిశుద్ధాంధ్రదేశ్యంబు-లనఁగఁబడును॥

క పాలును పెరుగును నెయ్యిన్।
వాలాయముచట్టిఁబట్టి-పంచుకత్రావెన్।
రోలెకు—కచీబిడ్డఁడు।
జోలికనేమున్నదనఁగ-శుద్ధాంధ్రమగున్॥

క. కేశవయాంధ్రులునానా।
దేశంబులయందునిలిచి-తెలుఁగులెతత్త।
ద్దేశోక్తులట్లుబలికిన।
నాశబ్దములన్య దేశ-జాంధ్రములయ్యెన్॥

సీ. ఆలంబుచివ్వక-య్యముపోరుబవరంబు,
దురమనియొంటరి-దొమ్మికలను।
వెలఁదియింతిపడంతి-యొలనాగచెలిబోఁటి,
పొలఁతితొయ్యలినాతి-మెలఁతనెలఁత।

మేను వేరలిపోవి-కాను డెందంబుసుక్రు,
పీనులుల్లము కేలు- వెన్ను నొసలు।
వావిరి యేడ్తెర-వరలుట కొరలుట,
నలినొగి మొగిపర్వి-నలువుసొలపు।
గీ. నెలతునక వాఁక వలవంత-నెమ్మి నెఱక
లారజము సోయగము గొన-యంబు చిలువ।
యెల్లి చెచ్చెర మక్కువ-లెల్ల మియనఁ।
దనరు నిటులన్య దేశజాంధ్రములు కృతుల॥
ఆ. తవరతవిరోవయ-తావును ఘాకయు।
మొదలుగా ద్వితీయ-ములు చతుర।
వర్ణములు నుగల్గు-వాక్యంబు లన్యచే।
శ్యములుగాని వైకృ-తములుగావు॥ ఇత్యప్పకవిః.

తా. త్రిలింగ శబ్దమువలననే తెలుఁగు అను శబ్దము కలిగినది. (తెనుఁగు) అని నకారము మధ్యమందుఁగల పదముగూడ తద్భవమని యాచార్యుఁడాదిపర్వమందు వ్యవహరించెను. అప్పకవి యీ పద్యములను వ్రాసెను

వ్యా॥ సూ. ద్వివిధాదదుదేదోతోచో వక్రతమాశ్చాప్యనుస్వారౌచ కగచజయుగటడణతదనపబమ యరలవసహళంతు హల్వర్గః. ద్వివిధాః హ్రస్వదీర్ఘభేదేన ద్విప్రకారా అకారాదయః. వక్రతమౌచ ఐకారౌకారౌ వక్ష్యమాణసంజ్ఞౌ పూర్ణార్ధభేదేన ద్వివిధావనుస్వారౌచ ఏతే చతుర్దశ అచః. కగేతి. చజయుగం జయుగం చేత్యుభయత్ర యుగశబ్దస్యాన్వయః. దంత్యయో ర్వక్ష్యమాణత్వా ద్ద్వైవిధ్యం.

తా. (ద్వివిధ. అత్. ఇత్. ఉత్. ఏతో. అచః అని పదచ్ఛేదము) హ్రస్వములని దీర్ఘములనియు రెండు దెరగులుగల అకారాదులు [అనఁగా. అఆఇఈఉఊఎఏఒఓ అనునవి] వక్రతములనఁగా ముం

ము(జెప్ప(బడు సంజ్ఞగల ఐకార ఔకారములు పూర్ణానుస్వారమని యర్ధానుస్వారమని రెండువిధములుగల యనుస్వారములు అనుపదు నాల్గును అచ్చులు చజగయుగఅను హోటచయుగమని జయుగమని యుగశబ్దమునకు రెండుచోటులనన్వయము [అన(గా( చ̄చ̄ జ̄జ̄ అని యర్థము] దంత్యములుచెప్ప(బడునుగావున రెండుదెరగులు.

వ్యా. సూ॥ సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః।
హ్రస్వాత్పూర్ణోపిభవేద్దీర్ఘాచ్ఛేత్ఖండఏవసజ్ఞేయః॥

సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణః అర్ధశ్చేతిప్రత్యేకంద్వివిధః. కలంగె, చెలంగె,తలంగి తొలంగి ఇత్యాదౌసిద్ధానుస్వారః అలాక్షణికత్వాత్ రాము(డు కృష్ణు(డు ఇత్యాదౌసాధ్యానుస్వారః లాక్షణికత్వాత్. ససిద్ధస్సాధ్యశ్చ ఖండానుస్వా(ః హ్రస్వాల్లఘ్వక్షరాత్పరశ్చేత్ పూర్ణోపిభవేత్ అపి శబ్దాత్స్వరూపేణా పిస్థితోభవేత్. అర్ధానుస్వార ఏవఖండానుస్వారః కల(గి, కలంగి ఇత్యాది

తా సిద్ధమైనట్టియు సాధ్యమైనట్టియు అనుస్వారము పూర్ణమనియు అర్ధమనియు(బ్రత్యేకముగా రెండుతెరగులుగలది. కలంగె ఇత్యాదులయందు సిద్ధానుస్వారము ఎందువల్లనంటే అలాక్షణికము (అన(గా శాస్త్రముచేత(గలిగినదికాదు) గనుక రాము(డు ఇత్యాదులయందుసాధ్యము. ఎందువల్లనంటే లాక్షిణికము [అన(గాశాస్త్రముచేత(గలిగినది] గనుక సిద్ధమైనట్టియు సాధ్యమైనట్టియు ఆయర్ధానుస్వారము లఘ్వక్షరమునకు( బరమైతే నిండుసున్నయు నగును. [సూత్రమందు పూర్ణోపి అను] అపిశబ్దమువల్లనర్ధసున్న గా(గూడనుండును. అర్ధానుస్వారమేఖండానుస్వారమన(బడును.

వ్యా. దీర్ఘాత్పరశ్చేత్ఖండ ఏవనతుపూర్ణః వా(క, తో(క, వీ(క, పో(క, వా(డు,రా(డు,వీ(డు,లే(డు ఇత్యాది. విందు,ముందు,పొందు,కందు ఇత్యాదౌకేవలపూర్ణానుస్వారః వికృతివివేకేతు కెందమ్మి,

చెందొవ ఇత్యాదావను స్వారస్యసాధ్యస్యార్ధ బిందుతాయాం ప్రాప్తాయాం నఖండః ప్రథమాద్ధ్రిస్వాద్వైకృతేత్ర కదాపిచేత్యుక్తం. హ్రిస్వశబ్దేన హ్రిస్వాజంతో హల్వివక్షిత ఇతి. ఇఁక ఇంకేత్యాదావదోష ఇతిజ్ఞేయం'తత్రైవ' తృతీయేప్రథమేవర్ణేపర ఏవహిద్రృశ్యతే బిందుర్వైకృతమధ్యేత్ర నాన్యవర్ణేపరేతున ఇత్యుక్తం.

తా. అరసున్న దీర్ఘమునకంటెఁ బరమయిన తెలుఁగుల అరసున్నగానేయుండుఁగాని నిండుసున్నగాదు వాఁక ఇత్యాదు లుదాహరణములు. విందు ఇత్యాదులయందు కేవల పూర్ణానుస్వారము. [అనఁగా అరసున్నకు ఆదేశమయినదికాదు] వికృతివివేకమనుగ్రంథమందు, కెందమ్మి ఇత్యాదులయందు [తద్ధ్రితంచ బిందుస్స్యాత్-అనుసూత్రముచేత] సాధ్యమయిన అరసున్న రావలసి యుండఁగా మొదటిహ్రస్వముమీఁద నీతెలుఁగున నరసున్న లేదు- అనిచెప్పియున్నది. హ్రస్వశబ్దముచేత హ్రస్వాచ్చుపైఁ గలిగినహల్లువివక్షచేయఁబడినదికావున ఇఁక ఇంక ఇత్యాదులయందుఁ బ్రథమహ్రస్వముపయి నరసున్నయున్నను హల్లుపైనున్న యచ్చుకాదుగావున దోషములేదు వర్గతృతీయప్రథమ వర్ణములకుఁ బూర్వమందే సున్నయుండునుగాని తెలుఁగుననితరవర్ణములకు ముందుండదని యావికృతివివేకమందే చెప్పఁబడియున్నది.

వ్యా. ఆద్యప్రకృత్యామపి నందతి తృంహతీత్యాదౌసిద్ధసాధ్యభేద వానుస్వారోస్త్యేన పూర్ణార్ధభేదావత్రవిశేషఇతిజ్ఞేయం. "దీర్ఘాస్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చవతే గురవశ్శేషాస్సర్వే లఘ్వక్షరాఇతి జ్ఞేయా" ఇతి శ్లోకోప్యకవిపుస్తకే స్థితః సంయుక్తాద్యస్సంయుక్తవర్ణస్యాద్యోవర్ణః- శేషంసుగమం.

వ్యా వికృతివివేకే- సంయుక్తేసంస్కృతాద్యేప్యా త్సర్వమాంధ్రపదంలఘు। భవేదాద్యసమాసేపి రేఫయోగాత్పదంతథా। పదేపి చతథాత్వంస్యాత్క్వచిన్నైవనరేఫయోరితి స్థితం॥ రావణుని ద్రో

హిఁజంపఁగా-రాదటయ్యా। నిన్నె ప్రామిన్కొగము లెల్ల-నెన్నునయ్యా।'
ఇత్యాది తత్సమసమాసే రేఫసంయోగే పరేపూర్వపదస్య లఘుత్వే.
శతతాళదఘ్న హ్రదంబునంబడియె నిత్యాదయః కవిప్రయోగా ఉదా
హరణం. అద్రువక్ విద్రువక్ ఇత్యాదావేకపదేపి సంయుక్తే పరే
పూర్వస్యలఘుత్వం. వట్రువ ఇత్యాదౌ నలఘుత్వం. రేఫద్వయసం
యోగే పరేతు నకదాచిదపిలఘుత్వం. వెఱ్ఱి నుఱ్ఱి ఇత్యాదికమత్రో
దాహరణం.

తా. సంస్కృతము మొదలగు శబ్దములయందలి సంయుక్తము పర
మగుచుండఁగా నెల్లయాంధ్రపదములును లఘువులగును. సంస్కృత
సమాసమందుఁగూడ నొకానొకచోట రేఫసంయోగమువలనఁ బూ
ర్వాక్షరము లఘువగును. ఏకపదమందుఁగూడ రేఫసంయోగమువల
నఁ బూర్వాక్షరము లఘువగును. ఒకానొకచో నేకపదమందు రేఫ
సంయోగమువలనఁ బూర్వాక్షరము లఘువుకాదు. రేఫద్వయసం
యోగము పరమగుచుండఁ బూర్వము లఘువుకాదు. అని వికృతి
వివేకమందున్నది. ఈశ్లోకమునకు వివరణము నిటుపైని వ్రాయుచు
న్నాఁడు. రావణుని ద్రోహి ఇత్యాదికము మొదటివాక్యమునకుదా
హరణము. తత్సమసమాసమందు రేఫసంయోగము పరమగుచుండఁ
బూర్వమునకు లఘుత్వమందు శతతాళేత్యాది కవిప్రయోగములుదా
హరణము. అద్రువక్ ఇత్యాదులయందు నేకపదమందును సంయు
క్తము పరమగుచుండఁగాఁ బూర్వమునకు లఘుత్వము. వట్రువ
ఇత్యాదులయందు లఘుత్వములేదు. రేఫద్వయసంయోగము పరమ
గుచుండఁ బూర్వమునకు లఘుత్వమెన్నఁడును లేదనుటకు వెఱ్ఱి
ఇత్యాదులుదాహరణములు.

వ్యా. న్యతరత్సాకరేప్యుక్తం॥ స్యాద్గురుస్స్వరోవిసర్గాంతోదీర్ఘో
యుక్తపరశ్చయః। వాపాదాంతస్త్వసౌగ్వక్రోజ్ఞేయోన్యోమాత్రికో
ల్పజుః। హ్రాదాదావిహవర్ణస్య సంయోగః క్రమసంజ్ఞికః। పురసితేన
తేనస్యా ల్లఘుతాపిగురోఃక్వచిదితి. తద్వ్యాఖ్యాయాం కనకసభా

ష్ఠితినాసౌరికం. వాపాదాంత ఇతి. పాదాంతే యోలఘుస్థితిసోప్య పేక్షాయాం గురుర్భవతీత్యర్థః పాదాదావితి ప్రథమపాదే తృతీయ పాదేవాయదంత్యాక్షరం లఘుభూతం తదపియుక్తపరతయా గురు భూతమపిక్వచిదపేక్షాయాం లఘుర్భవతీత్యర్థః। తరుణంసర్షపశాకం నవౌదనంపిచ్ఛిలానిచదధీని। అల్పవ్యయేన సుందరి గ్రామ్యజనోమృష్ట మశ్నాతీత్యుదాహరణం। అత్ర సుందరితితృతీయ పాదాంతేయద క్షరం లఘుభూతంతదక్షరం గ్రామ్య ఇతియుక్తపరతయాగురుభూత మప్యపేక్షయా లఘుర్భవతి. వాపాదాంత ఇతి గురులక్షణస్యాప్య త్రోదాహరణం ద్రష్టవ్యం। ద్వితీయపాదాంతే చతుర్థపాదాంతేచ యత్। ఇతి ఇత్యక్షరద్వయం తదపేక్షితత్వాద్గురుత్వమేవ ప్రాప్నోతి అత్రార్థేచతాత్పర్య మితిసారావళ్యాంవిశిష్యోక్తం। సర్వాస్వపిచభాషాసు రహాయుక్తేక్ష రేపరే। పూర్వవర్ణస్యలఘుతా వేష్టాముల్హాదికేపిచ॥ ఇతి

తా. అనుస్వారముతోఁ గూడినదియు విసర్గ మంతమందుగలదియు-దీర్ఘము ను సంయుక్తాక్షరము పరమందుగలదియు పాదాంతమందున్నదివికల్పముగాను గురుసంజ్ఞగలది- ఇదివ్రాతయందువంకరగానుండును. [అనఁగా ( ఇట్లువ్రాతురు ] తక్కినయేకమాత్రగలదిలఘువు ఇది వ్రాతయందుఁదిన్నగానుండును. [అనఁగా| ఇట్లువ్రాతురు) ఇందుఁబ్రాదాదియందున్న సంయుక్తవర్ణముక్రమమని పేరుగలది అదియుండుటచేఁగా నొకానొకచోట గురువర్ణము లఘువగును. అనివృత్తరత్నాకరమందుఁ జెప్పఁబడియున్నది దాని వ్యాఖ్యయందుఁగనకసభాపతియేమని చెప్పినాఁడంటే. వాపాదాంతే అనఁగాపాదాంతమందుయేలఘువుగలదో అదియు గురువుగావలవలసినయపేక్ష గలిగినేని గురువగుచున్నదియనియర్థము పాదాదౌ అనఁగా. ప్రథమపాదమందుఁగాని తృతీయపాదమందుఁగాని లఘువైనయేయంత్యాక్షరముయుక్తాక్షరము పరముగుటచేగురువగుచున్నదో అదియునొకానొకచోట లఘ్వపేక్ష గలుగుచుండఁగా లఘువగును. అనియర్థము.

రత్వమును ఎక్కడఁ బ్రసిద్ధమయినదని శంకించిచెప్పుచున్నాఁడు. అ న్యేన్యవ్యాకరణ అని రేఫవ్యతిరిక్తము లయిన యవలలు లఘ్వలఘు భేదముచేత నాంధ్రవ్యాకరణవ్యతిరిక్తములయిన సంస్కృతప్రాకృత వ్యాకరణములయందు స్పష్టములయినవి అది యెట్లంటే- వ్యోర్లఘుప్రయత్నేత్యాది పాణినీయసూత్రమందు యవలకులఘ్వలఘు భేదముచేశ ద్వివిధత్వముస్పష్టమయినది దేనినుచ్చరించునపుడు నాలుక యొక్కకొనకు, కొనసమీపమునకు, మధ్యమునకు, మొదలికివిడియుండుటగలదో అదిలఘూచ్చారణముగలది. దేనినుచ్చరించుటయందు జిహ్వాగ్రాదులకు విడియుండుటలేదో అది అలఘూచ్చారణము గలది. అనిశబ్దశాస్త్రజ్ఞుల సిద్ధాంతము

వ్యా లస్య ద్వైవిధ్యం లోళఇతి వాల్మీకీయనూత్రే స్ఫుటం. రస్తురేఫస్తు. అత్ర అత్రైవాంధ్రవ్యాకరణే ద్వివిధః లఘ్వలఘు భేదేన గృహ్యతే. అన్యవ్యాకరణస్పష్టయవలానాం ద్వైవిధ్యం అత్రాప్యస్తిరేఫస్య ద్వైవిధ్యం త్వత్రైవ గృహ్యతే. గసడదవాస్స్య రితి సూత్రేణ ప్రయోపకారస్యోత్ర లఘువకారస్సచ. అతఁడువలికెనిత్యాదౌ స్ఫుటః- యత్రశ్రుతిమార్యా ఇతి సూత్రేణోక్తో లఘుయకారస్సచ. మేనయత్త ఇత్యాదౌ స్పష్టః. బెళుకుంజూపులు, తళుకుంజెక్కులు, పొలఁతి, చెలువ ఇత్యాదౌ లస్య ద్వైవిధ్యం.

తా. లకారమునకు ద్వివిధత్వము లోళః అను వాల్మీకీయ సూత్రమందు స్పష్టమయినది. రేఫమయితే యీయాంధ్రవ్యాకరణమందే రెండుతెరఁగులుగలది. అనఁగా లఘ్వలఘుభేదముగలది. ఇతర వ్యాకరణములయందు స్పష్టములయిన యవలలకు రెండుతెరగులగుటయీ వ్యాకరణమందునుగలదు. రేఫమునకుద్వైవిధ్య మీవ్యాకరణమందే గ్రహించఁబడుచున్నది- గసడదవాస్స్యః అనుసూత్రముచేత పకారమునకాదేశమగు ఏవకారముగలదో అదియీ వ్యాకరణమందు లఘువు అతఁడువలికె నిత్యాదులయందు [ముందు] స్పష్టము కాగలదు. యత్రశ్రుతిమార్యాః అను సూత్రముచేతఁ జెప్పఁబడినది లఘుయకార

ము. అడియుమేఁనయత్త ఇత్యాదులయందు స్పష్టము. తళుకుఁజూపులు ఇత్యాదులయందు లకారమునకు ద్వివిధత్వము.

వ్యా మెఱుఁగు, మఱాఁగు, కరుఁగు, పొరుగు ఇత్యాదిషు రేఫస్య ద్వైవిధ్యంరూఢం తచ్చ్యుతద్వివేచకగ్రంథాదవగంతవ్యం. కుత్రచిదేకస్యైవ లఘుత్వం గురుత్వంచాప్యస్తి లఘుర్భవేద్గురుః క్వచిద్గురుశ్చ లఘుస్తథా । ఉచ్చారణస్యకల్పత్వాన్నిదానంతత్రిసద్వచ ఇత్యథర్వణవచనాత్.

సీ. పరమాత్మపదములఁ-దొరఁగిపాఱెడునేటి,
తరఁగలపైలీల-దాటిదాటి ..।

గీ. పొగడప్రాకులమొదలను-బుష్పరసము।
దొరఁగిసెత్తావియందున-నెరయనొప్పె .."

ఇతి నృసింహపురాణే ప్రయోగః. ఏవం తత్రతత్ర సుకవిప్రబంధేషు ద్వైరూప్యం ద్రష్టవ్యం

తా. మెఱుఁగు ఇత్యాదులయందు రేఫమునకు ద్వివిధత్వము నిశ్చయమైనది. ఆద్వైవిధ్యమును దానినివివరించు గ్రంథమువలనఁ దెలియఁదగినది ఒకానొకచో నొకదానికే లఘుత్వమును గురుత్వమును గలదు ఇందునకు అథర్వణవచనము. "లఘుర్భవేత్" ఇత్యాది. ఒకానొకచో గురువులఘువగును, లఘువు గురువగును ఏమనిన నుచ్చారణము కల్పించఁదగినదిగనుక. ఇందుకు విద్వాంసులవాక్యము ప్రమాణము. అని. ఉదాహరణము పరమాత్మపదముల ఇత్యాది నృసింహపురాణప్రయోగము. ఈలాగున నచ్చటచ్చట సత్క్రవిప్రబంధములయందు రెండు రూపములు కలుగుట చూడఁదగినది.

వ్యా. శ్లో॥ క్రియాంతేచాన్యవర్ణేచ లఘురేఫాః ప్రకీర్తితాః. ద్వివిధాదిదుతశ్చస్యురయవౌచకగౌతథా । చకౌపబౌతదౌవర్ణ సమరంవనసంయుతాః । ఏతేద్వితీయసంయుక్తా రేఫోత్యత్రితుసమ్మతః । లఘుర్నాస్తిజకారస్యాల్లఘునస్యకిదాపినా । లఘువఖ్యిఖిశైలాగ్నయోన్యేభాగజబర్హిషః । వేదాశ్చైతేప్రయోగేషు స్యురుచ్చారణభేదతః।

యథాయథం ప్రయోగార్హా రేఫాస్సర్వేప్రయోగతః । అన్యేంతరిక్ష ఖద్యశ్లో స్యేనయుక్తాః కదాచిచ। ఖేదిద్వతంతి వలఘూన్ బిందుబాణ శిలీముఖాన్ । తథానదంతి కేచిత్తు హర్యంఘ్రిఖశరాన్ పరాన్।అని శ్చయోభవేద్యత్ర గ్రామమానుష నామసు । రేఫయోర్నిశ్చయస్తత్ర రేఫమాత్రైక గోచరఇతి- విశేషాస్తేన ఇవోక్తాః అన్యవర్ణ ఇత్యత్ర అద్రుమ, చిద్రుప, వట్రువ ఇత్యాద్యుదాహరణం ద్రష్టవ్యం-

తా. క్రియాంతమందును, ఇతరవర్ణమందును అనఁగా అద్రువ, బిద్రుప, వట్రువ ఇత్యాదులయందు లఘురేఫములని చెప్పఁబడు చున్నవి.

సూ॥ అద్యః క్రియాసు భూతార్థద్యోతినమాద్యగం వినా సర్వః । యత్రస్యుతిమార్యాలఘుయం ప్రవదంతి ప్రాణతః పరంప్రాణం॥

వ్యా. క్రియాసుభూతార్థ ప్రకాశికం నామాద్యగంచ యకారం వినాయః అత్ అకారవాన్ భవతి- తయోస్త్వేత్వ మిత్యర్థః- "యెవ్వఁడు, యెప్పుడు, చనియెన్ కనియెన్ ' ఇత్యాద్యుదాహరణం- తత్రక్రియాయాం "క్త్వాభూతయోఃక్రియాంతస్యేది తీత్వం" "వర్ణాగమో విశేషఇతియత్వం ' "ప్రథమైకస్యైద్భవేచ్ఛభూతార్థే ఇతి ఎత్వం '

తా- క్రియలయందు భూతార్థమును జెప్పునదియు, నామములమొదటిని బొందినదియు నగు యెకారముదక్క తక్కినవి అకారముగలవియగుచున్నవి- ఆరెంటికనైతే ఎకారమని తాత్పర్యము- ఉదాహరణము- యెవ్వఁడు, యెప్పుడు, చనియెన్, కనియెన్. అందు చనియెన్ ఇత్యాది క్రియయందు "క్త్వార్థమందును భూతార్థమందును, క్రియాంతమునకు ఇకారము వచ్చును- అనుసూత్రముచే (చని, అని వచ్చినది, వర్ణాగమము విశేషము అనిసూత్రముచే యకారము రాగా

(చనియు, అని వచ్చినది) ప్రదమైకవచనమునకు భూతార్థమందు ఎత్వమగును-అనుసూత్రముచే యత్వము రాగా [చనియెన్, అనివచ్చినది]

వ్యా. చనెన్, వినెన్, కనెన్, ఇత్యాదిక్రియాప్రయోగోపి ప్రబంధేషువర్తతేతత్ర "శ్లో॥ ఏదంతతాచనామ్నామన్యతరస్యామియాంతానామితి" సూత్రంనప్రవర్తతే నామ్నామితినామమాత్రస్యైవగ్రహణాత్. కింతు. వికృతివివేకసూత్రేణ తన్నిర్వాహః "యస్యాద్దేశ్యక్రియాంతేతుభూతార్థ ఏకత్వవాచక" ఇతియః "ఇత్స్యాద్భూతబహుత్వేపిదేశ్యేతూభయతోభవే" దితి ఇత్వం. "డుడాద్యాదివర్ణేభూతార్థే చాపితస్యైభవేత్సదా" ఇతి ఎత్వం- చనియెన్, కనియెన్, వినియెన్, ఇత్యాది- "ఇయాంతాస్సాధవశ్శబ్దాః క్వచిదేదంతతాపివా" ఇతివా ఎత్వం "అచోచిత్క్వచిల్లోపో బహుళంస్యాత్ప్రయోగతః" ఇతి ఇకారలోపః- చనెన్ ఇత్యాది-

తా- చనెన్, వినెన్, కనెన్, ఇత్యాది క్రియాప్రయోగమును ప్రబంధములయందుఁగలదు- అందు "ఏదంతతాచనామ్నాం" అను సూత్రములో నామమాత్రమునకే గ్రహణమువలన నాసూత్రము ప్రవర్తింపదు- ఇఁకనేమంటే, వికృతివివేకసూత్రముచేత దానినిర్వాహమగును [ఎట్లంటే] దేశ్యక్రియాంతమందు భూతార్థమందు ఏకత్వమునుజెప్పునట్టి యకారమువచ్చును- అనుసూత్రముచే యకారముకలిగినది- భూతార్థబహుత్వమందు దేశ్యక్రియయందు ఇకారముభయత్రవచ్చును- అనుసూత్రముచే ఇకారమువచ్చినది- డు, డి, మొదలగు వర్ణముపరమగునపుడును, భూతార్థమందును దానికి ఎత్వమువచ్చును- అనుసూత్రముచే ఎత్వమువచ్చినది చనియెన్ ఇత్యాదులు- ఇయాంతములగు శబ్దములుసాధువులు- ఒకానొకచో ఏదంతత్వమును వికల్పముగానగును- అనుసూత్రముచే వికల్పముగా ఎత్వమువచ్చినది- అచ్చునకచ్చుపరంబగునపుడు ఒకానొకచో ప్రయోగమువలనబహుళముగా లోపముగల్గును- అనుసూత్రముచే ఇకారలోపముకలిగినది- చనెన్ ఇత్యాది.

వ్యా. అత్రేయంచింత్యా- వాఁడెవ్వఁడుఇత్యాదౌ సర్వత్రాజంశేన సంధిశ్రవణాత్- "సీ- ఎవ్వనివాకిట-నిభమదపంకంబు" ఇత్యాదౌ ఏకారంపరిత్యజ్య ఇకారవశేః ప్రయుక్తత్వాత్ప్రయోజనాభావాచ్చ ఆద్యగయకారస్య ప్రాణ్యంశో సుపపన్నఇతి తత్త్యాగో వక్తవ్యః- వికృతి వివేకేపి శ్రీకవిమతేపి ప్రాణ్యం శత్యాగ ఏవ విహితః- "వికృత్యాదిగతో యోత్రస్యాచ్ఛబ్దాంతరయోగతః। ప్రాణమాత్రావశేషస్య దత్రశ్రీకవిసమ్మతేరిత్యుక్తేః-

తా. ఇక్కడికి ఆలోచించవలెను- వాఁడెవ్వఁడు ఇత్యాదులయందు అంతటను అచ్చుయొక్క అంశముతోనే సంధి వినఁబడుట వల్లను, ఎవ్వనివాకిట నిత్యాదులయందు, ఏకారమును గూర్చియే ఇకారయతి ప్రయోగించఁబడుటవలనను, ఏకారముయొక్క ప్రయోజనము లేకపోవుటవలనను మొదటి యకారమునకు హాలంశము తగినదికాదు- కావున దానిని విడచుట చెప్పఁదగినది- వికృతివివేకమందును శ్రీకవిమతమందును హాలంశమును విడచుట చెప్పఁబడినది- ఎట్లంటే, లెస్సఁగుశబ్దమునకు మొదటనున్న యకారము ఇతర శబ్ద సంబంధమువలన శ్రీకవిమతముచేత అచ్చుమాత్రము మిగిలినదియగును- అని చెప్పుటవలన-

వ్యా- శబ్దశాసనస్యాపి హాలంశత్యాగోభిమత ఏవ సర్వత్రాజ్వత్కార్యమితి పూర్వసూత్రేణ లుక్సంశ్లేషయోః ప్రాప్తౌ, లుక్సంశ్లేషానాచి ద్రుతస్యేతి సూత్రేణ విహితమచి లుక్సంశ్లేషాభావ లక్షణం కార్యం, ద్రుతప్రకృత్యుపరిస్థితస్య యస్యాతిదిస్యతే. అచిలుక్సంశ్లేషాభావే ద్రుతస్యాచాసహ నిత్యసంబంధఃక్లుప్తః- సచాత్రాపి ప్రాప్తఏవ- సోప్యత్రప్రాణ్యంశత్యాగమంతరానసిధ్యతీతి- "వారలకెగ్గుజేసినఁ జెడునిహముంబరంబు" నిత్యాది తత్ప్రయోగశ్చాత్ర మానం-

తా- బద్దానుశాసనునికిని, హాలంశము విడుచుట సమ్మతమే అంతటను, అచ్చునకువలె యకారమునకుఁ గార్యముచేయవలసిదనుపూ

ర్వసూత్రము చేత లోపసంశ్లేషములు వచ్చుచుండఁగా ద్రుతమునకచ్చు పరంబగునపుడు లోపసంశ్లేషములు కలుగవను సూత్రము చేత విధింపఁబడిన లోపసంశ్లేషములు లేకపోవుటయను కార్యము ద్రుతప్రకృతికముమీది యకారమున కతిదేశింపఁబడుచున్నది. ద్రుతమునకచ్చుపరమగునపుడు లోపసంశ్లేషములు లేకపోఁగా ద్రుతమునకచ్చుతో నిత్యసంబంధము కల్పింపబడినది ఆసంబంధ మిచ్చుటంగూడ ప్రాప్తించినది. ఆసంబంధము నిచ్చుట పాలంశమును విడువక సిద్ధించదు. వారలకెక్కఁజేసిన నిత్యాదికమగు నాచార్యప్రయోగము నిచ్చుటఁ బ్రమాణము.

వా. యద్యపి పోయెదనిత్యాది తద్భవక్రియాగతస్య పయ్యెద ఇత్యాదిశబ్దస్థితస్యాపి యస్యైత్వమేవ। తథాపి తత్రైత్వసంగ్రాహకం మూలసూత్రమితి మంతవ్యం। తత్ర ప్రబంధే పోయెదనిత్యాది పద ప్రయోగస్స్ఫుట ఏవ- ఆథర్వణగ్రంథే తు పోయెదనిత్యాదౌ। భావిక్రియాసు యస్యైత్వే ఏవ ప్రయోగః॥ ఇతి భావిక్రియా వ్యవహారేణ ఏత్వం విహితం పయ్యెద ఇత్యాదినామగతస్యాపి "డోలాభూషోత్తరీయాణాం నైత్వం నాస్తి మధ్యయ" ఇతి పృథగేత్వం విహితమేవ.

టీ. ఆలోచింపఁగా పోయెదన్ మొదలగు తద్భవక్రియలందుండినట్టియు, పయ్యెద మొదలగు శబ్దమందున్నట్టియు, యకారమునకు ఎత్వముగలదు. అయినను అచ్చటి ఎత్వమును మూలసూత్రము సంగ్రహించుచున్నదని తెలియవలెను. ఆయాచార్యప్రబంధమందు పోయెదనిత్యాదిపదప్రయోగము స్పష్టము ఆథర్వణగ్రంథమందైతే భావిక్రియలయందు యకారమునకేత్వమే ప్రయోగమువలనఁ గలుగునని పోయెదన్ మొదలగుచోట భవిష్యత్క్రియావ్యవహారము చేత ఏత్వము విధింపఁబడినది మఱియు, ఉయ్యెల, తాయెతు, పయ్యెద అనుశబ్దములందుకు మధ్యయకారమందెత్వము లేదని దానికివేఱుగా ఏత్వము విధింపఁబడినది.

ఎల] కలిగినది. హృదయశబ్దమువలన ఎదశబ్దముకలిగినది. ఈమూడు శబ్దములయందు అజాదిత్వము. వెనుక జెప్పిన ప్రకారము సంధివేళ యందులఘుయకారత్వము. అంతమాత్రమున యకారాదిత్వము లేదు. తారొతులు నుయ్యెలయు ఇత్యాదిరూపములకి న్నిర్వద్యముగలదు ఈపాఠము చాలసరిస్వతి పుస్తకమందున్నది ఈపాఠము ననుసరించియిట్లు వ్యాఖ్యానము చేయఁబడినది- అతఁడున్నది యిట్లు వ్యాఖ్యానముఁ జేసి యీయనుపపత్తి నెత్తలేదు

వ్యా. అప్పకవిపుస్తకేతు "అద్యః క్రియాసుభూతాద్యర్థ సముద్యోతిపంజినాసర్వ" ఇతిపాఠస్థితః ఆదిశబ్దేన పోయెదర్ చనియెదర్ ఇత్యాదావేత్వంసిద్ధం- పూర్వపాఠేత్వే తన్నగృహ్యతే- కల్పనాగౌరవమతీవాపాద్యతే, నచోచ్చారణలాఘవమేవతస్యైత్వే ప్రయోజనంతదర్థం కల్పనాగౌరవమంగీకార్యమితివాచ్యంతదభావేపి బాధకాభావేన తదపేక్షయాతి కల్పనాగౌరవస్యానుచితత్వాత్. ఆద్యావర్ణాస్తుహత్త్వేన నగృహ్యంతే కదాపిచేత్యథర్వణాచార్య స్యస్వసిద్ధాంత వచనాచ్చ తస్మాదప్పకవి పుస్తకపాఠ ఏవసాధురితిప్రతిభాతి. సర్వత్రాజ్యత్కార్యమితి సూత్రంతుతత్పుస్తకే నదృశ్యత ఏప తేన ఎవ్వఁడు ఇత్యాదావాయత్వమాదౌ నపండితహృదయంగమం.

తా. అప్పకవిగ్రంధమందైతే "అద్యః క్రియాసుభూతాద్యర్థసముద్యోతిసంపినాసర్వః" అనుపాఠమున్నది. ఈపాఠమందాదిశబ్దము చేత పోయెదర్ ఇత్యాదులకేత్వము సిద్ధించినది- పూర్వ పాఠమందైతేయిది గ్రహింపఁబడదు- ఇందుమిక్కిలి కల్పన యొక్కువయగును- ఉచ్చారణలఘుత్వమే దానికేత్వమగుటయందుఁ బ్రయోజనము దానికైకల్పనాగౌరవమంగీకరించదగినదియని చెప్పఁదగదు. పాఠలాఘవములేకున్నను బాధలేనందున దానిద్వారా కల్పనాగౌరవముచితము కాదు- మొదటివర్ణములు [అనఁగా యకారమని శబ్దాదినివ్యవహరించువరములు] హల్లులుగా [అనఁగా యకారములుగా] ఎప్పుడునుగ్రహింపఁబడవు అనునథర్వణాచార్యుని సిద్ధాంతమువలనను అప్పకవిపు

స్తకమందలి పాఠమేమంచిదియని తోచుచున్నది. సర్వతాన్త్రిజ్యత్కార్యం అనుసూత్రమప్పకవిపుస్తకమందుఁ గాన్పించదు. కనుక ఎవ్వఁడు ఇత్యాదులయందు మొదటయకారము పండితులమనసునకెక్కినదికాదు

వ్యా॥ కించ "వికృతిపదాదౌ ప్రథమాంతస్థ తృతీయానునాసికౌ న స్తః క్వచిదపి నస్త ఉమాతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ ఇతిచ తత్పుస్తకే పఠితం, ప్రథమాంతస్థో యకారః తృతీయానునాసికో ణకారః ద్వితీయాచార్యేణాపి వికృతాదౌ భవేన్న ఇత్యుక్తం- దంతోష్ఠభవస్య వకారస్య తేన ఊరు, ఉవిద, ఇత్యాదౌ అచ్చత్వం నిర్వివాదం- అన్య ప్రకృత్యామపి వోఢృశబ్ద ఏవశబ్దాదౌ వకారస్య ఓత్వం దృశ్యతే.

తా. మఱియు నాంధ్రపదమునకు మొదట యకార ణకారణములును ఉకార ఊకారములతోఁగూడిన వకారమును లేవు అనియు నతని పుస్తకమందున్నది. ద్వితీయాచార్యుఁడును ఆంధ్రపదాదియందుణకారము లేదనిచెప్పెను. కావున ఊరు ఇత్యాదులయందచ్చు అగుట వాదములేనిది సంస్కృతమందును వోఢృ [వోఢవ్య, వోఢవత్] శబ్దాదయందు మాత్రము వకారమునకు ఓత్వము గానవచ్చుచున్నది. (శబ్దాదిని ణకారము లేదు.)

సూ. యశ్రుతిమార్యాలఘుయంప్రవదంతి ప్రాణతః పరంప్రాణం.

వ్యా॥ యశ్రుతిమితి ప్రాణతః పరంప్రాణం యశ్రుతిం యకారస్య శ్రుతిరివశ్రుతిర్యస్యసః యశ్రుతిః- తంప్రవదంతి- ఆర్యాః పండితాః యశ్రుతిత్వం సంహితాయా ముచ్చారణసౌకర్యార్థం, అర్ధప్రకారస్తు స్వరూపేణైవేతిస్పష్టం తమేవలఘుయం లఘుయకారంచప్రవదంతి.

తా. అచ్చునకంటెఁ బరమైనయచ్చును యకారమువలె వినఁబడు దానిఁగాను పండితులుచెప్పుచున్నారు. యకారమువలె వినఁబడుట యువ్యవహితోచ్చారణమందు సులభత్వమునకుఁ జెప్పఁబడినది. అర్థముయొక్కరీతి స్వరూపము చేతనేయగును అనుటస్పష్టము దానినే లఘుయకారమనియుఁ జెప్పుచున్నారు.

వ్యా ఏతచ్చవిధానమస్యా లఘుయకారేణ సాకంసావర్ణ్యార్థం- యశ్రుతిత్వ విధానమాత్రేణనసావర్ణ్యసిద్ధిఃస్యాత్ - తేన ప్రాసమైత్రీ ఉభయోర్నభవేదితి తద్విధానం సార్థకమితిధ్యేయం- అత ఏవాను పదమేవోచ్యతే నాన్యేషామితి- అథర్వణగ్రంథేతు॥ ప్రాణాత్ప్రాణోలఘుర్యస్స్యాత్ స్వహల్పాచ్చభవేత్క్వచిత్ । చేద్యత్వంతస్యకల్ప్యంస్యాద్వికృతాదౌభవేన్నణ ఇత్యుక్తం. ఆయతివసుశోభనాకృతియును. ఇత్యాద్యావర్థభేద ఉభయవిధత్వమితిజ్ఞేయం.

తా. ఈలఘుయకారమును విధించుట యీఅుకారమునకు లఘుయకారముతోఁగూడ సవర్ణత్వముకొరకు- యశ్రుతిత్వమును విధించినంతమాత్రముచేత సవర్ణత్వసిద్ధికాదు. కావున రెంటికినిఁ బ్రాసమైత్రిలేకపోవును. కావునదానివిధించుట సార్థకమైనదని తలంచవలయును. కనుకనే వెంటనే నాన్యేషాం అనిచెప్పఁబడినది. అథర్వణగ్రంథమందైతే అచ్చునకంటెఁ బరమైనయచ్చు లఘుయకారమగును- దానికి యత్వముకల్పించవలసియుండెనేని అది యొకానొకచో అచ్చునుహల్లునగును- తెలుగుశబ్దములమొదట ణకారములేదు అని చెప్పఁబడినది ఆయతివసుశోభన- ఇత్యాదులయందు [ఆ, అతివ. అనియును, ఆయతి, అనియును.] అర్థభేదమం దుభయవిధములగుట కలదు.

సూ. నాన్యేషాంవైధర్మ్యం లఘ్వలఘూనాం రయో

స్తునిత్యంస్యాత్.

వ్యా. అన్యేషాం రేఫవ్యతిరిక్తానాం లఘ్వలఘూనాం యవలానాం వైధర్మ్యమన్యోన్య విరోధో నాస్తియతిప్రాసమైత్రీ భవతీత్యర్థః- భూమతికీర్తి బ్రాహ్మణుండు పుట్టంగఁదోఁచెఁ పుట్టునితఁడన్భట్ట చార్యవచనం- రయోర్గురు లఘ్వోరేఫయోస్తునిత్యం వైధర్మ్యంస్యాత్- కదాచిదపియతిప్రాసమైత్రీ నాస్తీత్యర్థః. వికృతివివేకేపి- కశ్చిద్వ్యతిసాంగత్యం యతౌవేవానయోస్తథా అవదచ్ఛత్రిసాంగత్యం ప్రాసేప్య పిచకశ్చన- ఇత్యుక్త్వాకయోశ్చిత్తమైత్రీ కల్పకయోర్మతిముభయత్ర కశ్చిచ్ఛబ్ద ప్రయోగేణాత్యంత పండితంమన్యతాధ్వనవద్యారాపరాక్ర త్వ ద్వితీయాచార్యేణ- అనయోస్సంగతింయస్తు కరోతికవితాకృతౌ, అస్యా అత్యంతదోషత్వా ద్దుష్కావి స్సహీకథ్యత ఇతి స్వమతం ప్రకాశితం- ఏవంసతి.

క. పురసతులవిలోకనములు।
సరసాలాపములునర్మ-సంభోగములున్।
మఱిగిహరిమానలనొల్లఁడు।
నరవరులోయమ్మనాతి-నప్రియులుగదే॥

క. గ్రక్కునఁజనిబ్రాలుదునో।
అక్కలుగట్టుకొనిదేవ-రిపుమేడలపై।

నిత్యాదిపద్యేషు పోతన్నసూరన్న ప్రముఖైః కైశ్చిదుభయోర్మైత్రీ ప్రయుక్తాసానాకరత్వా దప్రామాణికీతిసుధీపురోగైరను సందేయం.

తా. రేఫగాక తక్కిన లఘ్వలఘువులైన యలవలకు విరోధము లేదు- యతిప్రాసలయందు మైత్రిగలదనియర్థము॥ భూనుతకీర్తిత్యాద్యాచార్యవచనము యతిమైత్రి కుదాహరణము, లఘ్వ లఘు రేఫములకు వైధర్మ్యమునిత్యముగనగును. ఎన్నడును యతిప్రాసమైత్రిలేదని

యర్థము. ఒకానొక డీరేఫములకు యతియందు మాత్రము మైత్రిని జెప్పెను- ఒకానొకండు ప్రాసములయందుంగూడ మైత్రినిం జెప్పెను- అని విక్రృతి వివేకమందుం జెప్పి యతిప్రాసమైత్రి కల్పనం జేసిన యొ [illegible] సులతోగూ రెండుచోట్ల కల్పిచ్చి ప్రయోగించుటచేత మిక్కి [illegible] నా పిలంచి కొనుటను దెలియంజేయుటచేతం దిరస్క [illegible] ఈరేఫముల [illegible] కవితయందుం గల [illegible] అపరిమితమిక్కిలి దోషముంటచేత నాకవిదుష్కవి [illegible] తనమతమును ప్రకాశింపంజేసెను- ఈలాగుననుం [illegible] ప్రసవంల ఇత్యాది పద్యమందు మఱిగి యను వలనురేఫము [illegible] లఘురేఫ [illegible] ప్రాసము గ్రక్కున ఇత్యాది పద్యమం [illegible] [illegible] లఘువులను రేఫములకు యతి యును జేసి పోతన్న [illegible] కొందఱు రెంటికిని మైత్రి జెప్పిరి అట్లుచెప్పుట కాధారం బేమియు లేదుగావున నప్రామాణిక [illegible] విద్వచ్ఛ్రేష్ఠులు తలంపవలెను.

సూ॥ అద్దంత్యాస్తాలవ్యాశ్చేర్వక్రస్యాన్త్రి మిథస్సవర్ణశ్చ.

వ్యా. అద్దంత్య ఇతి. అత్రవికృతౌ దంత్యశ్చవర్గః- అత్ అకారవాన్ భవతి. చని, చయిరు, చెర, చప్పుడు, ఇత్యాది తాలవ్యశ్చవర్గః అత్రవక్రస్యాత్ - ఏకారవాన్ భవతి చెవి, జేవురు, చెమట, చెలువు ఇత్యాది చురిత్యస్య చవర్గసంజ్ఞాత్వం. అణుదిత్స వర్ణస్య చాప్రత్యయ ఇత్యాద్య వ్యాకరణసిద్ధం. మిథస్సవర్ణశ్చ. అత్ర త్యోర్దంత్య శ్చరాద్యారూణాం తాలవ్యశ్చమిథః అన్యోన్యం య [illegible] ప్రాసయో స్సవర్ణశ్చ భవేత్. 'చదలేటిబంగారు-జలజహంబుల [illegible] [illegible] జంబులు నాకుం-బూవుబోడి' ఇత్యాదిక మత్రోదాహరణం- వక్రచవర్గస్యాను సంస్కృతచవర్గేణ దంత్య చవర్గేణాచ [illegible] మైత్రీమాత్రమస్తి ప్రాసేస్వరమైత్ర్యపేక్షాయా అభావాదితి జ్ఞేయం.'

తా. ఈ తెలుఁగునందు దంత్యమగుచవర్గము అకారముగలదియగుచున్నది. చవి ఇత్యాదులుదాహరణములు. తాలవ్యచవర్గము ఏకారముగలది చెవి ఇత్యాదులుదాహరణములు. చుః అను దానికి చవర్గసంజ్ఞయగుట అణుదిదిత్యాది సంస్కృత వ్యాకరణమువలనఁ గలిగినది [విధింపఁబడని అప్రత్యాహారవర్ణమును హ్రస్వోకారం మిత్సంజ్ఞ గలదియు సవర్ణమునకు సంజ్ఞయగునని సూత్రార్థము. ఇందు చకారము హ్రస్వోకారమిత్సంజ్ఞగలదిగదా] ఈభాషయందలి దంత్య చవర్గమును సంస్కృతమునందలి తాలవ్య చవర్గమును పరస్పరము యతిప్రాసలయందు సవర్ణమునగును. చదలేటి ఇత్యాదికము యతిమైత్రికుదాహరణము. ఏకారముగలచవర్గమునకైతే సంస్కృత చవర్గముతోడను దంత్యచవర్గముతోడను ప్రాసమైత్రిమాత్రముగలదు ఎందువల్లనంటే ప్రాసమునస్వరమైత్రియొక్క అపేక్షలేదుగావున. అని తెలియవలెను.

సూ॥ ప్రాతిపదికంహినామ.

వ్యా. అరవదధాతుర ప్రత్యయః ప్రాతిపదికమిత్యాద్య వ్యాకరణ సూత్రోక్త ప్రాతిపదికమత్ర నామసంజ్ఞాకంభవతి.

తా. అర్థముకలదియు ధాతువుగానిదియు ప్రత్యయముకానిదియు ప్రత్యయమంతమందుఁ గలదికానిదియు ప్రాతిపదికసంజ్ఞగలదియను సంస్కృతవ్యాకరణ సూత్రమందుఁ జెప్పఁబడిన ప్రాతిపదిక మీ వ్యాకరణమందు నామమను సంజ్ఞ గలదియగును.

సూ॥ ప్రత్యయ ఇహావర్ణకః.

వ్యా. పాణినీయోక్త ప్రత్యయ ఇహావర్ణక సంజ్ఞోభవతి

తా. పాణినీయవ్యాకరణమందు [అనఁగా సంస్కృత వ్యాకరణమందుఁ] జెప్పఁబడిన ప్రత్యయ మిచట వర్ణకసంజ్ఞ గలది యగుచున్నది.

సూ॥ క్రియాధాతుః.

వ్యా. భూవాదయో ధాతవ ఇతి సూత్రవిహితో ధాతురత్ర క్రియాసంజ్ఞో భవతి.

తా. భూవాదులు ధాతుసంజ్ఞ గలవియగు నని పాణినీయసూత్రముచేత విధింపఁబడిన ధాతువీ యాంధ్రవ్యాకరణమందుఁ గ్రియ యను పేరుగలదియగును.

సూ॥ ప్రాణాస్సమానతోచః.

వ్యా. అచస్సంస్కృతవ్యాకరణోక్తాః ప్రత్యాహారమధ్యగతవర్ణాః అకారాదయ ఇహాసమాసతస్సంగ్రహాత్ ప్రాణా ఇతిసామాన్యసంజ్ఞాం ప్రాప్నువంతీత్యర్థః.

తా. సంస్కృతవ్యాకరణమందుఁ జెప్పఁబడినట్టియచ్ ప్రత్యాహారమధ్యమును బొందినట్టి అకారాదులిచట సంక్షేపము వలన ప్రాణములను సాధారణసంజ్ఞను బొందుచున్నవి.

సూ॥ బిందురనుస్వారః.

వ్యా. అనుస్వారః బిందురితి విశేషసంజ్ఞో భవతి.

తా. అనుస్వారము బిందువను మఱియొక పేరుగలదియగును.

సూ॥ ఏజద్ధోవక్రౌ.

వ్యా. అథశబ్దస్యాత్ర ప్రయోగ ఐచ్ఛికశ్ఛందోనుసారీ మధ్యే మఙ్గళార్థో వాత్ర విశేషసంజ్ఞావిధి ప్రారంభార్థో వా. ఏచ్ ప్రత్యాహారగతౌ ఏకార ఓకారశ్చ వక్రావితి విశేషసంజ్ఞకౌ భవతః.

తా. ఇచట అథ అనుశబ్దమును బ్రయోగించుట ఛందస్సుననుసరించి [అనఁగా శ్లోకమునందలి గణముకొఱకై] యిచ్ఛచొప్పునఁగాని మధ్యమందు మంగళము కొఱకుఁగాని విశేషసంజ్ఞను విధిం

-ముట కారంభము నిమిత్తము గాని కలిగినది. ఏచ్ ప్రత్యాహారమును బొందిన ఏకార ఓకారములు వక్రములను విశేష సంజ్ఞ గలవి యగుచున్నవి.

సూ॥ వక్రతమ ఐచ్.

వ్యా. ఐచ్ ఐకార ఔకారశ్చ వక్రతమా ఇతి విశేష సంజ్ఞా భవతః.

తా. [ఐచ్ ప్రత్యాహారమందలి] ఐకార ఔకారములు వక్రతమములని విశేషసంజ్ఞ గలవి యగుచున్నవి

సూ॥ హాలస్స్యుస్సమాసతః ప్రాణినః.

వ్యా. హాలో హకారాదయః సమాసతః ప్రాణిన ఇతి సామాన్యసంజ్ఞాభవంతి.

తా. [హాల్ ప్రత్యాహారమందలి] హకారము మొదలగునవి సంగ్రహమువలన ప్రాణులని సామాన్యసంజ్ఞ గలవి యగుచున్నవి.

సూ॥ ద్రుతాఖ్యో నః.

వ్యా. నః- నకారో ద్రుతాఖ్యః ద్రుత ఇత్యాఖ్యా యస్య సద్రుతాఖ్యః- ద్రుత ఇతి విశేషసంజ్ఞో భవతి.

తా. నకారము ద్రుతమను విశేషసంజ్ఞ గలది యగుచున్నది

సూ॥ కచటతపాః పరుషాఖ్యాః.

వ్యా. కచటతపాః పరుషా ఇతి విశేషసంజ్ఞాభవంతి

తా. కచటతప లైదును పరుషములను విశేషసంజ్ఞ గలవి యగుచున్నవి.

సూ॥ గజడదబాస్తు సరళాః.

వ్యా. గజడదబాః పంచ సరళా ఇతి విశేషసంజ్ఞాభవంతి.

తా. గజడదబ లైదును సరళములను విశేషసంజ్ఞ గలవి యగుచున్నవి.

సూ॥ ఇంద్రాద్యా అపిచగణాః.

వ్యా. ఇంద్రాద్యాగణా అపిచాత్రసంతి యరతాదయోగణా ఆద్యాయామి వాత్రాపిసంత్యే వేత్యపిచేతిశబ్దార్థః. ఆద్యశబ్దేన సూర్యేందుగణాగృహ్యంతే.

తా. ఇంద్రాదిగణములును ఈతెలుఁగునందుఁ గలవు. యరతాదిగణములు సంస్కృతమందువలె నిక్కడఁగూడ గలిగియేయున్నవని అపిగ అను శబ్దముసకర్థము. ఆద్యశబ్దముచేత సూర్యగణములును ఐంద్రగణములును గ్రహించఁబడుచున్నవి

సూ॥ వళిరాద్యమనంతరాక్షరంప్రాసః.

వ్యా. వళిరాద్యం పాదాద్యక్షరం వళిసంజ్ఞంస్యాత్. ద్వితీయాక్షరం ప్రాససంజ్ఞంస్యాత్.

తా. పాదాదియందుండు నక్షరము వళియను సంజ్ఞగలది. (వళి యనఁగా యతి) పాదమున రెండవ యక్షరము ప్రాసమను సంజ్ఞ గలది యగును.

వ్యా. అప్పకవిపుస్తకేతు. ఆద్యోవళిర్ద్వితీయోవర్ణః ప్రాసోత్ర పాదపాదేషు స్వస్వచరణేషు పూర్వఃప్రాసస్సర్వేష్వప్యేక ఏవస్యాత్. శుభవర్ణాశ్శుభశబ్దాయేచ శుభగణాస్తఏవకావ్యాదౌ. గ్రాహ్యాఃపురాస్త్రీరసగిరిరుద్రేష్వే కచటతపామాతృకానింద్యాః. వృత్తంజాతిశ్చేతి ద్వివిధం పద్యంగణైర్నిసర్గాఖ్యైః సంబద్ధంవృత్తంస్యాదుపగణమాత్రాభిరన్వితాజాతిః. జ్ఞాస్తాఏకమాత్రాం లఘోర్ద్విమాత్రే గురోరితివదంతి. గౌలౌగగలలసంజ్ఞౌ గ్లౌహగణౌ లఘుగురూలగౌ వగణః గత్రితయంలత్రితయంమనసంజ్ఞావాద్యమధ్యమాంత్యార్ణాః. గురవశ్చేద్భజసగణాలఘవో యదియరతసంజ్ఞికాః క్రమతః. మిత్రౌనగలావింద్రా నలనగసలభరతాశ్చంద్రామలఘుః. రలరగతలతగనవ నహభలఘగసలలనలలనగగసుపసహాః. ఇతి పద్యానిస్థితాని.

తా. అప్పకవి పుస్తకమందు. ఆద్యోనళిః అనునది మొదలు సవ
సహాః అనునింతపర్యంతము శ్లోకములున్నవి.

(ఈశ్లోకముల యర్థము. ఈయాంధ్రమందుఁ బ్రతిపాదమందు మొదటి యక్షరము యతి రెండవ యక్షరము ప్రాసము. తక్కినపాదములయందు అనఁగా ఆయాపద్యపాదములయందును మొదటి చరణమందలి ప్రాసమే అన్నిపాదములయందును ఒక్కటియే యుండవలెను. శుభాక్షరములును, శుభశబ్దములును, శుభగణములును కావ్యము మొదటను స్వీకరింపఁదగినవి. మూఁడు, అయిదు, ఆరు, ఏడు, పదునొకండు ఈస్థానములయందు అకార, కకార, చకార, టకార, తకార, పకారములను నక్షరములను బ్రయోగించఁగూడదు. పద్యము వృత్తమని, జాతియని రెండువిధములు గలది నిసర్గగణములచేఁ గట్టఁబడినది వృత్తము. ఉపగణములచేతను, మాత్రలచేతను గట్టఁబడినది జాతి. ఛందశ్శాస్త్రికర్తలు ఒక మాత్ర లఘువునకును రెండుమాత్రలు గురువునకును చెప్పుచున్నారు. రెండుగురువులు గగము, రెండు లఘువులు లలము అని పేరుగలవి. గురువు తరువాత లఘువు హగణము. లఘువుతరువాత గురువు లగమని వగణమనియుఁ జెప్పఁబడును. మూఁడు గురువులు మగణము. మూఁడు లఘువులు నగణము. మూఁడక్షరములుగల గణమందు మొదటి యక్షరము గురువైతే భగణము రెండవది గురువైతే జగణము, మూఁడవదిగురువైతే సగణము (ఈ క్రమముననే) మొదటిది లఘువైతే యగణము. రెండవది లఘువయితే రగణము. మూఁడవది లఘువయితే తగణము. నగణమును, గలమును సూర్యగణములు. నలము, నగము, సలము, భగణము, రగణము, తగణము నను నివి యింద్రగణములు. మగణలఘువు, రగణలఘువు, రగణగురువు, తగణలఘువు, తగణగురువు, నగణవగణము, నగణహగణము, భగణలఘువు, భగణగురువు, సగ

నది జాతియనియుఁ జెప్పఁబడుచున్నది- అక్కడ మొదలగుజాతులు ప్రసిద్ధములు- విశేషించి వీని యాకారస్వారస్యాయస్వాది గ్రంథముందే చేయఁబడినది కావున నిక్కడ విస్తరించఁదగు-

సూ॥ సపదా స్త్వవ్యయసు ప్తి ఙ్త్వాన్తుమునాం.

వ్యా- సపదానితి- అవ్యయానాం ప్రాతరాదీనాం సుప్, తిఙ్, త్వా, తుమున్నంతానాంచ హరిణాభవతి గత్వాగంతుమిత్యాదీనాం పదానినాత్రసంతి- ఏషాంప్రయోగో నాస్తిత్యర్థః.

తా- ప్రాతః మొదలగునవ్యయముయొక్కయు హరిణా మొదలగు సుబంతముయొక్కయు, భవతి మొదలగు తిఙంతము యొక్కయు గత్వా మొదలగు త్వాంతముయొక్కయు గంతుం మొదలగు తుమున్నంతముయొక్కయు పదములు ఈభాషయందు ప్రయోగింపఁ బడవని యర్థము-

సూ॥ అనుకృతౌ త్వవాక్యం తు.

వ్యా అనుకృతౌ- అనుకృతమనుకరణం- తుశబ్దో భిన్నక్రమః- అనుకరణే తువాక్యం సుప్తిఙంతాదిపదకదంబకమస్తి- ప్రయోగార్హం భవతి- యద్యపి వాక్యమిత్యుపాదానా ద్వాక్యస్యైవానుకరణే ప్రయోగ ఇతి ప్రతీయతే- తథాపి పదస్యాపి పూర్వసూత్రే పదానీతి బహువచనేన పదవాక్యయోః ప్రయోగనిషేధవిధానాత్- పదస్య వాక్యావయవత్వాచ్చ- నను అదికే విసర్గస్యేతి సూత్రస్వరసాచ్చ- అథర్వణవచనాన సదేహోచ్చ- పదస్యానుకరణే ప్రయోగానుజ్ఞాభవత్యేవ- పురతయాసి. అంతరసి, వారిణాయని, రామేణయని ఇత్యాదిపదస్యానుకరణే ఉదాహరణం- "నదీసకోవిదాపో మదనే సతీకంభయు వాసిన దమ్మప్రజటుపంబోలుఁ -" ఇత్యాది వాక్యస్యానుకరణే ఉదాహరణం

తా. అనుకృతము- అనఁగా అనుకరణము- తుశబ్దము భిన్నక్రమముగ లది- [అనఁగా దగ్గిరపదముతో నన్వయించదు.] అనుకరణమందును

స్త్రీజంతాది పదసమూహముగలది- అనఁగాఁ బ్రయోగించఁ దగునని తాత్పర్యము- ఆలోచించఁగా వాక్యం అని చెప్పుటవలన వాక్యమునకే అనుకరణమందుఁ బ్రయోగముగలదని తోఁచుచున్నది- పదము లేదు- అయినను బూర్వసూత్రమందు పదానియని బహువచనము చేత పదవాక్యములకుఁ బ్రయోగనిషేధజ్ఞానము వలనను, పదము వాక్యమున కవయవమగుటవలనను, నమ ఆదికే విసర్గస్య అనుచ్చారితస్వారస్యమువలనను, [అనఁగా నమ ఆదికౌ అని నమః పదమును గ్రహించుటవలన] అథర్వణవచనము ననుసరించుటవలనను పదమునకును అనుకరణమునందుఁ బ్రయోగమునకు సత్యమ్ము గలుగుచునేయున్నది. పురత యని ఇత్యాదులు పదానుకరణమున కుదాహరణము. నరకేసరి ఇత్యాదికము వాక్యానుకరణమున కుదాహరణము.

వ్యా॥ అనుకరణం చాంధ్రపదేనాకారాది నకారాంతేనైవేతి నాగ్రహః- కింతు సంస్కృతపదేనాపీష్ట మిత్యాశయేనా భవత్యేవ- అత ఏవ ద్వితీయాచార్యేణోక్తం- సంకీర్ణత్వం వికృత్యాద్యాసంకృత్యాయమం జాలంభవేత్- ఏతత్సూత్రమనుసృత్యైవ అల్లసాని పెద్దన్నకవినా ఆముక్తమాల్యదాయాం- అద్ధా వాగ్వైభవం బళిబా పవనకన్యా హాహారమి త్యాదిషుద్యో- ఇదౌచిత్యమగాల్లయంహి శుద్ధియామితం వచ త్రిప్పన్నరంబు ఇత్యాద్యుక్తం నచాత్రాపి ద్విత్వప్రసంగః- ఇత్యాదిశబ్దైరనుకరణేపి సంకీర్ణత్వం యుక్తమిత్యత్రైవ వచనతాత్పర్యావధారణాత్ కింతు వైకృత పదానుకరణ ఏవ పదాంతే ద్విత్వమితి విశేషః-

తా. అనుకరణమనునది అకారమాదియందుఁ గలిగి నకారమంతమందుఁ గల యాంధ్రపదము చేత నే [అనుధాతువు చేత నే] యను పట్టుదల అక్కఱలేదు- మఱియేమనంటే ఇతంమొదలగు సంస్కృత పదము చేతను అగుచునేయున్నది- కావుననే ద్వితీయాచార్యుఁడు, వికృతిపదాదులచే అనుకృతి చేత సాంకర్యము సుష్ఠుగానే యుండునని చెప్పెను- ఈసూత్రముననుసరించియే అల్లసాని పెద్దన్నకవి 'అముక్త

మాల్యాదయందు, అథావాగిత్యాది పద్యమందు, ఇత్థం వదత్ అని ఇత్థంశబ్దముచే అనుకృతిఁజేసి] చెప్పెను- ఇక్కడఁగూడ (అనుకరణము పరముగునప్పుడు పదాంతహల్లునకు) ద్విత్వము ప్రసక్తించదు- ఇతి మొదలగు శబ్దములచేత అనుకరణముఁజేసినను సాంకర్యము యుక్తముగానుండుననిమాత్రమే (ద్వితీయాచార్య) వచనమునకుఁ దాత్పర్యము అనినిశ్చయించుటవలన- మఱియేమనిన తెనుఁగు పదము చేత అనుకరణమందే పదాంతమందు ద్విత్వమనివివేకము.

వ్యా. ఏతన్నిషేధ ఆంధ్రపదసంకీర్ణతాయామేవ నాన్యత్ర కేవలానాంతు ప్రయోగో నిర్బాధ ఏవ. అతఏవోక్తం వికృతివివేకే ప్రబంధే కేవలాద్యస్య ప్రయోగస్తు నదోషకృదితి

సీ. దంభోళిధరసతీ-తాంబూలపేటీషు,

వహనబింబాధరా-స్తనభరేషు॥

శ్లో॥ హరయేజితమురదరయేతరయేథవవారిధేశ్చపన్నజనానాం సురతరవేస్మరగురవేసిరవేదమయాయదేవదేవాయనమః॥ ఇత్యాది ప్రయోగాః ప్రబంధేషు బహవః ప్రవర్తంతే. కించతత్రైవ "విసానుసారణం కేచిదాప్యశబ్దం ప్రయుంజతే । ప్రత్యయాగ్రాహ్యస్యాపి ప్రయోగః కుత్రచిద్భవేత్ । అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుకర్తృణా। కథితస్తద్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' ఇత్యుక్తం. అత ఏవ రామాభ్యుదయే రామభద్రకవినా 'అర్జునీవసేర్తువరయంగ' నిత్యాది పద్యేకర్తుమకర్తుమన్యథా కర్తుము దారశక్తవిత్యుక్తం కవితా పితామహాదిభిరపి 'స। ర్వత్రనిలింపకామినుల-వాహకుఁగాపులు వోదురు' 'ఆబాలగోపాల-మఖిలసుగ్రీవజయును, నానందమగుమనిక్క-నతిశయిల్లె' 'జయశ్రీతాంబుకలావత్సనిషధ-స్వామీ' ఇత్యాదీని వాక్యాః ప్రయుక్తాని.

తా. (నపదాన్యవ్యయ అను) ఈనిషేధము ఆంధ్రపదములసాంకర్యమందేకాని తక్కినచోటలేదు. కేవలసంస్కృతపదముల ప్ర

యోగము బాధలేనిదే కనుకనే వికృతివివేకమందు కేవలసంస్కృతశబ్దమునకుఁ బ్రబంధమందుఁ బ్రయోగము దోషము చేయదని చెప్పఁబడినది దంభోళీత్యాదిపద్యమును, తరయె ఇత్యాదిపద్యమును కేవల సంస్కృతములు. ఈ మొదలగు ప్రయోగములు ప్రబంధములయందు విస్తారముగానున్నవి మఱియు నావికృతివివేకమందే కొందరనుకరణము లేకుండనే సంస్కృతశబ్దములను బ్రయోగించుచున్నారు. ప్రత్యయమునకుఁ దగిన అవ్యయమునకును ఒకానొకచోటఁ బ్రయోగముగలదు విష్ణుశర్మ ఇతరావ్యయమునకుఁ గూడఁ బ్రయోగమును జెప్పెను. తద్భవమునకు దీర్ఘాంతత్వమొకానొకచోఁ గలదు. అని చెప్పఁబడినది కనుకనే రామాభ్యుదయమందు రామభద్రకవి ఆర్తుల నిత్యాదిపద్యమందు కర్తుమిత్యాదికమును బ్రయోగించెను. కవితాపితామహుఁడు మొదలగువారును సర్వత్ర, ఆబాలగోపాలం, జయ ఇత్యాదివాక్యములం బ్రయోగించిరి.

సూ॥ తిఙ్మధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తీః.
కించిత్ప్రశంసనాద్భుతసంతాపయదాతదాకిమేవాంశ్చ. క్త్వా
కిలతూష్ణీమాద్యానభిదఘతికలాన్ప్రమతోనయేషాంస్యాత్.

వ్యా॥ తిఙ్మధ్యాః రమాంతా మధ్యముపురుషాశ్చ శేష షష్ఠి యొక్క షష్ఠీ. సుస్ ప్రథమావిభక్తిః సుస్యాది రంత్యహాలేతి ప్రాకృత వ్యాకరణసూత్రాత్. కర్మప్రవచనీయజవిభక్తిః, కూర్చేతివిభక్తిః- ఏలాంశ్చ కించిత్. కించిదర్థాః కాసంతాదయః ప్రశంసన ప్రశంసార్థాః భళీత్యాదయః- అద్భుత అద్భుతార్థాః ఓహో ఇత్యాదయః. సంతాప- సంతాపార్థాః అయ్యో, అకటా ఇత్యాదయః. యదాతదార్థా- ఎప్పుడు, అప్పుడు ఇత్యేతౌశబ్దౌ. నేనెప్పుడుగొల్చెదనిత్యాదౌ సదాపర్యాయో ద్రుతప్రకృతిసంజ్ఞః. కిమర్థః- ఏమిటిశబ్దః- ఏవ వార్థాః, నిన్నె నన్నె ఇత్యాద్యాః- ఏతాంశ్చక్త్వా క్త్వార్థాః పొ

యి, వచ్చి, ఊరక, చేయక ఇత్యాద్యాః. కిల కిలార్థాః పోయెనఁట వచ్చెనఁట. ఇత్యాద్యాః. తూష్ణీం. తూష్ణీమర్థాః. ఊరక, మిన్నక ఇత్యాదయః ఆదిశబ్దేన పట్టి క్త్వా ఇతి విభక్తీ సుమ్ము, కదా, ఏలా, ఇప్పుడు, మాటి ఇత్యాద్యా గృహ్యంతే. ఏతాంశ్చ శాస్త్రవేత్తారః కళాసంజ్ఞికానభిదధతి. వదంతి. యేషామంతే ద్రుతో నకారో న స్యాత్. కూర్చిరి కీర్తి ఇత్యాదౌ వించున్నాఁడు, ఘటింపఁ గలఁడు చనఁడు ఇత్యాదీనాం త్రిజ్ఞధ్యత్వాభావేపి ప్రథమాసమత్వేన సంగ్రహణమితి జ్ఞేయం. నిబంధనేషు ప్రాచాం చేచ్ఛబ్దోన్యః పరిదృశ్యతే. సూత్రస్థితాదిశబ్దేన గ్రాహ్యస్సంఖ్యావదుత్తమైః

తా. త్రిజ్ఞధ్యములుఁగా రాంత మాంత మధ్యమపురుషలు, యొక్కషష్ఠి, ప్రథమావిభక్తి [సుస్ అని జస్సులోని సకార మిత్సంజ్ఞకాకుండదానితోఁ బ్రత్యాహారమెట్లు చేయవచ్చునని శంకించుకొని సమాధానము చేయుచున్నాఁడు] సుస్ మొదలగునది యంత్యహల్లుతోఁ బ్రత్యాహారమని ప్రాకృతవ్యాకరణ సూత్రము వలనఁ గలిగినది. కూర్చియను విభక్తి అనువీనిని కించిదిత్యాదులు స్పష్టములు. నేనెప్పుడుఁగొల్చెద నిత్యాదికమందు ఎప్పుడు అనునది యెల్లప్పుడు అని యర్థముగలదిగావుననది ద్రుతప్రకృతి [యదార్థము కాదు] ఆదిశబ్దముచేత పట్టి క్త్వా విభక్తులును. సుమ్ము ఇత్యాదులును గ్రహింపఁబడుచున్నవి. వీనినన్నిఁటిని శాస్త్రవేత్తలు కలలను పేరుగల వానిఁగాఁ జెప్పుచున్నారు. వేనికి అంతమందు నకారములేదో అవికూర్చిరి ఇత్యాదులు త్రిజ్ఞధ్యములుకాకున్నను ప్రథమాసములౌటచేత గ్రహణము గునదియని తెలియవలెను. పూర్వుల గ్రంథములయందు చేచ్ఛబ్దము [ఏనిశబ్దము] కానవచ్చుచున్నది [కలయని వ్రాయఁబడినది] అదిసూత్రమందలి ఆదిశబ్దముచేత గ్రహింపఁదగినదనివిద్వద్వరులెఱుంగఁదగినది.

సూ॥ అన్యే ద్రుతప్రకృతయో యేష్వర్థ్యానుజీవిత ద్రుతా నిత్యం.

వ్యా॥ అన్యేఏతద్వ్యతిరిక్తాశ్శబ్దాః ద్రుతప్రకృతయః. ద్రుతప్రకృతిసంజ్ఞికాభవంతి. అన్యేశబ్దానిత్యమనుజీవిత ద్రుతాః. అనుసృతాంతనకారాః. సుబ్వ్యర్థిభవేయుర్హి. శాస్త్రమహిమ్నా లోపదేశప్రాప్తావప్యాదౌ ద్రుతాంతత్వేన స్థితిః ప్రసిద్ధేతి తాత్పర్యం.

తా. ఈకళాశబ్దములకంటె వేఱైనశబ్దములు ద్రుతప్రకృతులను సంజ్ఞగలవియగుచున్నవి ఈద్రుతప్రకృతులు పొందఁబడిన అంతమందలి నకారముగలవియగునుగదా. [హి అను ప్రసిద్ధవాచమెందుకంటే] శాస్త్రమహిమచే లోపము ప్రాప్తించినను ద్రుతాంతములని మొదటనునికి ప్రసిద్ధమని తాత్పర్యము.

సూ॥ తజ్జాసమాచదేశ్యాగ్రామ్యాచేయం చతుర్విధా భవతి. ప్రకృతిద్వయజా తజ్జాతుల్యాతు సమాప్రవాహినీ దేశ్యా.

వ్యా. ఇయంవికృతిభాషా తజ్జాతిభేదేన చతుష్ప్రకారాభవతి. ఆద్యప్రకృతి ప్రకృతి జాత తజ్జేత్యుచ్యతే. తత్తుల్యాసమేత్యుచ్యతే. నిత్యోవనాద్యదృశో లోకప్రవాహః. సోస్యాఅస్తీతి ప్రవాహినీ దేశ్యాలోకవ్యవహార వేద్యేతియావత్. అనియమా గ్రామ్యా అనియమాద్గ్రామ్య మిత్యుక్తత్వాత్. వనము, ధనము, జముఁడు ఇత్యాద్యాస్సంస్కృతప్రాకృతసమాః. సిందుచలిముద్ద, పండువెన్నెల, పొదరిల్లు ఇత్యాద్యాదేశ్యాః. అత్రేదంవిచార్యం. త్రివిధైవవికృతిః. అనియమాద్గ్రామ్యాభవతి. వర్ణన్యూనత్వాధికత్వా న్యాదృశత్వలక్షణాతథాచ. చతుర్విధాభాషేతి గ్రామ్యయాసాకం వికృత్యాశ్చాతుర్విధ్యం. పదశబ్దానుశాసనాచార్యస్య కుత్రచిద్వినియోగ ఇష్టఏవ. అన్యథా తత్పరిగణనంముధాస్యాత్. వినియోగోపినాన్యత్రయుక్త

ఇతి తత్తత్స్వభావవర్ణనే కార్యః అతఏవోక్తమథర్వణేన. గ్రామ్యం
తత్తద్విధా సాధుకటకంఠముఖాహితా ఇతి.

తా. ఈయాంధ్రభాష తద్భవాదిభేదములచేత నాలుగువిధములు
గలదియగుచున్నది. సంస్కృతప్రాకృతములవలనఁ బుట్టినది తద్భవ
మనఁబడుచున్నది. ఆరెంటితో సమమయినది సమయని (తత్సమ
యని) చెప్పఁబడుచున్నది. నిత్యమైనట్టియు, ననాద్యదృశ్యమైనట్టి
యు లోకము ప్రవాహము. అది దీనికిఁ గలదు కావున ప్రవాహిని
యనఁగా దేశ్యలోకవ్యవహారముచేతఁ దెలియఁదగినదని తాత్పర్యము,
నియమములేనిది గ్రామ్య, అనియమాద్గ్రామ్యం అని చెప్పఁబడినది
గదా. వనము ఇత్యాదులు సంస్కృతప్రాకృతసమములు నిండుచ
లిముగ్గు ఇత్యాదులు దేశ్యములు. ఇక్కడనిది యాలోచింపఁదగినది.
ఆంధ్రభాష మూఁడుతెరఁగులుగలదియె. నియమము లేకపోవుటవ
లన గ్రామ్యమగుచున్నది. అది అక్షరములు తక్కువయగుట యె
క్కువయగుట మఱియొకలాగు అగుట అను లక్షణముగలది. కావున
గ్రామ్యముతోఁడ నీయాంధ్రభాష నాల్గుతెరఁగులు గలది అని చె
ప్పుచున్న శబ్దానుశాసనాచార్యునికి నీగ్రామ్యభాషకొకానొకచోట
వినియోగమిష్టమే. అట్లుగానియెడల దాని లెక్కించుట వ్యర్థమ
గును. వీని వినియోగమును మఱియొకచోటఁ దగినదికాదు. ఆయా
స్వభావవర్ణనయందుఁ జేయఁదగినది. కావుననే అథర్వణాచార్యుఁడు
కటకంఠుఁడు మొదలగు గ్రామ్యనాయావిధియందు మంచిది అని
చెప్పెను.

సూ॥ విరళాః స్వేచ్ఛోషాదికశబ్దాః ప్రవ్యాహారంతుశబ్దజ్ఞాః
ఇహతుప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధమేవపదం.

వ్యా. శబ్దజ్ఞాశ్శబ్దశాస్త్రవేత్తారః విరళాః లోకే అప్రసిద్ధాన
పి స్వేచ్ఛోషాదికశబ్దాః ప్రేచేతి- డుపచష్పాకే ఇతి ధాతోర్లోణ్మధ్య
మపురుషబహువచనరూపం- ఊషేతి వస నివాసే ఇతి ధాతోర్లోణ

ధ్యమపురుష బహువచనరూపం. ఏతదాదిశబ్దాః క్వచిత్సంస్కృత భాషాకావ్యేషు ప్రవ్యాహరంతు ప్రయోజయంతు. ఇహత్వాంధ్రభాషాయాంతు సంకేతిత సుప్రసిద్ధమేవ సంకేతితం సుష్ఠుప్రసిద్ధం ప్రామాణిక కవిప్రయోగారూఢంచ యత్పదంతదేవప్రవ్యాహార్యం. అత్రేదంతాత్పర్యం. పేహోషాదిశబ్దానాం లోకే అప్రయుక్తత్వేపి వేదేషు తత్ప్రయోగస్య విద్యమానత్వాన్నాప్రయుక్తతాస్తి. అస్త్యప్రయుక్త ఇతివార్తికే మహాభాష్యకారోక్తేః. లోకవేదాధికరణే లోకవేదశబ్దయో రేకత్వప్రతిపాదనాచ్చ. శబ్దసాధుత్వమాత్రాభిమాన మండితాః పండితాః క్వచిల్లోకేపి కావ్యేషు పేచాదిశబ్దాః ప్రయోజయంతు. నప్రయోజయంతువా నాస్మాక మాగ్రహః. కింత్వత్ర. అసంకేతిత మప్రసిద్ధం పదం నప్రయోక్తవ్యం. వివక్షితార్థప్రతిపాదకం ప్రసిద్ధంచ యదేవపదం తదేవాత్ర ప్రయోక్తవ్యమిత్యస్మాక మభిమానః. ఏవకారేణాస్య నిషేధో విధిరూపకృత్యా ప్రత్యయేన ప్రయోగావశ్యం భావిత్వంచ ద్యోత్యతే.

తా. శబ్దశాస్త్రమెఱింగినవారులోకప్రసిద్ధములుగాని పేహోషాది శబ్దములను సంస్కృతభాషయందొకానొకచోటఁ బ్రయోగింతురుగాక. ఈయాంధ్రభాషయందైతే [ఈశబ్దమునకీ యర్థమని] సంకేతించఁబడినట్టియు మిక్కిలి ప్రసిద్ధమయినట్టి అనఁగాఁ బ్రామాణికులయిన కవులు ప్రయోగించినది యేది గలదో అదియే ప్రయోగింపఁదగినది. పేచ అనునది డుపచష్పాకే అనుధాతువుకు మధ్యమపురుషబహువచనరూపము. ఊష అనునది వసనివాసే అనుధాతువుకుమధ్యమపురుషబహువచనరూపము. ఇక్కడ ఇది తాత్పర్యము. ఏమంటే పేచాదిశబ్దములకు లోకమందుఁ బ్రయోగములేకున్నను వేదమందుఁ గలదుగావున అప్రయోగదోషములేదు. అస్త్యప్రయుక్తః అను వార్తికమందు మహాభాష్యకారుల వాక్యము వలనను లోకవేదాధికరణమందు లోకవేదశబ్దము లొకటిగాఁ జెప్పుట వలనను

శబ్దసాధుత్వమందుమాత్ర మభిమానముగల పండితులు లోకమందో కానొకచోట కావ్యములయందు పేచాదిశబ్దములు ప్రయోగింతురు గాక, మానుదురుగాక, మాకక్కఱ పట్టుపలలేదు. మఱియేమంటే యీయాంధ్రమున సంకేతించఁబడినట్టియుఁ బ్రసిద్ధముకానట్టియు, పదము ప్రయోగింపఁదగదు. తాఁజెప్పఁదలంచిన యర్థమును తెలియఁజేయునట్టియుఁ, బ్రసిద్ధమైనట్టియు పదమిందుఁ బ్రయోగింపఁదగునని మాపట్టుపల ఏవ అను సూత్రమందుండు శబ్దముచేత ఇతర నిషేధమును విధిరూపమగు కృత్యప్రత్యయముచేత (అనఁగా ప్రవాహ్యోర్యం అనుదానిచేత) ముఖ్యముగాఁ బ్రయోగింపఁ దగినదనియుఁ దెలియఁబడుచున్నది.

వ్యా. ననుసంస్కృతభాషాకావ్యేషు క్వచిదప్రసిద్ధపదప్రయోగశ్చేద్దుష్టంపదం శ్రుతికటుచ్యుతసంస్కృత్యప్రయుక్తమసమర్థకామితి పదదోషేష్వప్రయుక్తపదప్రయోగమపి దోషత్వేనపరిగణయ్య. యథాయందానుశాచార స్సర్వదైవవిభావ్యతే- తథామన్యే దైవతోస్య పిశాచోరాక్షసోథవేత్- ఇత్యుదాహరణే దైవతశబ్దస్యపుంలింగత్వేన ప్రయోగో ప్రసిద్ధ ఇత్యుక్తం- కావ్యప్రకాశే- అన్యత్రాప్యప్రసిద్ధప్రయోగో దోషత్వేనోక్త ఏవేతి తద్విరోధస్స్యాదితిచేత్సత్యం- క్వచిదపిదాప్యకపదస్య ప్రయోగాభావేపి- బృందారకా దైవతాని పుంసివా ఇత్యమరసింహాకృత లింగానుశాసనం వృథాస్యాత్- అతఏవ క్లీబత్వం ప్రచురప్రయోగ విషయమితి వ్యాఖ్యాదిభిరుక్తమేవ ఇత్యాలంకారికోక్త దోషః ప్రచురప్రయోగ విషయః- నతుక్వాచిత్కప్రయోగవిషయోపీతి నవిరోధః.

తా. ఓయీ సంస్కృతకావ్యములయందు ఒకానొకచోట అప్రసిద్ధపదప్రయోగమున్నయెడ దుష్టపదము. శ్రుతికటువు, చ్యుతసంస్కారము, అప్రయుక్తము, అసమర్థము అని పదదోషములయం దప్రయుక్తదోషమునుగూడ దోషమునుగా లెక్కించి యథాయమి

త్యాది శ్లోకమందు దైవతః అని దైవతశబ్దమునకుఁ బుంలింగమును గాఁ బ్రయోగించుట అప్రసిద్ధమని కావ్యప్రకాశమందును మఱియొకచోటను దానిఁ బ్రయోగించుట దోషముగాఁ జెప్పఁబడినది కావున [సంస్కృత కావ్యములం దప్రసిద్ధపదములం బ్రయోగింతురు గాక అనుమాటకు] విరోధము వచ్చునందురేమో అట్లు చెప్పుట సత్యమే. అట్లయితే యెచ్చటను అట్టి పదమునకుఁ బ్రయోగము లేదని బృందారకాః ఇత్యాద్యమరసింహకృతమగు లింగానుశాసనము వ్యర్థమగును. కావుననే నపుంసకత్వము తరుచు ప్రయోగము గలదియని స్వామి మొదలగువారు చెప్పియున్నారు కావున ఆలంకారికులు చెప్పినదోషము తరుచుగా ప్రయోగము లేదని చెప్పుచున్నదిగాని యెక్కడనొకచోటనైనను లేదని చెప్పుచున్నదికాదు. కనుక విరోధములేదు.

వ్యా. దండినాపి కావ్యాదర్శే గౌడీమార్గనిరూపణే ప్రసాదవిపర్యయలక్షణముక్తం. 'వ్యుత్పన్నమితి గౌడీయై ర్నాతిరూఢమపీష్యత ఇతి.' విశ్వతివివేకే అథర్వణాచార్యేణతు. 'సర్వేశబ్దాః ప్రయోక్తవ్యాయది వా దోషవర్జితాః' అప్రయుక్తత్వదోషస్తు నవిరుద్ధో హరేర్మతి ఇతి హరిసూరిమతముద్ధాట్య ప్రమాణం తత్రసద్వచ ఇత్యాది వచనైస్తత్ర తత్రకవీనాం మహాకవిప్రయోగైక శరణతాముపాద్య. 'శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రంబలవ దుచ్యతే । అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితం ఇత్యుక్తం. యత్రశాస్త్రేణ విశిష్య కార్యముచ్యతే తత్రశాస్త్రం బలవద్భవతి. యత్రశాస్త్రేణ సామాన్యవిధానం తత్రప్రయోగో బలవానితి తదర్థః.

తా. దండియును కావ్యాదర్శమందు గౌడీమార్గమును జెప్పుట యందు గౌడదేశస్థులు శబ్దము మిక్కిలి ప్రసిద్ధము కాకున్నను వ్యుత్పత్తిగలదియయ్యెనేని యంగీకరింతురని ప్రసాదవిపర్యయ లక్షణమును జెప్పె. అన్నిశబ్దములు దోషములేని వగుతే ప్రయోగించఁదగినవి.

అప్రయుక్తదోషము హరిమతమందు విరుద్ధముకాదని హరిపండితుని
మతమును ఎత్తి అందుపండితులవాక్యము ప్రమాణము. ఇత్యాదివా
క్యములచేతనచ్చటచ్చట కవీశ్వరులకుమహాకవిప్రయోగము శరణమగు
టనుచెప్పి శాస్త్రములోను ప్రయోగములోను శాస్త్రముబలముగల
ది, శబ్దమునిష్పత్తికానిచో ప్రయోగమునాశ్రయించుటమంచిది అని
వికృతివివేకమందధర్వణాచార్యుఁడు చెప్పెను. అనఁగా ఎచ్చట
శాస్త్రముచేత ప్రత్యేకముగా కార్యముచెప్పఁబడునో అచ్చటశాస్త్ర
ముబలముగలది. ఎచ్చటశాస్త్రముచేత సామాన్యవిధిచెప్పఁబడునో అ
చ్చటప్రయోగము బలముగలది అనిదానియర్థము.

వ్యా. వర్ణలోపాగమాస్త్వైకే సర్వస్మింస్సుబ్భవేపదే వచనేపురుషే
చార్థే లోపోవర్ణాగమేమత ఇత్యాది॥ వర్ణాగమోవిశేషః పురుషేష్వ
రేషుచాపివచనేషు॥ ఇత్యాదికంచశాస్త్రంసామాన్యం విశేషశాస్త్రం
స్పష్టమేవ.

తా. తద్భవమందంతటను అక్షరముయొక్క లోపములు ఆగ
మములు ననేకములుగలవు. వచనాదులయందు లోపమువర్ణాగమము
సమ్మతమైనది. అని యీమొదలైనదియు పురుషలయందు [illegible]
యందు వచనములయందు వర్ణాగమము విశేషము అని యీ [illegible]
నదిసామాన్యశాస్త్రము. విశేషశాస్త్రముస్పష్టము.

వ్యా. ఏవంసితే మహాకవిప్రయోగ ప్రధా [illegible]
విప్రయోగరూఢంచేద్గ్రామ్యమపి ప్రయోగార్హ [illegible]
త్పర్యమితి బాలసరస్వత్యోక్తం ఇదమేవతాత్పర్య మభివర్ణ [illegible]
వినాపి వినెక్ కనెక్ చనెక్ ఇత్యాదిశబ్దానాం గ్రామ్యత్వేపి మ
హాకవిప్రయోగరూఢత్వాత్సాధుత్వమిత్యుక్తం తిన్నె చనెనిత్యాదిశ
బ్దానాం శాస్త్రరూఢత్వేన. అద్యాక్రియాస్వతినుఁత్ర ఉక్తత్వాత్
"నందనుఁగనెనటమరచితి" నిత్యాది ప్రయోగాదాచార్యస్యానేక
తాదృశప్రయోగోపిష్ట ఏవ తత్ర "నీవెత్తింబగారుగాను" ఇత్యాదీ
నాంగ్రామ్యత్వేపి ప్రయోగార్హతేతి సరస్వత్యాశయోవర్ణనీయః.

తా. ఈలాగుననుండఁగా మహాకవిప్రయోగము ప్రధానమని చెప్పుటచేత మహాకవిప్రయోగప్రసిద్ధమైనయెడ గ్రామ్యమైనను బ్రయోగమునకుఁ దగునని యాచార్యులతాత్పర్యమని బాలసరస్వతిచేఁ జెప్పబడినది ఈతాత్పర్యమునే వివరించి యప్పకవియును విసెక్ ఇత్యాదిశబ్దములకు గ్రామ్యత్వమున్నను మహాకవులు ప్రయోగించుచున్నందున సాధువులని చెప్పెను. తన్నెనిత్యాదిశబ్దములు శాస్త్రప్రసిద్ధములుగా అద్యః క్రియాసు అనుసూత్రమందుఁ జెప్పఁబడుటవలన నందనుగనెనటమరచితి ఇత్యాదిప్రయోగమువలన నాచార్యునికిని ఇట్టిప్రయోగము నిష్టమైనదే అందునీవెఱ్ఱిబంగారుగాను ఇత్యాదులు గ్రామ్యములైనను బ్రయోగార్హములని సరస్వతి యభిప్రాయము చెప్పఁదగినది

వ్యా. అనేనైవ 'అపాంగమాలికల్ మెఱుఁగులుగ్రక్క' నిత్యాదీనామపి ప్రయోగాణాం సాధుత్వం. ఏతద్గ్రామ్యత్వంతు. 'నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాదిగౌణవృత్తివ్యపాశ్రయం । అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే॥' ఇతి దండినా ప్రతిపాదితం. గుణవృత్త్యైవైషాం సాధుత్వమితి నృసింహః

తా. ఈహేతువుచేతనే అపాంగమాలికల్ ఇత్యాదులయందు [క్రక్కు-ధాతువుకు వమనమర్థమైనను] ప్రయోగములు సాధువులు. వీనికి గ్రామ్యత్వమును దండి చెప్పినాఁడు. ఎట్లంటే. నిష్ఠ్యూత=ఉమియఁబడినది. ఉద్గీర్ణ=క్రక్కఁబడినది వాంత=క్రక్కఁబడినది. ఈమొదలగు శబ్దములు [ముఖ్యవృత్తినివిడచి] గౌణవృత్తి నాశ్రయించినవై [గౌణవృత్తియనఁగా గుణసంబంధివ్యాపారము. ఇచ్చట నిష్ఠ్యూతాదులకు బయలుదేఱుట గౌణవృత్తి] మిక్కిలి సుందరముగనుండును. లేనట్లయితే [అనఁగా ముఖ్యవృత్తి నాశ్రయించినయెడల] గ్రామ్యవ్యవహారమును బొందును అని దండి చెప్పెను. ఈశబ్దములకు గుణవృత్తిచేతనే సాధుత్వమని నృసింహుఁడు చెప్పెను.

వ్యా. అప్పకవిపుస్తకేస్థితమాంధ్రలిపివ్యుత్పాదకం శ్లోకత్రయం-

తదత్ర విలిఖ్య వ్యాఖ్యాయతే. బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథి దాత్ర పరశుసమాః. ఆద్యా ఇభకరతుల్యా స్తద్దీర్ఘాఖ్యాలసన్నిభా వన్యా. దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః. క్రమాత్పరుషాః. స్తంభవిలేఖాధిక్యేత ఏవవర్గద్వితీయవర్ణాద్యాః కీరనౌహస్తిమస్తక శుక్తితులాశనవితర్దిసీరసమాః అంతస్థాశ్చోష్మాణోదంత్యచజౌ గురరలౌచబిందుయుతౌ. వ్యా ఆద్యాః అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ వర్ణాః. తద్దీర్ఘాస్తేషాందీర్ఘా ఆకారాదయోగజహస్తతుల్యాః అన్యౌ, ఐజౌ, వర్ణౌ, శూలసదృశౌ ఏఓజ్, ఐజౌ జితిమాహేశ్వరసూత్రయో రేదోతో రైదౌతోశ్చసంబంధస్యోక్తత్వాత్- తత్రాద్యానాంమధ్యే ఏదోతోర్గ్రహణం. అన్యశబ్దేనైదౌతౌగృహ్యేతే ఇతివివేకః. తద్దీర్ఘా ఇతిసామాన్యప్రయోగాత్ ఌ వర్ణస్యాప్యప్పకవినాదీర్ఘోలిఖితః. అత్రేదమవధేయం ఌ వర్ణస్య సాక్షాన్నదీర్ఘః. ఋ వర్ణదీర్ఘేణదీర్ఘవత్త్వమిత్యుక్తం- శుద్ధాంధ్రేతు విశిష్యతస్యదీర్ఘకల్పనేపి ప్రయోజనమదృష్టం- సాలూాలు ఇత్యాదౌ ఊకార విశిష్టలవర్ణేనైవ లిపేశ్చరితార్థత్వాదితి. స్తంభవిలేఖాధిక్యైః- స్తంభః స్తంభాకార రేఖాతద్విలేఖనాధిక్యైః తఏవ ప్రథమ వర్ణాః- ద్వితీయతృతీయచతుర్థ పంచమవర్ణాభవంతి- శేషంస్పష్టం.

తా. అప్పకవి పుస్తకమందున్న ఆంధ్రవర్ణములను వ్రాయు రీతినిఁదెలుపునట్టి మూఁడుశ్లోకములిచ్చట వ్రాసివివరింపఁ బడుచున్నవి. విదియచంద్రునివలె అకారముండును. దానిమధ్యమున గుండ్రముగావ్రాసిన ఇకారమగును. క్రిందనున్న నిల్వుఁగా ఋకారము- కుడివైపునమీఁదికి మెలివెట్టిన ఌకారము. ఎడమవైపునఁ గొడవలివలె వ్రాయఁగా ఎకారము కుడివైపున గుండ్రగొడ్డటివలె వ్రాయగా ఒకారము. వీనికన్నిటికిని కుడివి ఏనుగుతుండమువలె వ్రాయఁగా దీర్ఘములగును. ఐకార ఔకారములు త్రిశూలమువలె నుండును. ఆద్యాః ఆకారాది ఎకారముదాకనుండువర్ణములు అన్యా ఐకా

ర ఔకారములు ఏ ఓ ఙ్, ఐ ఔ చ్ అనిమాహేశ్వర సూత్రముల
యందు ఏకార ఓకారములకును ఐకార ఔకారములకును సంబం
ధముగ రచింపఁబడినది కావునవట్లు చెప్పబడినది. అందు ఆద్యశబ్దము
చేత ఏకార ఓకారములకును అన్యశబ్దముచేత ఐకార ఔకారము
లకును గ్రహణము. తద్దీర్ఘాః అని సామాన్య ప్రయోగమువలన ఌవ
ర్ణమున కప్పకవిదీర్ఘము వ్రాసెను. ఇచ్చటనిట్లు తెలియవలెను. ఌవర్ణ
మునకు సాక్షాత్తుగాదీర్ఘము లేదు. (ఋ ఌ వర్ణములకు సావర్ణ్యము
కలదు గావున) ఋవర్ణముయొక్క దీర్ఘముచేత దీర్ఘముకలదని చెప్పఁ
బడినది. శుద్ధాంధ్రమందు విశేషించి దానికిదీర్ఘమున్నదని చెప్పుట
వలనఁ బ్రయోజనములేదు. సాలూాలు ఇత్యాదులయందు ఊకారము
తోఁగూడి నలకారముచేతనే వ్రాతకుచరితార్థతకలదు. స్తంభాకా
రరేఖలు అధికారముగాఁగల ఆయక్షరములే రెండుమూడునాలుగ
క్షరములగుచున్నవి. అనివివరణము. కచటతపలు వరుసగా శంఖ
ముతో ధనుస్సుతో రావియాకుతో అంకుశముతో పాముతో సమా
నములు. స్తంభమువంటిరేఖయొక్కవగా వ్రాసినది యేవర్గమునందు
ద్వితీయాదివర్ణములగును. చిలుకతో ఓడతో ఏనుగుతలతో ముత్తెపు
ప్పతో సమానములుగా యరలవలును. త్రాసుతో పీఠముతో అ
నాగఁటితో సమానములుగా శషసహలును ఉండును. దం
చెఱ..ను గురువులగు రేఫలకారములును బిందువుతోఁ

యాచార్యేణోక్తం. పంచవర్గాదయో వర్ణాశ్చం
శిరస్యగ్రేఖాయుజశ్చోర్ధ్వం దండరేఖాన్వితా
మాస్స్యురూర్ధ్వరేఖాద్వికాన్వితాః. ప్రథమా
తృతీయాశ్చతుర్థకాః. రేఖాద్వయాదో దండేన
చకాః మిళితం దద్వయోపేతాః ప్రథమాలిపయ
గేఖాయుజశ్చోర్ధ్వమిత్యస్యపూర్వణాన్వయః.
అధోదండరేఖాన్వితాస్త ఏవ ప్రథమవర్ణాః. ద్వితీయవర్ణాస్స్యుః ప్రథ

మా ఏవోర్ధ్వరేఖాద్వయాన్వితాస్సంత స్తృతీయాస్స్యుః రేఖాద్వయాధః ప్రదేశేదండరేఖాస్తృతీయాశ్చతుర్థాభవంతి. మిళద్దండరేఖాయుగాన్వితాః ప్రథమాఃపంచమవర్ణాభవంతీత్యర్థః. పూర్ణేందుసదృశఃపూర్ణస్త్వర్ధస్త్వర్ధేందుసన్నిభః ఇత్యథర్వణోక్తేఃపూర్ణార్ధబింద్వోః పూర్ణార్ధచంద్రతుల్యత్వేనలేఖనం. కషయోః గేక్ష ఇతి నతస్యపార్థక్యకథనం. విశిష్యాకథనాత్ సూక్ష్మబిందుయుగళరూపేణైవవిసర్గస్యలేఖనంజ్ఞేయం

తా. ఇందు ద్వితీయాచార్యుఁడు చెప్పెను ఎట్లంటే. వర్గములదటివగు నైదక్షరములు శంఖాదులతో సమానములై పైనడ్డుగీటులతోఁ గూడినవియై యుండును. క్రిందకణ్ణవంటి గీటులతోఁ గూడిన ఆయక్షరములే వర్గద్వితీయములగును. రెండూర్ధ్వరేఖలతోఁగూడిన ప్రథమాక్షరములే వర్గతృతీయములగును రెండురేఖలక్రింద దండాకారరేఖలతోఁగూడిన తృతీయములే చతుర్థాక్షరములగును. దండాకారము లైకలసిన రెండురేఖలతోఁగూడిన ప్రథమాక్షరములే పంచమాక్షరములగును. అథర్వణాచార్యుఁడు చెప్పినప్రకారము పూర్ణబిందువు పూర్ణచంద్రునివలె నుండును. అరబిందువు నర్ధచంద్రునివలె నుండును కష లు రెండునుకలసి క్ష అయినదికావున దానిని వేరుగాఁ జెప్పుటలేదు. విశేషించి చెప్పనందున రెండు చిన్నబిందువుల రూపముగా విసర్గనువ్రాయుట

వ్యా ల అయం అకారః- చి అయం ఇకారః- లు అయం ఉకారః ఉ అయం ఋకారః- చా అయం ఌకారః- నె హ్రస్వ ఎకారః- కీ హ్రస్వ ఒకారః- ఏతేషాం సదీర్ఘత్వేలా అయమాకారః చో అయమీకారః- లూ అయమూకారః- ఋ అయం ౠకారః- ౘో అయం ౡకారః- చా అయం దీర్ఘ ఏకారః- ల్ అయం దీర్ఘ ఓకారః- ఐ అయమైకారః- చో అయమౌకారః- ం పూర్ణబిందుః- ఁ అర్ధబిందుః- ః విసర్గః- ౯ అయం కకారః-

చ్ అయంచకారః. ట్ అయంటకారః- త్ అయంతకారః- ప్ అయంపకారః- ఎతేషామధఃప్రదేశే ఏకలఘురేఖనే ద్వితీయవర్ణా భవంతి ఖ్ అయంఖకారః ఛ్ అయంఛకారః. ఠ్ అయంఠకారః. థ్ అయంథకారః. ఫ్ అయంఫకారః. ఆద్యక్షరాణాముపరి తిర్యగ్రేఖాద్వయస్య లేఖనే గాదివర్ణాభవంతి. గ్ అయంగకారః. జ్ అయంజకారః. డ్ అయండకారః. ద్ అయందకారః. బ్ అయంబకారః. ఏతేషాం వర్ణానాముపరిగతరేఖాద్వయస్యాధ ఏకలఘురేఖాలేఖనే చతుర్థాక్షరాభవంతి. ఘ్ అయంఘకారః. ఢ్ అయంఢకారః ధ్ అయంధకారః. భ్ అయంభకారః. ప్రథమాక్షరాణామధః ఉపరిగతతిర్యగ్రేఖా స్పర్శపర్యంతం లఘుద్వయలేఖనే అనునాసికాభవంతి. ఙ్॥—అయంఙకారః. ఞ్॥— అయంఞకారః. ణ్॥—అయంణకారః. న్॥- అయంనకారః. మ్॥- అయంమకారః ఏతేవర్ణాఃక్రమేణ లిఖ్యంతే క- కకఖ్క- గ్ ఘ్ ఙ్ జ్ చ్ జ్ ఛ్ జ్ చ్ | ఝ్ ఞ్ ట్ టాట్ త్ ట్ డ్ ట్ న్ * ట్ ణ్ | త్ థ్ క్ డ్ ధ్ న్ | బ్ ప్ భ్ ఫ్—జ్ చ్ | ఛ్ భ్రామ్ | బ్ య్ ల్ ర్ జ్ త్ లూబ్ శ్రి శకారః, షకారః, సిసకారః, ప్ హకారః, చ్ దంత్యచకారః. జ్ దంత్యజకారః, బండిఱకారః, గురుళకారః గుణితక్రమస్తు. అయంకకారః. తస్య అత్వసంయోగేక. దీర్ఘే కాకూఇత్వేకి దీర్ఘే లీ ఉత్వేము తస్య దీర్ఘే కూమూకకారస్య ఋత్వే కృకౄ తస్య దీర్ఘే కౄ కకారస్య ఌత్వే కఌ తస్యదీర్ఘే

క ౽ కకారస్య ఎత్వే కే కాతస్య దీర్ఘే కే ౽౽ కే కకారస్య ఒత్వే
ౘా ౘా

కా ౽క తస్య దీర్ఘే కో ౽క తస్య ఐత్వే కై ఋతస్య ఔత్వే కౌ కస్య కకారస్యార్ధబిందౌ కఁ ఏతస్య పూర్ణబిందౌ కం. విసర్గయోగే కః. ఏవం సర్వేషాం గుణితక్రమోఽయం.

తా. స్పష్టము. ఇందుదాహరించినది పూర్వలిపి. కావునఁ గొంచెము దుర్బోధముగానుండును. మఱియు నిది వేరువేరు పుస్తకములయందు వేరువేరు రూపముగానున్నది.

వ్యా. అత్రాప్యేకవినోక్తాని పద్యాకానిచిత్ స్పష్టప్రతిపత్తయే లిఖ్యంతే॥

గీ. ఎన్నిహల్లులుజడ్డపై-నున్ననేమి।
హల్లులకుమీదనుండెడి-హల్లులెల్లఁ।
గడపటను వ్రాయుద్విత్వ-మొక్కటియెతాల్చు।
వానితలకట్టుమొదలగు-వానినెల్ల॥

గీ. మొదటిరేఫాక్షరంబునా-పిఁడపదాని।
జడ్డయును గూర్చియొకటిగాఁ-జదువుకొనుచు।
ముందుజడ్డయు వెసరేఫ-మునకుబదులు।
గిలుకవిభజించిలిఖియింతు-రిలఁ గుమతులు॥

సీ. విదియచందురుమాడ్కి-వెలయునత్వముదాని,
కుడివంకశృంగంబు-కొనగుణింపఁ।
బ్రభవించుఁ దక్కిన-ప్రాణంబులెల్లను,
నడిమికిగుడివట్టి-విడువనిత్తు।
కుడిసావుకొమ్ముకై-వడివ్రాయనుత్వంబు,
క్రిందనుసుడినిల్ప-ఋత్వమయ్యె।
వలపలమీఁదికి-మెలిగొన్నబిస్వర,
మెడమనెత్వంబొప్పఁ-గొడవలిక్రియ॥

గీ. యామ్యమునఁ గంద్రగొడ్డలి-యట్లొనర్పఁ।
గాలిజనోత్వమిన్నింటిదీ-ర్ఘములుకుడిని।
గరిక రాకృతినిలుపంగ-వసుసదనము।
నమరు నైత్వోత్వములు త్రిశూ-లములకరణి॥

సీ. శంఖశార్ఙ్గద్విపా-శనదశాంకుశపన్న,
గాకృతులనుమీఁద-నద్ధరేఖ।
వలపలనొక్క-టి నిలుపంగఁబసుపంబు,
లైదునువసుసఁజె-న్నారుచూడుఁ।
క్రిందఁగంబముపోలె క్క-గీటొక్క-టిడిన నా,
ద్యములురెండవలిపు-లైహసంగు।
పైనున్నగీటులి-బ్బడిసేయఁబ్రథమాక్షు,
రంబులుసరళవ-ర్ణంబులగును॥

గీ. గంబమొక్కటిరేఖాయు-గంబుక్రింద। వ్రాసినఁదృతీయములు చతు-ర్థంబులగును। నిలువుగీటులు రెండును-గలసితమ్ముఁ। గదియఁ దొల్లిటివనునాసి-కంబులగును॥

గీ శుకతరిమతంగభవకుంభ శుక్తిసన్ని। భంబులంతస్సములుతుద-భద్రపీఠ। వేదికాహలనిభములు-శాదిలిపులు। దంత్యచజగురురలల కుఁ-దనరుఁబొట్లు।

గద్య

ఇది శ్రీసీతారామచరణారవింద మిళిందాంతఃకరణసేన శ్రీమత్పోలూరి మాధవయజ్వచంద్రసముజ్జ్వల తత్కృపోత్తీక్షిత కటాక్షసాదితసాధుపాండిత్యాభరణోవప్రభంజన వంశాబ్ధిరాకాశశాంకెన నిరంతరారాధిత విచక్షణశశాంకెన అభినవ నన్నయభట్టాచార్యేణాహోబల పత్యాచార్యేణ విరచితాయామాంధ్ర శబ్దచింతామణి వ్యాకరణవ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం ప్రథమ స్సంజ్ఞాపరిచ్ఛేదః

శ్రీరస్తు.

# అహోబలపండితీయము.

## సంధిపరిచ్ఛేదము.

వ్యా. శ్లో॥ వందే వందారుసందోహమందారం రఘునందనం।
సదా భజే సుదేహాం తాం విదేహాధిపనందనాం॥

సూ॥ సంధిర్న చోచ్యనుతః.

ఉకారాద్వ్యతిరిక్తస్యానోచిపరేసంధిర్న భవతి. మేనయత్త-సిరియన్న- వన్నెయొల్లె- రోయీవి- మైయెుఱపు- గ్లాయుదయించె- ఇంపగు, సొంపగు, రాముఁడతఁడు, కృష్ణుఁడితఁడు,ఇత్యాద్యుదాహరణం. యద్యప్యనుత ఇత్యనేన రాముఁ నభిగామిుఁడలఁచెద ఇత్యాదౌ ఉకారస్య సంధిః ప్రాప్తః- తథాపి వివక్షిత ద్వితీయార్థప్రతీత్యభావప్రసంగస్స్యాదితి సనివార్యః॥ "పాంశుపయోదనీలతను భాసితనుజ్వలదండధార" ఇత్యాదిప్రయోగాత్। నచానుత ఇతిద్రుతపూర్వోకార వ్యతిరిక్తవిషయ ఇతివాచ్యం "అనాదిషువిభక్తిషూ తో వా" చోర్వాస్యాత్ "ఇతిప్రాప్తేవిభాషారంభేణద్రుతపూర్వ ప్రాణసంధేరిష్టత్వేన జ్ఞాపనాత్. నచసా అప్రాప్తైవేతివాచ్యం. నస్యాత్తర్వోత ఇతి తత్సంధ్యనుజ్ఞావిజ్ఞానాత్ నహిప్రాప్తింమంతరా నిషేధః క్రియతే.

తా. వ్యాఖ్యాతవందే ఇత్యాది శ్లోకముచేత నిష్టదేవతాస్తోత్రముఁజేయుచున్నాఁడు. నమస్కరించువారి సమూహమునకు కల్పవృక్షమగు (అనఁగా యిష్టములనిచ్చునట్టి) రాముని నమస్కరించుచున్నాను. మఱియు, మంచి శరీరముగల ప్రసిద్ధయగు సీత నెల్లప్పుడు సేవించుచున్నాను. అని శ్లోకార్థము. ఉకారమునకంటె నితరమగు

అచ్చునకచ్చు పరమగుచుండఁగా సంధిలేదు. (అనఁగా ఉకారమునకు సంధి తప్పకవచ్చుననుట.) మేనయత్త మొదలగునవి ఉకారేతరాచ్చులకు సంధి లేకుండుటకుదాహరణములు. ఇంపగు ఇత్యాదులు ఉకారసంధికుదాహరణములు. విచారించఁగా అనుతః అను ఉకారసంధి విధిచేత రాము నభిరాము నిత్యాద్యులందు ఉకారసంధి రావలసియున్నది. అయినను సంధిచేసినయెడ అక్కడ వివక్షించఁబడు ద్వితీయార్థము తోఁచకుండుట ప్రసక్తించునుగాన సంధి మానుకోవలెను, ఇందుకు ప్రాంశు ఇత్యాది పద్యమందు 'భాసితునుజ్జ్వల' అని సంధిలేకుండుట జ్ఞాపకము. అనుతః అనునది ద్రుతమునకుఁ బూర్వమందున్న ఉకారముగాక తక్కిన ఉకారవిషయము అని చెప్పఁగూడదు. ఈసూత్రముచేత ఉకారము ద్రుతాంతమైనను నిత్యముగా సంధి వచ్చుచుండఁగా 'అనాదిషు' 'చోర్వా' అని వికల్పించుటచేత ద్రుతమునకుఁ బూర్వమందున్న అచ్చునకు సంధి ఇష్టమని జ్ఞాపకము కలదుగదా. ద్రుతాంతమైన అచ్చునకు సంధిప్రాప్తించకపోవుటచేత 'అనాదిషు' 'చోర్వా' అని వికల్పించఁబడుచున్నదిగాని ప్రాప్తించఁగా వికల్పము గాదందురేమో అట్లనఁదగదు. ప్రాప్తించనిచో 'నస్యాత్తద్ధర్మోతః' అని ద్రుతాంతమగు తద్ధర్మోకారమునకు సంధినిషేధమువలన నచట సంధినంగీకరించినట్లు జ్ఞాపకమెట్లుకలుగును. ప్రాప్తించనిచో నిషేధముచేయఁబడదుగదా.

వ్యా. నను లుగ్వా ద్రుతప్రకృతికాదితి సూత్రేణ సరళే స్థిరేచ పరతః నచ్యవాలుక్చతదుత్తరసూత్రేణ సంశ్లేషశ్చ విహిత ఇతి ప్రాణేఽరేవనస్య లుక్సంశ్లేషయోః ప్రాప్తిరేవనాస్తి. లుక్సంశ్లేషౌ నాచీతి తత్రనిషేధః. కృత ఇతి తన్న్యాయేనాత్రాపి నిషేధః కృత ఇతిచేత్సత్యం. తత్సూత్రం నిగళితార్థానువాదకమేవేత్యవధేహి- ఏవం బహువచనే రాముల నభిరాముల నిత్యాదౌ వాతఇత్యనేన విరోధాభావాత్సంధిః ప్రాప్తః. సోప్యేవమేవనివార్యః పరమండలంబులధర

ణిపతులనదిమి. అల్కాతోఁబొడిచిన సత్తమద్విజులుపూజ్యులుఇత్యాదౌతదుక్తేః.

తా. ఓంయీ లుగ్వా అనుసూత్రముచేత సరళమును స్థిరవర్ణమును పరమగునపుడు నకారమునకు వికల్పలోపమును ఆపైసూత్రముచేత సంశ్లేషమును విధింపఁబడినది. కానిఅచ్చుపరమగుచుండఁగా నకారమునకు లోపసంశ్లేషములకు ప్రాప్తియేలేదు ఇట్లుండగా అచ్చట అచ్చుపరమగుచుండఁగా లోపసంశ్లేషములు లేవనినిషేధించఁబడినది. ఆన్యాయముచేతనిక్కడఁగూడ నిషేధించఁబడినది. అందురేమోఅది నిజమే. కాని ఆసూత్రములోఁ సిద్ధార్థమునునువదించునదియని తెలియవలెను ఇట్లుబహువచనమందు రాములనభిరాముల నిత్యాదులయందు వాతః అనుసూత్రముచేత విరోధములేనందున సంధిప్రాప్తించినది. అదియుదీనిచేనివారించఁదగినది పరమండలంబులఇత్యాదులయందు ఆసంధిలేకపోవుట చెప్పఁబడియున్నదిగదా.

వ్యా ద్వితీయాచార్యేణతు॥ సంధిస్తుద్రుతపూర్వస్యప్రాయశోనభవేదత ఇత్యుక్తం. ద్రుదాత్పూర్వస్యాకారస్యసంధిః ప్రాయశోనభవేదితితస్యార్థః. ప్రాయోగ్రహణస్యతు ఇంకెప్పుడు ఇంకనెప్పుడు ఇత్యాదిఫలమనుసంధేయం- పడగనున్న హనుభయవిహ్వలుఁడుగాఁడు అరదమునకు నూతుఁడచ్చుతుండు ఇత్యాదౌసంధ్యభావోపిన దోషాయ- నస్యాద్వాక్యవిరామేతు సంధిభావోపిదోషకృత్. ఇత్యథర్వణోక్తేః ఆద్యభాషాకావ్యేషుతుపూర్వోత్తరార్థయోస్సంధ్యభావస్యాదోషత్వేపిఆర్ధేసంధ్యభావోదోషాయ భవత్యేవేతిజ్ఞేయం.

తా. ద్వితీయాచార్యుఁడు॥ ద్రుతమునకుఁబూర్వమందున్న అకారమునకు బహుళముగా సంధిలేకుండును అనిచెప్పెను బహుళముగానున్నందున ఇంకెప్పుడు ఇత్యాదులుసిద్ధించినవి. అని తెలియవలెను పడగనున్న అను-చోట కాదుఅరదము అనిసంధిలేకుండుటయుదోషముగాదు. నస్యాద్వాక్య ఇత్యాదికమునథర్వణాచార్యుఁడు చెప్పి

యుండెంగావున. సంస్కృతకావ్యములయందు శ్లోకములయొక్క మొదటిసగమునకు రెండవసగమునకు సంధిలేకుండుటదోషముగాకున్నను సగములోనుండు రెండుపాదములకు సంధిలేకుండుటదోషమని తెలియఁదగినది.

సూ॥ వాతః.

వ్యా. అకారస్యసంధిర్వాస్యాత్॥ అప్రాప్తైవిభాషేయం. లెస్సగు లెస్సయగుమేనత్త- మేనయత్త ఎల్లపుడు ఎల్లయపుడు ఇత్యాది. పొన్నాకు, చందమామల్లుఁడు, ఆవంత తగినట్లు, వంటలక్క ఇత్యాదీనాంసంధేరేవసుందరత్వాద్వ్యవస్థిత విభాషయాత్రసంధేర్నిత్యత్వం జ్ఞేయం. అతఏవాథర్వణేనోక్తం। భవంతికేచిచ్ఛబ్దాస్తుసాంగత్యేనైవసాధవఇతి. ఏతద్వచనసామర్థ్యాదేవ చింతాకంత నెపంబుఇత్యాదేః. నిలుచున్నవాఁడుఇత్యాదేశ్చసాధుత్వం అన్యథా॥ షష్ఠ్యాఉత్తోచినుమ్నఇతిసూత్రప్రాప్త్యానుమాభావాత్. క్త్వార్థేతోనభవేత్సదాఇతిసంధినిషేధాచ్చాసాధుత్వమేవస్యాదితి ఏతదాథర్వణవచనబలాదేవ॥ తమ్ముగుఱ్ఱలు ఇత్యాదౌ ఉత్వంసాధుత్వమస్తీతి ఇతిధ్యేయమితి నృసింహః.

తా. అకారమునకు సంధివికల్పముగానగును. అకారమునకుసంధి ప్రాప్తించకుండఁగా నీవికల్పముచేయఁబడినది. లెస్సగుఇత్యాగులుదాహరణములు పొన్నాకు ఇత్యాదులకు సంధియేసుందరముగానుండుంగనుక వ్యవస్థితవిభాషచేత [అనఁగా ఈవికల్పమీసలములయందురాదు అనిహద్దుచేయుటచేత] ఇక్కడసంధినిత్యమని తెలియవలెను. కావుననే అథర్వణాచార్యుఁడు కొన్నిశబ్దములు సంధిచేతనేసాధువులగుచున్నవియని చెప్పెను. ఈయథర్వణవచనసామర్థ్యమువలననే చింతాకు ఇత్యాదులకుఁగూడ సాధుత్వము కలిగినది అట్లుగానిచో షష్ఠీసమాసమునందు ఉకారమునకు నుగాగమము వచ్చునని సూత్రముపలన నుగాగమమును, క్త్వార్థకేకారమునకెల్లపుడు సంధి రా

చను వచనమువలన సంధి రాకపోవుటయు ప్రాప్తించి యసాధుత్వమే కలుగును. ఈయధర్వణవచనబలమువలననే తమ్ముగుఱ్ఱము ఇత్యాదులయందు ఉకారము సాధువగుచున్నది అని తలంచవలెనని నృసింహుఁడు చెప్పెను.

వ్యా. వస్తుతస్తు నిలుచున్నవాఁడు ఇత్యత్ర ధాతోరవయవశ్చుః. క్త్వార్థేతస్తు సంధిర్నేష్టవ్య ఏవ సంస్కృతసమాంతస్థితస్యాచోపి క్వచిత్సంధిః. గంగనుకాసె, శ్రీరంగిభర్తంచు, శౌరిచ్చుశుభములు ఇత్యాది కవిప్రయోగాత్. అత ఏవాధర్వణగ్రంథే కుత్రచిత్సంస్కృతీయోపి ప్రాణోప్యత్రచ్యుతో భవేత్. ఇతి స్థితం

తా. వాస్తవమువలన నిలుచున్నవాఁడు అనుచోట (నిలుచు అనుచోట) ధాత్వవయవముగుచు నగ్ణము (క్త్వార్థకారము కాదనుట) క్త్వార్థకారమునకు సంధి యిష్టమే కాదు. సంస్కృతి సమములకుఁ జివరనున్న అచ్చునకును ఒకానొకచోట సంధిగలదు. గంగను కాసె ఇత్యాది కవిప్రయోగము గలదు. కావుననే అధర్వణగ్రంథమందు ఈ తెనుగునందొకానొకచోట సంస్కృతశబ్ద సంబంధియగు అచ్చును జారిపోవును (అనఁగా సంధికలుగును) అనియున్నది

సూ॥ అనాదిషువిభక్తిషూతో వా.

వ్యా ప్రథమావిభక్తివ్యతిరిక్తవిభక్తిగతోకారస్య వాసంధిస్స్యాత్ క్వచిత్. అత్ర వాశబ్దస్సముచ్చయార్థే పూర్వసూత్రాదేవ వికల్పార్థకవాశబ్దానువృత్తేః. ప్రాప్తే విభాషేయం. నన్నేలుక, నుమ్మేలుక, మాకొలకిచ్చునాయువు. కీర్తియందనురక్తి ఇత్యాది సంధ్యభావే మమ్మునేలుక ఇత్యాదిర్జ్ఞేయం. సంధివిధానసామర్థ్యాదేవ సంధివేళాయాం ద్రుతస్యాదృశ్యత్వం జ్ఞాపితా అధర్వణస్తు. అచాంసంధౌ ద్రుతో దృశ్యస్స్వాత్తోపి చ భవేత్సదా. క్వచిత్ప్రత్యయయోగేన తద్ధాత్వమభిధీయత ఇత్యువాచ. ప్రత్యయయోగే మిక్కిలియు నిత్యుదాహరణం.

తా. ప్రథమావిభక్తిగాక తక్కినవిభక్తులఁబొందిన ఉకారమునకు నచ్చుపరముగాఁగా సంధివికల్పముగానగును ఈసూత్రమందు వాశబ్దము సముచ్చయార్థమందు పూర్వసూత్రమువలన వికల్పార్థముగల వాశబ్దమునకనువృత్తివలన ఇది॥ సంధిర్నాచోచ్యుతేః॥ అనుసూత్రముచేత నిత్యముగా బ్రాప్తించఁగా వికల్పము నన్నేలు విత్యాదులుసంధికిని మమ్మునేలుఁ ఇత్యాదులుసంధిలేకుండుటకు నుదాహరణములు ద్రుతాంతములగు ద్వితీయాదులగు సంధివిధించిన సామర్థ్యమువలననే సంధికాలమందు ద్రుతముగాన్పించకుండుట తెలుపఁబడుచున్నది అథర్వణాచార్యుఁడైతే ద్రుతముఅచ్సంధికాలమందు కాన్పించదు తక్కినచోటనుండును. ఒకానొకచోటఁ బ్రత్యయసంబంధముచేత నట్లుగానేయుండుటచెప్పఁబడుచున్నది. అనిచెప్పెను. ప్రత్యయసంబంధమందు మిక్కిలియున్ అనియుదాహరణము.

సూ॥ నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః.

వ్యా. నిత్యగ్రహణంవానువృత్తినివృత్త్యర్థం॥ ఉత్తమపురుషవ్యతిరిక్తక్రియాగతేస్యేకారస్యఅచాసహనిత్యం సంధిస్స్యాత్. రాముని వినుతించిరమరులు. చేసితివచ్యుతుపూజ కంటివిపతనిరూపము ఇత్యాద్యుదాహరణం. ఉత్తమపురుషేతు ప్రాయస్తుస్యాత్క్వమాదికస్యేతః ఇతివక్ష్యమాణసూత్రేణప్రాయస్సంధిః చేసితినచ్యుతార్చనము చేసితిమచ్యుతార్చనము. ఇత్యాది- వికృతివివేకకారస్తు॥ ప్రథమచోత్తమే చైవక్రియేతోవాభవేచ్ఛ్రుతిః. నిత్యమన్యస్యవికృతౌక్త్వార్థతోనభవేత్సదా. ఇతి ప్రథమపురుషేపిసంధేర్వికల్పమాహ అతఏవ బలభిద్వహ్నిపరేతరాజనైరుణాల్ పర్యుత్సుకత్వంబుసంధిలఁగూర్చుండిరి యొండొరుంగదిసి, సిద్దింగాంచిరి యవిముక్తసీమయందు, ఇత్యాదయశ్శ్రీనాథాదిప్రయోగాస్సంగచ్ఛంతే. కాకునూర్యప్పకవిస్తు ఏతద్గ్రంథసంపాదనవైధుర్యేణ శ్రీనాథస్యభ్రాంతిత్వమాహ.

తా. ఈసూత్రమందు నిత్యగ్రహణము వాఅనుపూర్వసూత్రస్థపదము అనువర్తింపకుండుటకై చేయఁబడెను, ఉత్తమపురుషకంటె నితరముగ క్రియను బొందిన ఇకారమునకు అచ్చుతోడ నిత్యముగా సంధియగును. రామునివినుంతించిరమరులు ఇత్యాదులుదాహరణములు ఉత్తమపురుషయందైతే కిమాదికముయొక్క ఇకారమునకు సంధితరుచుగనగునని చెప్పఁబోవుసూత్రము చేఁదరుచుగ సంధియగును. చేసితినచ్యుతార్చనము ఇత్యాదులుదాహరణములు, వికృతివివేకకారుఁడైతే ప్రథమపురుషయందు నుత్తమపురుషయందును క్రియాసంబంధియగు ఇకారమునకు వికల్పముగా జారిపోవుటయగును. తక్కినమధ్యమపురుషఇకారమునకు నిత్యముగానగును- క్త్వార్థేకారమునకెల్లప్పుడు సంధిలేదు- అనిప్రథమపురుషయందుఁగూడ సంధికివికల్పముఁ జెప్పెను కనుకనే బలభిద్వహ్నీత్యాదులగు శ్రీనాథాదుల ప్రయోగములనుకహాలించుచున్నవి కాకుసూర్యప్పకవియీయథర్వణ గ్రంథమును సంపాదించలేక శ్రీనాథునికి భ్రాంతినిఁజెప్పెను.

సూ॥ పరిమితౌసమస్తానాం.

వ్యా. పరిమాణార్థకే వర్ణకే పరే తత్సంబంధిప్రాణేసహ సర్వప్రాణానాం నిత్యం సంధిస్స్యాత్. బారెడు, మూరెడు, పట్టెడు, తూమెడు, గంపెడు ఇత్యాది మానార్థాన్నిత్యమేకత్వమేడుస్స్యాత్పరిమాణక ఇత్యథర్వణేనోక్తం.

తా, కొలత అర్థముగల ప్రత్యయము పరమగుచుండఁగా దాని యచ్చుతో [అనఁగా ఎకారముతో] అన్నియచ్చులకు నిత్యముగా సంధియగును. బారెడు ఇత్యాదులుదాహరణములు. పరిమాణవాచక శబ్దమునకుఁ బైని నిత్యముగా ఏకత్వము ప్రమాణార్థముగల ఎడు వర్ణకము వగునని అథర్వణాచార్యుఁడు చెప్పెను-

సూ॥ నస్యాత్తదర్థోతః.

వ్యా॥ సంధిరితి సర్వత్రానువర్తతే తదర్థోకారస్యాచి సంధిర్న స్యాత్. తదర్థపదేన తదర్థక్రియా తజ్జన్య విశేషణంచ గృహ్యతే ‘వెలయునతనికీర్తిసకలదిగ్వలయమునను రక్షణమొనర్చునంబుజాతాక్షుగొలుతు నిత్యాద్యుదాహరణం

తా. సంధిః అను శబ్దము అంతట ననువర్తించుచున్నది. తదర్థోకారమునకచ్చు పరమగుచుండఁగా సంధిలేదు. తదర్థపదముచేత తదర్థక్రియయును దానివలనఁ బుట్టిన విశేషణమును గ్రహింపఁబడుచున్నది. వీనికి రెంటికి నుదాహరణములు వెలయు నిత్యాదులు.

సూ॥ చోర్వాస్యాద్వర్తమానవిహితస్య.

వ్యా. వర్తమానార్థే విహితస్య చువర్ణకస్యోతోచివా సంధిః. పూర్వసూత్రాదుత ఇత్యభిన్నమపి పదమత్రానువర్తతే. పాణినీయే అనుస్వారస్యయయిపరసవర్ణ ఇతి సూత్రాద భిన్నస్యాపి సవర్ణపదస్య. ఉదస్థాస్తంభ్వోః పూర్వస్యేతి సూత్రే అనువృత్తేశ్శాబ్దికమణిభిరూరీకృతత్వాత్. నచ తత్రస్వరితేనాధికారఇతి స్వరితప్రతిజ్ఞామహిమ్నానువృత్తిర్నతథాత్రేతివాచ్యం. ఏషాతయోర్వికృతిరితి వికృతిసంజ్ఞాంకుర్వతా శబ్దానుశాసనే నానుక్తకార్యమాత్రస్యప్రాప్తేరభ్యనుజ్ఞానాదితి పూర్వమేవోక్తం. ప్రాప్తే విభాషేయం. నగుచిట్లనియె- నగుచు నిట్లనియె కన్నియలతోడ నాడుచు నున్నదాని నిత్యాచార్య ఆదిపర్వణి వ్యాజహార. తస్మిన్నేవపద్యే చతుర్థచరణే. ‘అరచుచుండఁ బ్రమద్వరయవనిఁదెళ్ళి’ నిత్యాద్యుదాహరణం.

తా. వర్తమానార్థమందు విధింపఁబడిన చువర్ణకముయొక్క ఉకారమున కచ్చుపరంబగునపుడు సంధి వికల్పముగా నగును. పూర్వసూత్రమునుంచి ఉతః అనునది సమాసమందుండుటచేత వేరుపదముగాకున్నను ఇచ్చటికనువర్తించుచున్నది. పాణినీయవ్యాకరణమందు

'అనుస్వారస్యేత్యాది' సూత్రమువలన సవర్ణపదము సమాసమందున్నను 'ఉదస్థాస్తంభోః' అను సూత్రమందనువృత్తిని శబ్దశాస్త్రవేత్తలంగీకరించిరిగదా, అచ్చట స్వరితము అయినపదము అనువర్తించుచున్నది. అనుసూత్రముచే స్వరితప్రతిజ్ఞయొక్క శక్తిచేత అనువృత్తిగలదు ఈయాంధ్రభాషసంస్కృత ప్రాకృతములవికారమని వికృతిసంజ్ఞను చేసిన నన్నయభట్టుచేత ఈవ్యాకరణమందుఁ జెప్పని కార్యమునకుమాత్రము ఇతరవ్యాకరణములవలఁ బ్రాప్తించుటకనుజ్ఞయియ్యఁబడినదనదనిమునుపే చెప్పఁబడినది. ఇది సంధిర్నాచోచ్యుతః. అనుసూత్రముచేత నిత్యముగాఁ బ్రాప్తించఁగావికల్పము. నగుచుఇత్యాద్యుదాహరణము కన్నియలతోడనిత్యాదికమాచార్యుఁడాదిపర్వమందుఁ జెప్పెను. ఆపద్యమందే నాల్గవపాదమందు, అరచుచుండనిత్యాదికము సంధికలిగినందుకుదాహరణము.

సూ॥ తద్వత్తదాదిజస్య.

వ్యా. ఉత్తరసూత్రాదిత ఇత్యపకృష్యతే తదాదిపర్యాయాః యేఽత్ర అదీత్యాదయస్తజ్జస్య తదంతస్యేతః తద్వద్వాసంధిస్స్యాత్. అదియేమి—అదేమి. ఇదియేమి—ఇదేమి. ఏదియయ్య—ఏదయ్య ఇత్యాది.

తా. రాఁబోవు సూత్రమువలన ఇతః అని అపకర్షింపఁబడుచున్నది (అపకర్షమనఁగా ఉత్తరసూత్రపదముఁ బూర్వసూత్రములోనికి లాగి అన్వయించుట ) తత్ మొదలగువాని పర్యాయములగు అది మొదలగువాని యంతిమందున్న ఇకారమునకు అప్రకారముగానే (అనఁగా పూర్వసూత్రమందువలెనే వికల్పముగా సంధియగును.] అదియేమి ఇత్యాదులుదాహరణములు.

సూ॥ ప్రాయస్తుస్యాత్కిమాదికస్యేతః.

వ్యా. కిమాదిపర్యాయాయోఽత్ర ఏమ్యాదిః. తస్యేతస్తుబహుళం సంధిస్స్యాత్. ప్రాయోగ్రహణా త్క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృ

త్తిః క్వచిద్విభాషా. కంచంతకాపురము, మగనాలు ఇత్యాదిషు ప్రవృత్తిః ‘ అరుగుదెంచియతఁడు హరినిఁగనియె ’ తింటినతిమధురఫలములు, కంటినంబుజాక్షు నిత్యాదావప్రవృత్తిః. కొలిచితినబిజ్జన్, కొలిచితబిజ్జన్, ఏమయ్యా, ఏమియయ్యా ఇత్యాదౌ విభాషేతి ప్రయోగతోఽవగంతవ్యం. ‘ క్వార్థేతోనభవేత్సదా ’ ఇత్యథర్వణేనాప్యుక్తం. రామునికభిరామగుణా రామునికినినతులు. అనలజ్యోత్యుండెవీఁడుండఁగా నిత్యాదీనామేతద్గణత్వేనైవ సాధుత్వమవగంతవ్య కిమాదికత్వేనైవ తదాదేరపిసిద్ధత్వా త్పృథక్కరణం స్పష్టప్రతిపత్త్యర్థః ‘ ఆద్యంతవర్ణయోరైక్యం సంధిరిత్యుచ్యతేబుధైః ’ పూర్వస్యపరరూపత్వ మత్రైవ నియతం భవేత్ ’ ఇత్యథర్వణేనోక్తం. అనుస్వారేపరేత్వత్రనసంధిః. ఏకపదేసంధ్యభావాత్. సంధిస్త్వపద ఇతి ప్రాకృతసూత్రాత్- పరరూపలక్షణసంధేరసంభవాచ్చేతి జ్ఞేయం.

తా. కిమాదులకుఁ బర్యాయమగు నేమ్యాదికముయొక్క ఇకారమునకు సంధిబహుళము గానగును. ప్రాయశ్శబ్దగ్రహణమువలనఁ గొన్నిచోట్ల నీవిధి ప్రవర్తించును. కొన్నిచోటులఁ బ్రవర్తించదు. కొన్నిచోటుల వికల్పము. కంచంత ఇత్యాదులుప్రవృత్తికి, నప్రవృత్తికి వికల్పమునకు నుదాహరణములు ప్రయోగమువలనఁ దెలియఁదగినవి క్వార్థేత్య ఇత్యాదిక మథర్వణుఁడు చెప్పెను. రామునికభిరామునికి ఇత్యాదులీగణములోనివి గావున సాధువులని తెలియవలెను. కిమాదికమందే తదాదికమును గూడఁ బఠించుటచే సిద్ధించినదౌటవలన వేరుగాఁజేయుట స్పష్టముగాఁ దెలియుటకొఱకు [రెండవపదమునకు] మొదటనుండునట్టియు, [మొదటి పదమునకు] నంతమందుండునట్టియు నక్షరముల కేకత్వము సంధియని విద్వాంసులు చెప్పుచున్నారు. ఇక్కడనే పూర్వాక్షరమునకుఁ బరరూపముగలుగుట నియతము. అని యథర్వణాచార్యుఁడు చెప్పెను- ఇందు అనుస్వారము పరమ

సుచుండఁగా సంధిలేదు ఏకపదమందు లేదుగావున- మఱియు సంధి ఏకపదేతరస్థలమందుఁ గలుగునని ప్రాకృతవ్యాకరణసూత్రము వలనఁగూడఁ బరరూపలక్షణసంధిలేదుగావున నిట్లు తెలియఁదగినది.

సూ॥ అపిశబ్దార్థస్యేతః.

వ్యా. లుగ్వేత్యుత్తరసూత్రాదపకృష్యతే॥ అపిశబ్దార్థోత్రఏనిశబ్దః. తస్యేతోలుగ్వాస్యాత్. హరి నే. బిజనేనిఁగొలిచెద- హరినేనియబ్బిజ నేనిఁగొల్చెద ఇత్యాద్యుదాహరణము. అత్రేయంచింతా- రాము నే సీత నేగొల్తునిత్యాత్యర్థమిదంసూత్రం- అన్యథా కిమాదికత్వేనైవాచిప రేరూపసిద్ధేస్సూత్రంము ధాస్యాదితి

తా. లుగ్వాఅని పైసూత్రిమువలన నపకర్షింపఁబడును. ఇచ్చట అపిశబ్దార్థము ఏనిశబ్దము దానిఇకారమునకులోపము వికల్పముగాన గును. హరినేనిత్యాదులుదాహరణములు- ఇక్కడనొకవిచారణము చేయ వలెను. ఈసూత్రము రాము నే. సీత నేగొల్తునిత్యాదులయందేనిశబ్దము నకు హల్లుపరమగుచుండగా ఇకారలోపమునకై చేయఁబడినది. అట్లు కానిచో కిమాదికమువలన నే అచ్చుపరమగుచుండఁగా సంధిసిద్ధించు టవలన నీసూత్రమువ్యర్థమగును.

సూ॥ చౌరేరుపధాత్వసశ్చ లుగ్వాస్యాత్.

వ్యా. ఉపధాభూతో రివర్ణసంబంధీయఇత్ తస్యచ లుగ్వాస్యా చ్చివర్ణేపరే- అమరిచి, అమర్చి, తనరిచి తనర్చి, తనర్చక్ ఇత్యాది, చోత్రసముచ్చయే

తా [ఉపధయనఁగా అంత్యాక్షరమునకుఁబూర్వాక్షరము. ఇ క్కడఅక్షరము అచ్చుతోఁగూడిన హలువివక్షింపఁబడుచున్నది] ఉపధయగురివర్ణము యొక్క ఇకారమునకు చవర్ణము పరమగుచుండఁ గా లోపము వికల్పముగాఁగును అమరిచు ఇత్యాదులుదాహరణము లు (అమర్చక్ అనుచోట చివర్ణములేకున్నను చౌ అనిగ్రహించు

ట చకారమాత్రమునకు ఉపలక్షణము అని తెలియవలెను. అందువలన అమర్చుక్ ఇత్యాదులును సిద్ధించును.)

సూ॥ శత్రర్థేతూతశ్చాన్నోః.

వ్యా. వర్తమానార్థకే చువర్ణేపరే ఉపధాత్మనో నకారస్యచ వాలుక్స్యాత్- తుశబ్దోత్రచార్థే, అనుచు, అన్చు, వినుచు, విన్చు, కనుచు, కన్చు ఇత్యాది.

తా. వర్తమానార్థక చువర్ణకము పరమగుచుండఁగా ఉపధయగు నకారమునకును లోపము వికల్పముగానగును. ఇచ్చట తు, అనునది సముచ్చయార్థమందు వర్తించును అనుచు- ఇత్యాదు లుదాహరణములు.

సూ॥ తస్యస్యాచ్చపూర్ణబిందురపి.

వ్యా. తస్యనకారస్య పూర్ణః బిందుశ్చస్యాదపి అంచు; కంచు, వించు, ఇత్యాది. 'వంచించి పట్టుకొనియెద। నంచు' నితి శ్రీనాథః- బిందోరపి వైకల్పికత్వేన రూపత్రయమత్ర సిద్ధ్యతి- అనుచు, అన్చు, అంచు ఇత్యాది అపిశబ్దాత్ చనుముక్, ఎన్నుచుక్, పూనుచు నిత్యాదౌ నైతత్కార్య మితి జ్ఞేయం అలవరించి, ఇత్యాదౌ నహి స్వాంగం స్వవ్యవధాయకమితి న్యాయేన బిందునావ్యవధానేపి ఇ తోలుక్స్యాదితి తద్వ్యావృత్త్యర్థ ముపధాత్మన ఇతి విశేషణం.

తా. ఆనకారమునకుఁ బూర్ణబిందువుగూడవచ్చినను రావచ్చును. అంచు, ఇత్యాదులుదాహరణము బిందువునకుంగూడ వైకల్పికత్వముచే మూఁడురూపములు సిద్ధించుచున్నవి. అనుచు, అన్చు, అంచు, అని- అపిశబ్దమువలన చనుచుక్, ఎన్నుచుక్, పూనుచు నిత్యాదులయందీ కార్యములేదని తెలియవలెను. అలవరించి ఇత్యాదులయందు 'తనయొక్క అంగము తనకడ్డుచేయునది గాదు-' అను న్యాయముచే బిందువడ్డుండినను ఇకారమునకు లోపము వచ్చునని దానిని మరలించుటకయి యుపధాత్మనః అను విశేషణముంచఁబడినది- (ఇ

చట ఇకారము అంత్యమగు నకారమునకుఁ గేవలము పూర్వమందు లేక మధ్యనుస్వారయుండుటచే నుపధకానేరదు-)

సూ॥ శబ్దాత్తచ్ఛబ్దాతః.

వ్యా- శబ్దాత్, కాఁప్వాదిశబ్దాత్- పరస్యతచ్ఛబ్దస్య అదీత్యస్య అకారస్యవాలుక్స్యాత్- కాఁపుది కాఁపది, బాఁపనది, బాఁపఁయది, కోమటిది, కోమటియది, అట్టిది, అట్టియది, ఇట్టిది, ఇట్టియది ఇత్యాది

తా- కాఁపు మొదలగు శబ్దములకంటెఁ బరమగు అదియను దానియొక్క అకారమునకులోపము వికల్పముగానగును- కాఁపుది ఇత్యాదులుదాహరణములు-

సూ॥ పోశ్చతదాద్యర్థవాచకేషూతః.

వ్యా తదాయదేదానీం ముఖశబ్దార్థక వాచకాయేఽత్ర అప్పుడు ఇత్యాదయః- తేషుయఃపుకారస్తస్యోకారస్యచ వాలుక్స్యాత్ అప్పుడు, అప్డు, ఇప్పుడు, ఇప్డు. ఎప్పుడు,ఎప్డుఇత్యాద్యుదాహరణం.

తా- తదా యదా ఇదానీం మొదలగుశబ్దములకర్థమగు అప్పుడు, ఎప్పుడు ఇప్పుడు అనుశబ్దములయందు ఏపుకారముకలదో దాని ఉకారమునకులోపము వికల్పముగానగును- అప్పుడు, అప్డు ఇత్యాదులుదాహరణములు-

సూ॥ ప్రథమావైభక్తికేమోర్బిందుశ్చ మహాన్ పతిక్రియార్థేషు.

వ్యా పతిధాత్వర్థాభిధాయుకశబ్దే పరేతు ప్రథమావైభక్తికత్వేన వ్యవహృతస్య మువర్ణకస్యలుగ్వాస్యాత్- లోపాభావపక్షే బిందుశ్చతస్య మహాన్ పూర్ణోవాస్యాత్- సంతోషపడి, సంతోషంపడి, సంతోషముపడి ఇతి రూపాణి- ఏవం సంకటపడి, పడంపడి, ఇత్యాదిబోధ్యం-

తా- పతిధాతువుయొక్క అర్థమును జెప్పు (పడు అను)శబ్దము పరమగుచుండఁగా ప్రథమావిభక్తిసంబంధియై వ్యవహరించఁబడు ము వర్ణకమునకు లోపము వికల్పముగా నగును- లోపము లేనిపక్షమున నాము వర్ణమునకు పెద్దసున్న [అనఁగా పూర్ణబిందువు] వికల్పముగా నగును- సంతోషపడి, సంతోషంపడి. సంతోషముపడి అని రూపములు-ఈలాగున సంకటపడి, పదంపడి ఇత్యాదులు తెలియఁదగినవి

వ్యా- ఆదంతపాదిశబ్దేతు సత్యర్థేబిందులోపకౌ । వర్ణకస్యాత్ర కథితౌ క్వచిత్సుకవిసమ్మతే రిత్యథర్వణోక్త్యా ఆదంతపాదీతి నియమాంగీకారాత్- సంతోషపెట్టి ఇతి రూపంత్వసంగతమేవ- ' పరగు వీధులు పురిసూత్రిపట్టినట్లు ' ఇత్యంధ్రకవితా పితామహః- అఆ దితిచ్ఛేదః- సంతోషపాటు ఇత్యాది-

తా- ఆకారమంతమందుఁగల పకారము మొదటియందుఁగల పత్యర్థకశబ్దము పరమగుచుండఁగా [ము] వర్ణకమునకు నీ భాషయందొకానొకచోట కవిసమ్మతివలనఁ బూర్ణబిందు లోపములు చెప్పఁబడినవి- అనునథర్వణవాక్యముచే ఆకారాంతమయిన పకారమాదియందుఁ గలదియని నియమమునంగీకరించుటవలన సంతోషపెట్టి అనురూపము అనుకూలించలేదు- [పెట్టియనుచో ఆకారమంతమందుఁగల పకారము లేదుగదా] పరగువీధులు ఇత్యాదికము నలసాని పెద్దనచెప్పెను- [ఇచట పట్టియనుచో అకారమంతమందుఁగల పకారము- అదియాకారికచే నెట్లుసంగతమైనదని శంకించుకొని సమాధానముచేయుచున్నాఁడు] అఆత్ అనిపదచ్ఛేదము- (అనఁగా ఆదంత అనుచోట అ, ఆత్ అనునవిరెండునుగలసి, ఆత్ అయినవి) సంతోషపాటు ఇత్యాదికములు- (ఇది ఆకారాంత పకారాదికమునకు నుదాహరణము)

వ్యా- నను, సంతోషంపడీత్యాదౌ ' తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్ ' ఇతిప్రథమాత్వే సత్యనుస్వారస్య స్థానివత్త్వేన ము

వర్ణకాంతత్వే 'గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్' ఇతిపకారస్య వకారస్స్యాత్- ప్రథమామాత్రాదితి మాత్రగ్రహణాల్లుక్యపిస్యాత్ - నచవాచ్యం స్థానివద్భావే ఆంధ్రవ్యాకరణేన ప్రసిద్ధ ఇతి- 'క్వచిత్సంస్కృతీయోపి ప్రాణోప్యత్ర మృతో భవేత్' ఇత్యథర్వణోక్త తత్ప్రసిద్ధేః- అన్యథా, గంగనుకాసె, ఇత్యత్ర స్థానివద్భావమంతరా దీర్ఘస్థానికస్య హ్రస్వస్య సంస్కృతీయతా సిధ్యేదితి చేత్సత్యం- వకారవిధేరల్విధిత్వేన తదభావాన్నోక్తదోషప్రసక్తిః- 'స్థానివదాదేశోనల్విధౌ' ఇతిపాణినీయసూత్రే అలివిధి రలావిధి రలోవిధి రలఃపరస్యవిధిరితి చతుర్ధావ్యాఖ్యాన మూరీకృతః- పదశాస్త్రిణారీణైస్తత్తత్రైవ ద్రష్టవ్యం- నచలుక్యపిపకారస్యవకారః- మాత్రశబ్దస్య అప్పుడుదావచ్చె. ఘటియింపుచున్నా(డుగదా- ఇత్యాది విషయత్వేన క్లృప్తత్వాత్- ఆదంతపాదీత్యథర్వణోక్తి రప్యత్ర మానమిత్యపి సుపదం గంగనుకాసె- ఇత్యత్రస్థానివత్త్వేపి నోక్తదోష ఇతివివేకః- సంతోషముపడీతిరూపేతు పకారస్యతు వకారాదేశో భవత్యేవ- పకారశ్రుతిస్తు అథర్వణవచనాదితి జ్ఞేయం- 'సంతసంబుపడి గుర్విణ్ వైశ్య లిష్టంబునన్' ఇత్యాచార్యః- హ్రస్వాత్పరత్వేనార్థత్వమపి స్యాదితి మహానితి విశేషణం దత్తమనుస్వారస్యాచార్యేణ-

తా- ఔనయ్యా, సంతోషంపడి ఇత్యాదులయందు 'తస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్' జడవాచకశబ్దముల సంబంధియగు నాద్వితీయకుఁ బ్రథమయగును- [అని సంతోషశబ్దమునందు ద్వితీయకు] ప్రథమగులగుచుండఁగా ననుస్వారమునకు స్థానివద్భావముచేత మువర్ణకాంతత్వము గలుగఁగా ప్రథమామాత్రమునకం బెం బరములగు కచటతపలకు గసడదవలు వచ్చునను సూత్రముచే పకారమునకు వకారమగును- మఱియు ప్రథమామాత్రాత్ అనిమాత్రగ్ర

హణమువలన మువర్ణమునకు లోపముగలిగినపుడును వకారమగును- స్థానివద్భావమాంధ్రవ్యాకరణమునఁ బ్రసిద్ధము గాదని చెప్పఁదగదు- ఏకానొకచో సంస్కృతశబ్ద సంబంధియగు నచ్చును ఈయాంధ్రమున లోపించునను నధర్వణవాక్యమునందు స్థానివద్భావమునకుఁ బ్రసిద్ధిగలదు- అట్లుగానిచో గంగనుకాసె అనుచోట స్థానివద్భావమును వినాగా (దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్-) అని దీర్ఘస్థానమందు వచ్చిన హ్రస్వమునకు సంస్కృతిసంబంధి యగుట యెట్లుగా సిద్ధించును- అని యందురేమో, సత్యము- వకారవిధిస్థానియగునక్షరము నాశ్రయించినవిధియగుటచేత నిచట స్థానివద్భావము లేకపోవుటవలనఁ జెప్పిన దోషము ప్రసక్తించదు- 'స్థానివదాదేశో నల్విధౌ' ఆదేశము స్థానివంటిదియగును- (అనఁగా స్థానియున్నపుడే కార్యముజరిగెనో యది యాదేశము వచ్చినపుడును జరుగును) స్థానియగు నక్షరము నాశ్రయించిన కార్యము చేయవలసియుండఁగా స్థానివద్భావము లేదు- అను పాణినీయ సూత్రమందు అల్విధి యనుచో అల్లు (అక్షరము) పరమగుచుండఁగా విధి, అల్లుచేనైనవిధి, అల్లుయొక్కవిధి, అల్లుకంటెఁ బరమగు విధియని నాలుగురీతుల వ్యాఖ్యానము, శాస్త్రపారగులయినవా రంగీకరించిరి దానినాపాణినీయ వ్యాకరణమునఁ జూడవలయు-

ఇఁకమువర్ణలోపము గలుగుచుండఁగా, పకారమునకు వకారము రాదు- మాత్రశబ్దమునకు అప్పుడుదావచ్చెనుచోట (ప్రథమాతుల్యమగు నవ్యయమునకంటెను) ఘటియింపుచున్నాఁడుగదా- అనుచోట [ప్రథమాతుల్యమగు క్రియకంటెనుబరంబుగా నీకార్యమువచ్చుటకయి చేయఁబడినది యగుటవలన-] ఆదంతపాది అను నధర్వణ వాక్యమును ఇక్కడఁబ్రమాణము- కావుననిది లెస్సగనున్నది- గంగను కాసెయనుచో అల్విధిలేదు- కావునస్థానివద్భావముండినను జెప్పిన దోషములేదని స్పష్టమయినది- సంతోషముపడె అనురూపమందయి

తే పకారమునకు ఏకార మాదేశము కానేవచ్చును- పకారమువినఁ
బడుటయితే అధర్వణ వచనమువలన నగుచున్నదని తెలియ వలెను-
"సంతసంబుపడి యర్థిక్ వైశ్య లిష్టంబునకు" అనియాచార్యుఁ డు-
హ్రస్వమునకంటెఁ బరమగుటచే వరిసున్నయుఁ గలుగునని యుదిరి
ఉండుటకయి బిందుపూర్వక మహచ్ఛబ్ద విశేషణము నాచార్యుఁ డిచ్చె.

సూ॥ షష్ఠ్యాఉతో వినుష్నుచ.

వ్యా॥ షష్ఠ్యేకవచనసమాసే ఉకారాంతపదస్యనుష్నూ భవతః. స
ఇతిసమాసస్యసంజ్ఞాసస్సమాసఇతి ప్రాకృతవ్యాకరణసూత్రాల్లిప్. రా
జునెదుట, పామునెమ్ములు, మోమునందము, ఇత్యాద్యుదాహరణం.
మోమందము, తమసాధునయనము ద్దుకొమరు నెహ్హ సత్ప్రయోగః.
మోమందమిత్యాదిప్రయోగస్తుసాధురేవ అత్రినుమోమిత్యేన ఉ
కంతావమపత్వాల్లుప్తద్రుతద్వితీయాయాః షష్ఠ్యర్థప్రత్యయ ఇతి ప్ర
తిబంధోనివార్యతే.

తా॥ షష్ఠ్యేకవచనసమాసమందు ఉకారాంతపదమునకు నువర్ణా
రమగుచుండెగాని మాగమమగును. [మాగమమనఁగా ప్రముయొక్క-
చివరనుండునచ్చునకుఁ బైగా నకారమువచ్చుట] స స్సమాసః అని ప్రా
కృతివ్యాకరణసూత్రమువలన స అనసమాసమునకు సంజ్ఞ. రాజునె
దుట నిత్యాదులుదాహరణములు తమసాధున ఇత్యాదులు ప్రయోగ
ములు, మోమందము ఇత్యాదిప్రయోగమైతేమందదకాదు. ఇచ్చట
నుమాగమమునకు కారమిత్సంజ్ఞ కలదికావున ఉకారాంతమున కవ్యవ
హితమగుటవలన లోపించిద్రుతముగలద్వితీయయు షష్ఠ్యర్థమునుతెలిపిత
చుటయందు ప్రతిబంధముమాన్పబడుచున్నది,

సూ॥ ఆద్యస్యామ్రేడితేఽంత్యస్యలోపశ్చ.

వ్యా॥ శబ్దే ఆమ్రేడితే ద్విరుక్తే సత్యాద్యస్య శబ్దస్యాంత్యస్యవర్ణస్యలోపః
స్యాత్. ఓహోహో! ఔరౌరా! అన్నన్న! అయ్యయ్య

ఇత్యాది యద్యప్యామ్రేడితం ద్విస్త్రిరుక్తమిత్యమరవచసా త్రిరుక్తస్యాప్యామ్రేడితసంజ్ఞాఽస్త్యేవ తథాపి తత్ప్రయోగాభావాద్విరుక్తస్యేత్యుక్తం ద్విరుక్తస్యాత్ర ప్రయోగేఽజాదిత్వమేవ. అచీతిపదానువృత్తిరత్రమానం "తస్య పరమామ్రేడితం" ఇతి వ్యాకరణమనుసృత్య ఆమ్రేడితేపరే ఇతివా వ్యాఖ్యేయం.

తా. అచ్చాద్యక్షరముగల శబ్దము రెండుసారులు చెప్పఁబడుచుండఁగా మొదటిశబ్దమునకు నంత్యవర్ణము లోపించును ఓహోహో ఇత్యాదులుదాహరణములు విచారించఁగా "ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తం" అని నామలింగానుశాసనమువలన ముమ్మాఱుచెప్పిన దానికింగూడ నామ్రేడితసంజ్ఞకలదు. అయినను దానికి ప్రయోగములేదు కావున రెండుమాఱులుచ్చరింపఁబడినది యని చెప్పఁబడియె. ఈప్రయోగమున ద్విరుక్తశబ్దము అచ్చుమొదటగలదే. హలాదికము కాదు ఇందును ఈసూత్రమునందు అచి యనుపదము ననువృత్తిచేయుటప్రమాణము "తస్య పరమామ్రేడితం" అనుపాణినివ్యాకరణము ననుసరించి యామ్రేడితము పరముగనుండఁగా ననియైనను వ్యాఖ్యానముఁ జేయఁదగినది

సూ॥ అహామాదీనాంద్విత్వం.

వ్యా. యోగ్యతాబలాదచీత్యనువృత్త్యాచానుకరణ ఇతిలభ్యతే. వాక్యాంతగతానామహహమాదిశబ్దానాం పృథగ్భూతానాంచాంత్యవర్ణస్యద్విత్వంస్యాదనుకరణే, దాసోహమ్మని, "జ్ఞాతశ్చేదశేవకిమ్మనెదువాచారూఢిసత్యమ్మగ" నిత్యాద్యుదాహరణం. అహమ్మనీత్యాది అథర్వణేనాప్యుక్తం. శ్లో॥ అంత్యగస్యహలోద్విత్వ భవదనుకృతే పరే। తత్రాచ్యుతోభవేన్నిత్యమత్రతత్ప్రవదిష్యతి ఇతి బాలసరస్వత్యాంత్వత్ర అహహమాదిశబ్దానామంతిగస్యాచ స్వరస్యద్విత్వయో

